## Bibliographic Record Target

పుణ్యవిజయము / కాకినాడ : ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్, 1927.

(1), 183, (4) p. ;16 cm.

Record no. 223

Puṇyavijayamu / Kākināḍa : Āṃdhra Pracāriṇī Limiṭeḍ, 1927.

(1), 183, (4) p. ;16 cm.

Record no. 223

*

# PUNYAVIJAYAMU

(A PURANIC TELUGU NOVEL.)



INDRAGANTI HANUMATH SASTRY,
RETD LECTURER
8 TH WARD, KAVALI-[illegible] 201,
NELLORE DT., (A. P.)



PUBLISHERS:
ANDHRA PRACHARINI LTD.,
COCANADA.

# పుణ్య విజయము



ప్రకాశకులు :

ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్,

కాకినాడ

 [వెల 1—4—0

*

# FOREWORD.

---

I read portions of this book, and was much pleased with the facile and chaste expression, and the skilful development of plot adopted in it.

This is a novel based on a puranic story and is interspersed with fine passages which are conducive to the elevation of the moral tone of its readers. It depicts the complete discomfiture of sin and the ultimate triumphs of righteousness. Its style is classic and pleasing without being pedantic in the least, and its personae are set with due care and propriety.

In short, its glowing style and ennobling maxims speak much of the author, both as a writer and a preceptor.

The times show a keen awakening, in the reading public for the study of vernacular publications; and I believe that this sweet little volume makes very interesting reading to pupils of all ages and contributes largely to their betterment.

I heartily commend its favourable reception which it well deserves.

SAMALKOTA,
Dated 28-8-1927

K. Sundararamiah,
*Head master,*
BOARD HIGH SCHOOL.

# సగరపట్టాభిషేకము.

## మొదటిప్రకరణము.

అయోధ్యాపురాధీశ్వరుఁ డగు బాహునకు విమతియు, సుమతియు ననునిరువురు భార్యలుండిరి. ఇంతియకాక యాతనికి భోగవిలాసిను లనేకులు గలరు. ఆతఁ డిక్ష్వాకువంశజుఁడే యైనను, తనపూర్వులగౌరవమును వహించునంతటిశక్తి గలవాఁడు గాఁడు. వయసు చెల్లినతరువాత నాతనికి విమతియం దొక తనూజయు, సుమతియం దొక తనూజుఁడును గలిగిరి. సుమతిగర్భవతియై యున్నసమయమందే విమతి యామెకు విషప్రయోగము గావించెను. కాని దైవవశమున నాసాధ్వి మరణింపకుండుట యే కాక యొకసుపుత్త్రునిఁ బ్రసవించి క్షేమముగానుండెను. గరళసహితముగ జనించుటంజేసి యాకుమారునకు సగరుఁడని పేరు పెట్టఁబడియెను. విమతినైపుణ్యము వలన సుమతి కెవ్వరు విషముపెట్టినదియు ననుమానించుటకైన నవకాశము లేకుండఁ బోయెను. తనప్రయత్నము విఫలమగుటచే విమతి తనసవతి మొశలుంగల యసూయ వంత స్తంభితము

గఁ జేసికొని మరల నట్టియనుకూలసమయమున కెదురుచూచుచుండెను.

ఎంతగూఢముగనున్నను సవతియందు విమతికిఁ గల యసూయ యెంతమిక్కుటముగ నుండెనో ప్రవర్తనమునుబట్టి రాజునకు విస్పష్టమగుచుండెను. ఇట్టివిషమయంబగు కుటుంబ విషమావస్థలో మహారాజు తనపుత్త్రికాపుత్త్రికులను జూచుకొనుచు నరకనిద్రలో స్వర్గస్వప్నములం గాంచుచున్న వానిం బోలి యెట్లో కాలక్షేపము చేయుచుండెను. దినములు గడచినకొలఁది నాతనికి రాజ్యమునందును జీవితమునందును వైరాగ్యభావము గలుగుచుండెను. కాని బిడ్డలు చిన్నవారగుటచే రాజ్యమును వదలి వానప్రస్థమును స్వీకరించుట యాతనికిఁ బ్రాణసంకటముగా నుండెను.

ఇట్లుండ నాతఁడొకనాఁడు తనమంత్రిని, సర్వసేనానాయకుఁడగు సేనుని సభకుఁ బిలిపించి సకలప్రజాదండనాయక సామంతసమక్షమునం దాయిరువురికి రాజ్యభారమంతయు నొప్పగించి మీరు నామాఱుగా నీరాజ్యమంతయు యథోచితముగఁ బరిపాలించుచుండవలయు ననియు, మరణదండనములు, ప్రధానదండయాత్రలు మొదలగు ముఖ్యవిషయములందు నాయాలోచనమును గైకొనుచుండవచ్చుననియుఁ జెప్పి యొప్పగించి స్వధర్మనిర్వహణముం గూర్చి వారికి నీతిబోధలను గావించుచుండెను. ఆసమయమునందు స్వర్గలోకమునుండి



నారదమహర్షి తనవీణాస్వరముతోఁ గంఠస్వరమును మేళగించి

“హరినామమె పరమార్థము,
ఆనందనిధానము శ్రీహరి.
పరతత్త్వసమీకరణము-భవసాగరసంతరణము
నిరవధికసుఖాభరణము-నిఖిలజనోద్ధరణము శ్రీ”

అని గానము చేయుచు సభాస్థానమునకు విచ్చేసెను. ఆకస్మికముగ నాదేవర్షియాగమనముం గాంచి ప్రభువగుబాహుండు భయభక్తిసంభ్రమములతో లేచి యెదురేఁగి యాతనిం దోడితెచ్చి యుచితాసనాసీనుంగావించి యథార్హరీతిఁ బూజించి యమ్మునిచంద్రుని యానతిం గాంచి యుపవసించియుండెను.

నారదుండును కుశలప్రశ్నంబు చేసి యెల్లవిషయంబుల నెఱింగి యానందముతో “మహారాజా! నీతనయుండగు సగరుండు దైవబలసంపన్నుఁడు. ఆతఁడు గుణగౌరవంబులచే మీ పితృపితామహాదులను మించి యభూతపూర్వంబు లగు తేజోబలవిక్రమంబులచేఁ బ్రసిద్ధుం డగును. ఆతని ధర్మపాలనంబున భూలోకంబంతయు స్వర్గలోకముంబోలి సర్వసంపన్నంబు గాఁగలదు. ఆతని యమూల్యసాహాయ్యము దేవతలకుఁగూడ వాంఛనీయమై యుండును.” అని చెప్పుటయు రాజు “మునీంద్రా! నాతండ్రితాత లందఱును నావయసు వచ్చునప్పటికే వానప్రస్థాశ్రమమును స్వీకరించి కృతకృత్యులైరి. కాని

నాకట్టిభాగ్య మింకను లభింపలేదు. కుమారున కింకను నెని
మిదేండ్లైన దాఁటలేదు. ఆతఁడిప్పుడు కులగురుండగు వసిష్ఠు
నొద్ద విద్యాభ్యాసము సేయుచున్నాఁడు. అతనిపై రాజ్యభా
రమునుంచి నేనిప్పుడు తపంబునకుఁ బోవుదునా యని
యాత్రపడుచున్నాను. కుమారుని భవిష్యముంగూర్చి తమ కే
మితోఁచుచున్నదో యానతీయవలయును" అని ప్రార్థించెను.

నార—తోఁచుట కేమున్నది? ఆకుమారునకు బా
ల్యమునందుమాత్రమె శత్రువులవలనఁ గొన్నికష్టములు గలు
గును. అయినను దైవానుగ్రహముచే నాతఁడు స్వశక్తిమూల
ముననే విపద్విముక్తుఁడు కాఁగలుగును. ఆతనివంశీయులచే
నీలోకమునందెన్నఁడును లేని మహోపయుక్తకార్యము నిర్వ
హింపఁబడును.

అని నారదుఁడు చెప్పినంతనే ప్రభుభక్తిపరాయణుఁడు
ను, సర్వసేనానాయకుఁడునగు ప్రసేనుండు "మునీంద్రా! ఆ
ఘనకార్యమేదియో సెలవీయవలయు" నని ప్రార్థించెను. ఆ
సంగతి నిప్పుడు చెప్పఁగూడదని నారదుఁడు వచించెను.
అప్పుడు మహారాజు "దేవర్షితిలకా! మీయాశీర్వాదప్రభా
వముచే సగరకుమారుఁడు చిరాయుష్మంతుఁడును, విజయశీ
లుఁడు నై వర్ధిల్లుఁగాక—భవదాగమనకారణమును వినఁ గు
తూహలపడుచున్నాఁడను'' అనియెను.

నార—రాజా! నీకిప్పు డేదియో యశుభము జరుగ



నున్నట్లు యోగదృష్టివలన నాకు గోచరించుటచే జాగ్రత్తతో
నుండుమని నిన్ను హెచ్చరించుటకై వచ్చితిని.

ఆమాటవిన్నతోడనే రాజదరిపడి "మహాత్మా! అందు
వలన సగరకుమారున కెట్టియమంగళములు గలుగదుగద?"
అనియెను. నారదుఁ డించుక యోచించి "ఏమో-అదృష్టా
కాశమునం దెప్పు డేవంక నెట్టి ఝంఝామారుతములు బ
యలుదేఱునో యెవ్వరు చెప్పఁగలరు? కానియీసమయము
నందు నీవు సావధానుఁడవై యున్నచో నెవ్వరికి నెట్టియిబ్బం
దియును గలుగదు. నీకుటుంబక్షేమమును, నీరాజ్యస్థితియు
నీసావధానతపై నాధారపడి యుండును'' అనియెను.

రాజు—మునీంద్రా! ఈనడుమనే యపరిచితు లగు
నిరువురుపురుషులకు నారాజ్యమునందుఁ దావొసంగితిని.
వారిమూలమున నేమైన నపకారము గలుగునా?

నార—అపరిచితుల కాశ్రయము నిచ్చుట యనుచిత
ముగాదా? ఎవ్వరిమనసులో నేముండునో యెవ్వరు గ్రహిం
పఁగలరు?

రాజు—అట్లయినచో వారిని రాజ్యమునుండి వెడలఁ
గొట్టుమందురా?

నార—ఎంత వెఱ్ఱి! మరల వారు నీకంటి కగపడుదు
రా? అనాలోచితముగఁ జేసినపను లమంగళములు గల్పింపక
మానవు. సరే. జరిగిపోయినవిషయములుగూర్చి యేమనుకొ

న్నను లాభము లేదు. ఇఁక నామాట కేమిలెమ్ము! ఇప్పు డొకసారి నీకుమారు నిటకుఁ బిలిపింపుము. నేనాతని నొక మంత్రదీక్షితునిం జేయఁదలఁచి వచ్చితిని.

అనుటయు మహారాజు పరమానందముతో "మునికుల తిలకా! ఈమీయకారణవాత్సల్యము మాకుఁబరమసౌభాగ్య దాయకముగాదా! అంతఃపురమునకుఁ బోయి నేనే కుమారుని వెంటఁబెట్టుకొని వచ్చెదను." అని చెప్పుచుండఁగా రక్షక భటుఁ డొకచోరుని బట్టుకొని సభాస్థానమునకుఁ దెచ్చి "మహారాజా! ఈతఁడు దొంగ. ఈతనియపరాధ మంతయును సప్రమాణముగ రుజువుపడినది. ఈతని కుచితదండనమును గావింపవలయును" అని మనవి చేసెను.

రాజు పరమాశ్చర్యకంపితస్వరముతో "ఓయీ! మన రాజ్యమునందు దొంగతనమా? ఈతఁడు చోరుఁడా?" అని నివ్వెఱపడి మఱిమాటాడక విభ్రాంతునివలెఁ జూచుచుండెను. అప్పుడాతనిహృదయాంతరాళమునం దెన్నియోసంశయములు గలిగిపోవుచుండెను. అప్పుడు చోరుఁడు చేతులు జోడించుకొని మహారాజునెదుట నిలువఁబడి "మహాప్రభూ! నాజీవితకాలమందు నేనిదివఱ కెన్నఁడును దొంగతనము చేసియుండను. దురదృష్టవశమున నేనీనాఁడు త్రోవనే పోవుచుండఁగా నాయెదుట నొకబంగారువస్తువు పడియుండెను. అప్పు డపరిచితులగు నిద్దఱుపురుషులు నాకెదురైరి. అందొకఁడు



నన్నుంగాంచి "ఓవెఱ్ఱివాఁడా? అట్లుచూచెద వేమి? ఆవస్తువును దీసికొనిపొమ్ము!" అని హెచ్చరించెను. అప్పుడే రెండవవాఁడు "నాయనా! వలదువలదు! ఇది నీది కాదుగదా! ఒరులసొమ్మున కేలయాసపడవలయును? ఆసపడి తీసికొనిపోయినను, అధికారులు నిన్ను శిక్షింపక విడిచిపెట్టుదురా? ఊరక తప్పుచేసి దండింపఁబడుట యెందులకు?" అని మందలించెను. అప్పుడు మరల మొదటివాఁడు "అదేటిమాట? చేతికబ్బినసొమ్మును జెడఁగొట్టుకొనువెంగలి యెవ్వఁడుండును? ఇప్పుడిదియంతయును జూడవచ్చినవా రెవ్వరున్నారు? రెండవకంటివాఁ డెఱుఁగకుండఁ జటాలునఁ దీసికొని యీసందుత్రోవనే పాఱిపొమ్ము!" అని నన్నుఁ బ్రోత్సహించెను. నేనాతనిమాట విని యావస్తువు నందుకొని పాఱిపోవుచుండఁగా రక్షకభటులువచ్చి నన్నుఁబట్టుకొని తమసన్నిధికిఁ దెచ్చినారు. ప్రభూ! పరబుద్ధి నాశ్రయించి నాజీవితమునందు నేఁ జేసిన తప్పిది యొక్కటియే" అని మనవిచేయుచుఁ బశ్చాత్తాపముచేఁ గ్రుంగిపోవుచుండెను.

ఈకథయంతయు నాలకించి నారదుఁడప్పుడు "మహారాజా! నీరాజ్యమునందు నీవపరిచితుల కాశ్రయమిచ్చితివి. అందులో నొక్కని ప్రోత్సాహముచే నమాయకుఁ డగునీపురుషుఁ డపచారమునకుఁ బాల్పడవలసివచ్చెను. ఇది నీయవిచారమువలనఁ గలిగిన లోపము" అనియెను.

ఆమాట విని రాజు తనతప్పును యాపురుషుఁ డిదివఱ కెన్నఁడు నట్టిదుష్కార్యమును జేయ లేదని తెలిసికొని యాతని క్షమించి విడిచి సభ చాలించి మహిషీసహితుఁడై లోనికి బోయెను.

---

## రెండవప్రకరణము.

---

"చేసినపని యంతయును జెడిపోయినది. ఎవ్వరికిని దెలియరాకుండ విషప్రయోగమును జేసితిని గాని గర్భపాతమైనది గాదు. ఏడేండ్లకుఁ దరువాతఁ గుమారునిఁ బ్రసవించినది. చూచుచుండఁగనే యాతఁ డిప్పు డెనిమిదేండ్లవాఁడయ్యెను. కొన్నాళ్లకు యువరాజుగూడఁ గాఁగలఁడు. అప్పుడాతనితల్లి సుమతి రాజమాత యగును. ఇఁక నిర్భాగ్యురాలనగు నేనో—ఈరాజగృహమునం దొకదాసితో సమానముగనుండి పరిభవపరితప్తంబగు హృదయముతో నతిహేయముగ జీవయాత్ర గడపవలయును. దాసీజన మంతయు రాజమాతయగునామెనే యనుసరించియుండును. నా మొగముచూచు నొక్కదాసియు నగరునందుండదు. ఔరా! పెద్దరాణికుమార్తె జ్యేష్ఠురాలుండఁగాఁ జిన్నరాణికుమారుఁడు కనిష్ఠునకు రాజ్య



సంక్రమణమా? ఇట్టి మూర్ఖులగు రాజధర్మనిర్దేశకుల పక్షపాతముగాని యిది న్యాయమేమైన నున్నదా? ఈమాట తలఁచుకొన్న వేయితేళ్ళు కుట్టినట్లుగా నాయొడలంతయును మండిపోవుచున్నది. నేను జీవించియుండఁగా నెప్పటికైన నింత పని జరుగనిత్తునా? నాయుద్దేశము నొకసారి మహారాజుతోఁ జెప్పితినిగాని యాతఁ డంతగా లక్ష్యముచేయలేదు. అతఁడు నిజముగా నాకు వ్యతిరేకముగఁ బనిచేసినయెడల నేనీసంసారోద్యానమును దావాగ్నిజ్వాలలచే నీఱపివేయక మానుదునా? కానిమ్ము! కొంతకాల మోపికపట్టి చూచెదను."

పట్టమహిషి యగువిమతి యీవిధముగా భావించుకొనుచుండఁగా దాసి పువ్వులపళ్లెరమును దెచ్చి యామెచెంత నుంచెను. విమతి దాసింగాంచి "మల్లికా! నీవు పువ్వులను దెచ్చితివి గాని నేఁడు నామనసేమియు బాగుగ లేదు" అనియెను.

మల్లి—అదేమమ్మా?

విమ—ఏమని చెప్పుదును? రాజకుటుంబమునందలికష్టములు నీకెట్లు తెలియును?

మల్లి—మహారాజునకు దేవేరులగు మీకేమిలోపమమ్మా!

విమ—లోపమేమియును లేదు. కుటుంబమున మంచియేర్పాటులు లేనిలోప మొక్కటియే యున్నది.

మల్లి—అట్లనెద కేమితల్లీ! రాజ్యమందంతటను మంచి పద్ధతులను గల్పించు రాజసంసారమునందే లోపములా ?

విమ—మల్లికా ! ఇది చాల నిగూఢవిషయము—రాజునకు రాణియై జీవించుట యెంతబాధయో నిఱుపేదవగు నీకెట్లు తెలియును ?

మల్లి—దేవీ! నీకుఁగూడ బాధయేనా? దురదృష్టవంతులగు మావంటిపేదవారికి దుఃఖములు గాని నీ కేమమ్మా!

విమ—వెఱ్ఱిదానా ? నీకున్నసుఖములో నూఱవవంతైనను నాకు లేదని నమ్ముము.

మల్లి—ఎంతమాట తల్లీ! మీమాటలు నాకేమియు బోధపడుట లేదు. ఇప్పుడు మీకింతకష్టము గలుగుటకుఁ గారణ మేమున్నది ?

విమ—ఏమున్నది ? సవతితనమే—

మల్లి—అమ్మా! ఈమాట నేనెప్పుడును భావించుకొనలేదు. అక్కచెల్లెండ్రవలె మీరిరువురును మసలుచుండుటచే మనసులుగూడ నట్లే యున్నవని యనుకొనుచున్నాను.

విమ—అగ్నిస్ఫులింగము ప్రవేశించినంతనే మంటలు రగులుకొనునా? ఇప్పటి కది నాహృదయమున జ్వాలారూపముం దాల్చి క్రమముగా నన్నాహుతి చేసికొనుచున్నది.

మల్లి—అయ్యోతల్లీ! నీవు దినదినమునుక్షీణించిపోవుచున్నావు. చెప్పుట కభ్యంతరము లేనియెడల నీవిచారసమ



భాగిని యగునీదాసికి నీమనసులోనిమాట చెప్పఁగూడదా ?

విమ—మల్లికా ! ఇంతంతయని చెప్పరానియాతన ననుభవించుచున్నాను. అల్పురాలవు, నబలవు నగు నీకేమి చెప్పిన నేమిలాభము? ఈరహస్యము బయల్పడినచో నెటుపోయి యెటువచ్చునో యెవ్వరు చెప్పఁగలరు !

మల్లి—అమ్మా! నాయెడల నీకు నమ్మకము లేదా ? నేను నిన్ను చిన్నరాణిగారికంటెను నధికముగాఁ బ్రేమించుచుంటిని గాదా ?

విమ—ఔనే! ఆప్రేమ యింకెన్నాళ్ళుండును? కాలక్రమమున నంతయు నెగసిపోవును.

మల్లి—అమ్మా! అట్లెన్నఁటికి భావింపవలదు. నీకు నాకంటె నమ్మినపరిచారికలు లేరు. చెప్పుముతల్లీ! మహారాజుగారు నీయెడల విరక్తులై యున్నారా?

విమ—మాటలలో లేరు గాని మనసులో నటే—కాకున్నచో నన్నభాగ్యురాలిగను, సుమతిని భాగ్యవతిగను జేయుట కేల ప్రయత్నించును?

మల్లి—ఆలాగా? ఇంతయలక్ష్యమునకుఁగారణమేమి?

విమ—పక్షపాతమే—రాజధర్మము క్రూరమైనది గాదా? కొంతకాలము చూచి సగరునకుఁ బట్టాభిషేకము చేసి తాను వానప్రస్థమును స్వీకరించెద నని నేఁటిసభలో మహారాజుగారు చెప్పినారఁట.

మల్లి—ఆలాగా? సగరకుమారుని సార్వభౌమునిఁ జేసి నిన్ను సంపద్విహీనురాలిగాఁ జేయునా?

విమ—నన్ను వేఱుగఁ జేయుట యెందులకు? నేనే యగుదును. అప్పుడు సుమతి రాజమాత యగును గదా—దాసదాసీజనమును, రాజ్యసంపదలనుగూడ నామెయధీనము లగును. ఇఁక మహారాజు నన్ను రాజాంతఃపురమునుండి వెడల నడచు టెందులకు? ఇది యంతయుఁ జూచుచు బాధపడలేక నాయంతట నేనే పోవుదును.

మల్లి—అమ్మా! మహారాజెన్నఁడైన నిట్టిభావమును నీయెదుటఁ బ్రకటించెనా?

విమ—ప్రకటింపకున్న గుణములనుబట్టి తెలియదా? ఒకసంగతి చూడుము! సుమతి పుత్రవతియైనది మొదలుగ నాతఁడు చాలసేపామెయొద్ద నేగదా కాలక్షేపము! ఆతనికి నాకొమార్తెకంటె నామెకుమారుఁడే ప్రేమచంద్రుఁడు.

మల్లి—అమ్మా! ఇప్పుడు మన కుపాయ మేమి?

విమ—ఈపరితాపానలజ్వాలలో భస్మీభూతనై పోవుటకంటె నిఁక నుపాయ మేమున్నది?

మల్లి—అదేమమ్మా! అట్లనియెదవు?

విమ—మల్లికా! ఏమిచెప్పుదును! నాకు సంతానము గలుగనప్పుడు మహారాజు ద్వితీయవివాహముంగూర్చి ప్రస్తావింపఁగా నేనప్పుడానందముతో నంగీకరించితిని. నేనొక్కతె



నై యుండుటకంటె నిరువుర మైనచో సుఖముగా నుండవచ్చు ననుకొంటిని. సపత్నీరాహువు వచ్చి నాశాంతిచంద్రుని సంపూర్ణముగఁ గబళించివైచునని నేనప్పుడు భావించుకొనలేదు. నాపూర్ణిమారాత్రియమవసచీఁకటిచే నావృతమైపోవునని గాని నాసుఖమయదేహక్షేత్రమునం దంతటను దుఃఖబీజము లంకురితము లగునని గాని నాకప్పుడు తోఁచనే లేదు.

మల్లి—దేవీ! అదియే నీవుచేసిన పొరపాటుపని!

విమ—ఔను! స్వయముగాఁ దెచ్చుకొని మంచినోటఁ జేదు మేసితిని. నాశాంతిప్రసూనాంతరాళమున సపత్నీకీటమును జేతులారఁ బ్రవేశపెట్టుకొంటిని. మల్లికా! ఈలోకమునందు సతీమణులకు సపత్నీత్వ మెంతటికఠినశిక్ష యనుకొన్నావు! వైధవ్యదుఃఖము దానిలో శతాంశమైనను గాదు. సపత్నీబాధ భూలోకనరకయాతనయే—నేను మాటలతోఁ జెప్పఁజాలకున్నాను. నామనసులోనియాతన యీశ్వరుఁ డెఱుంగును. అశనిఘాతమునైనను, అనలజ్వాలనైనను సహింపవచ్చును గాని సవతియున్నతిమాత్రము దుస్సహమైనదిసుమా!

మల్లి—అమ్మా! చిన్నరాణి మీయెడల నట్లు ప్రవర్తించుచున్నదా?

విమ—ఇప్పుడు లేదు. ఇఁక రాజమాత యగునుగాదా? అప్పటినుండి తనయధికారమును జూపించుట కారంభించును. ఇంకెన్నాళ్లు! నాకాదురదృష్టదినములు సమీపించియే

యున్నవి. ఇఁక నాకు సవతితో సంసారమునం దుండుటకంటె
స్వామితో నరణ్యావాసముచేయుటయే మహాసుఖము !

మల్లి—దేవీ ! మనశోభనకును సగరకుమారునకు
నెంతస్నేహమమ్మా! వారొకరి నొకరు విడిచియుండఁగలరా?
ఒకవృంతమునందలి కుసుమములవలె నెప్పుడును జతగూడియే
యుందురు.

విమ—ఔను. కాని యందొకకుసుమము రాజశయ్యం
జేరి యాదరింపఁబడును. ఇఁక రెండవది వృంతచ్యుతమై
యాదర మనుమాట లేక యట్లే శుష్కించిపోవును.

మల్లి—దేవీ! పాపపుదైవము సుఖసంసారమున దుఃఖ
సూచనలనే కల్పించుచుండును. అది యాతని విలాసమో,
మోసమో యెవ్వరు నిశ్చయింపఁగలరు? పరిమళించుగులాబిని
పట్టరానిముండ్లు పుట్టించుటయు, అమృతమును గల్పించి
యందరాకుండ నాకసమునం దుంచుటయు, వెలుఁగులీనురత్న
మును విషఫణిశిరంబునఁ గూర్చుటయు, అరవిందముల నగాధ
జలంబులనడుమ నిలుపుటయు, ఆణిముత్తెముల నాలిచిప్పలలో
దాఁచుటయు మతిమాలినపనులుగాక మఱియేమి !

విమ—మల్లికా ! నామనసంతయును గలఁగిపోయినది.
నీవొకసారి మంత్రియింటికిఁ బోయి సేనాపతి నిటకు రమ్మంటి
వని చెప్పుము.

మల్లిక—చిత్తమని చెప్పి వెడలిపోయెను.

---

## మూఁడవ ప్రకరణము.

---

విమతి వికలహృదయముతో నేమేమియో యింకను
నాలోచించుకొనుచు నట్లే కూర్చుండియుండెను. ఏపాపము
నెఱుఁగనిసగరకుమారునిపై నామెకుఁ గోపముగలుగుట లేదు.
ఆకుమారునియందు పక్షపాతము వహించియున్న రాజునందే
యామెకోపము ప్రసరించుచుండెను. ఆపక్షపాతవశంబునఁ
బుత్త్రవతి యగుసవతి రాజమాత యగు నను నసూయ యా
మెను వేఁచుచుండెను. అయసూయాక్రోధములు జ్వాలా
మయములై యామెహృదయాంతరాళమున నతిఘోరముగ
నలముకొని వచింపశక్యముగాని బాధను గల్పించుచుండ
నామె యెన్నియోవిధములఁ దత్ప్రతీకారమునకై యాలో
చించుకొనుచుండెను.

ఇంతలో సుమతి యచ్చటికి వచ్చుటయు విమతి
యామెం గాంచి తనమనోభావము ముఖవైఖరిని దోఁపకుండ
నడంచుకొనుచుండియు నసూయాగర్భితమగు స్వరముతో
"సుమతీ! మహారా జింకను నంతఃపురము వదలి రాఁదలఁచు
కొనలేదా ?" అనియెను.

సుమ—అక్కా! ఆయన నాచెంతకు రాలేదు. ఇటకు
వచ్చియుండెనేమో యని భావించి నేనిచ్చటికి వచ్చితిని.

విమ—లేదు. లేదు. ఆయన నాయింటి కేలవచ్చును? ఆతఁ డిప్పుడు తఱచుగా నీయొద్దకేవచ్చుచుఁ బోవుచుండెను గాదా?

సుమ—ఏమో! నే నాసంగతి నంతగాఁ గనిపెట్టుట లేదు.

విమ—ఆనందమున మునిఁగియున్న నీ కాతఁ డెంతతఱచుగా నీయింటికి వచ్చుచుండెనో లక్ష్యము సేయుట కవకాశ మెక్కడిది?

సుమ—సోదరీ! అట్లుగాదు. ఆయన నిజముగా నీయొద్దనే చాలసేపు గాలక్షేపము చేయుచుండును.

విమ—నీపరిచారికలు నీకట్లు బోధించుచున్నారు కాఁబోలును!

సుమ—అక్కా! ఇంత చిన్నమాట కంతదూరము విమర్శించుకొని కోపము తెచ్చుకొందువేల? నీవింత కోపించుకొనునంతటిమాట నేనేమియు ననలేదే!

విమ—అనకేమి? మహారాజు తఱచుగా నీయింటికి వచ్చుచున్నట్లు నీవెఱుఁగనే యెఱుఁగవా? ఏమోకాని యిప్పుడు నాయం దాతని కంతయనురాగము లేదు.

సుమ—అక్కా! అట్లయినచో మహారాజిఁక నెవ్వరిని ప్రేమించుచున్నాఁడు?

విమ—ఏమో—ఆసంగతి యీశ్వరుని కెఱుక!



సుమ—సోదరీ! నీమాట నిజమే. ఈనడుమ నేకారణముచేతనోగాని యాతనిమనసు స్తిమితముగా నున్నట్లగపడుట లేదు. మునుపటివలె సంతోషముతో మాటాడుటయును లేదు. ఇదియేమి యిట్లున్నా రని యొకసారి యడిగితిని. "నావయసు చెల్లిపోయినది; కుటుంబస్థితిగతులు చూచినచో నాకేమియు బాగుగ నగపడుట లేదు." అని చెప్పిరి.

విమ—ఆలాగా? నీతో నిన్నిమాటలు చెప్పినవాఁడు నీకంటెఁ బెద్దదానను, పట్టమహిషిని నగు నాకొక్కమాటయైనను జెప్ప లేదే?

సుమ—అదేమిసోదరీ! ఆయనకు నీయెడల నేమైన మనోమాలిన్యము గలిగియుండునా?

విమ—ఏమో! ఆతనిమనసులోనియుద్దేశ మెట్లు తెలియును? సుమతీ! మహారాజు నావిషయమై యెప్పుడైన నేమైన నీతోఁ జెప్పెనా?

సుమ—లేదు. నేనేమియు నడుగను లేదు. ఆయన నీయెడల విరక్తుఁడై యున్నట్లు నాకెన్నఁడు ననుమానమైనఁ గలుగలేదు. కాని యాతనిమనసుమాత్రము పూర్వమువలె లేనిమాట సత్యము. ఎప్పుడును జంచలహృదయముతో నగపడుచున్నాఁడు.

విమ—నీతోఁగూడ సంతోషముగ సంభాషించుట లేదా?

సుమ—పూర్వమువలె లేదు. కాని మనసగరకుమారునిమాత్రము బాగుగనే ప్రేమించుచున్నాఁడు.

విమతి యులికిపడి "సగరకుమారుని బ్రేమించునప్పు డాతనితల్లినిమాత్రము బ్రేమింప కేమి ?" అని భావించుకొని "మనశోభననో?" అనియెను.

సుమ—శోభననుగూడను.

విమ—శోభనను సగరకుమారునితో సమముగాఁ బ్రేమించుట లేదనుకొందును.

సుమ—అక్కా! అట్లనియెద వేమి? కన్నతండ్రికిఁ దనయుఁడైనను, దనయయైనను సమానమే గదా ?

ఇట్లు వారు మాట్లాడుకొనుచుండఁగా నొకవంక సగరకుమారుఁడును, నింకొకవంక శోభనయుఁ దనచేతివ్రేళ్ళను బట్టుకొని వచ్చుచుండ మహారాజచ్చటికి విచ్చేసెను. అప్పు డాతని కాకసమున నున్న చంద్రుఁ డరచేతికి దొరకినట్లుండెను. అమృతరసము హస్తగతమైనట్లుండెను. ఉండదా మఱి! మరుభూమివలెనున్న యాతనికుటుంబ మిప్పుడు నందనోద్యానవనమైనది! రాజట్టిపరమానందముతో వచ్చి పట్టమహిషిం గాంచి "ప్రియా! ఇటుచూడుము! పుత్త్రికాపుత్త్రకు లిరువంకల మెలఁగుచుండు టెంతయానందముగా నున్నది! వీరికొఱకు మనమెందఱో దేవతల నారాధించితిమి; ఎన్నియో పూజలఁ గావించితిమి; ఇంతకాలమునకు మనసకలపుణ్యకా



ర్యములును సఫలములైనవి. మనసంసారోద్యానము కల్పకప్రసవ సురభిళమైనది. మనజీవితములు ధన్యములైనవి. ఇఁకఁ గావలసినదేమున్నది?" అనియెను.

అప్పుడు సగరకుమారుఁడు తండ్రింగాంచి "నాయనా! నీవు మాలో నెవ్వరి నధికముగాఁ బ్రేమించెదవు? అక్కనా నన్నా ?" అనియెను.

రాజు నివ్వెఱపడి చిఱునవ్వు నవ్వుచు "తండ్రీ! ఏల యిట్లడుగుచున్నావు ?" అని ప్రశ్నించెను.

సగ—మీకు నాయందే ప్రేమ యధికమని దొడ్డమ్మ చెప్పినది.

రాజు—కాదు నాయనా! నేను శోభననే యధికముగాఁ బ్రేమించుచున్నాను.

అని పట్టమహిషియగు విమతివంకఁ జూచి "విమతీ! నీపేరికిఁ దగినట్లే నీమాటలుకూడను! బాలకులయెదుట నిట్టి మాటలా? ఇవి క్రమముగాఁ బెరిఁగి యెంతపని చేయుననుకొన్నావు!" అనియెను.

విమతి నవ్వుచు "ఇంతమాత్రమునకేనా ? నవ్వులాటకొక్కప్పు డట్లంటిని." అనియెను.

రాజు—ఇట్టి నవ్వులాటయే కావలసివచ్చినదా ?

అని సుమతిం గాంచి "ప్రియా! నారదమహర్షి వచ్చియున్నాఁడు. ఆతఁడు మనసగరకుమారుని కేదియో యుప

దేశించి పోవలయునని వచ్చినాఁడు. నీవు శీఘ్రముగఁ బోయి కుమారున కన్నముపెట్టి పంపుము” అని చెప్పుటయు సుమతి సగరుని వెంటఁబెట్టుకొని వెడలిపోయెను.

అప్పుడు విమతి రాజుం గాంచి “మహారాజా! మీరు నేఁడుమొదలుగా రాజకార్యములనుండి విరమించునట్లు నేను వినియున్నాను. నిజమేనా?” అని ప్రశ్నించెను.

రాజు—ఔను.

విమ—అట్లయినచో రాజ్యభార మంతయు నెవ్వరి కొప్పగించితిరి?

రాజు—మంత్రిసేనాపతులకు--నేనిట్లు కొంతకాలము విశ్రమించి యనుకూలసమయమున సగరకుమారునకుఁ బట్టాభిషేకము చేసియనంతరము వానప్రస్థధర్మమున వలంబించెదను.

విమ—మహారాజకుమారి యగుమనశోభన నేమిచేయుదురు?

రాజు—మంచివరున కర్పించి మహావైభవముతోఁ బరిణయము గావింతును.

ఈమాట విమతికర్ణములకు వాఁడినారసమువలె నుండెను. అది స్వయముగా రాజునోటినుండియే వెలువడుటచే నామె నిర్విణ్ణయై “మహారాజా! అదియేమి? మనశోభనను సామ్రాజ్యమున కధీశ్వరిగాఁ జేయఁగూడదా? అని ప్రశ్నించెను.



రాజు—అదియెట్లు? కుమారుఁ డుండఁగాఁ గొమార్తెకు రాజ్యప్రదానమా?

విమ—ఏమి! శోభనమాత్రము మీతనయగాదా? సగరుఁడు నామెయు నొకచెట్టుకొమ్మలవంటివారే యైనప్పుడందొకని యాధిక్యమేమున్నది? పట్టమహిషి తనయ యగు శోభనను రాజ్యాధీశ్వరిం గావించినచో బాధ యేమున్నది?

రాజు—అది రాజధర్మముగాదు. రాజ్యభారమును వహించుటకుఁ గుమారుఁడే యర్హుఁడు. కొమార్తె కట్టియధికారముగాని, సామర్థ్యముగాని లేదు.

విమ—మీపక్షపాత మిట్లున్నప్పుడు నేనేమి చేయఁగలను? ఇందువలన సుమతికి సుఖమును, నాకు దుఃఖమును గలుగనై యున్నది.

రాజు—అదియేమి?

విమ—సగరుఁడు రాజైనచో సుమతి రాజమాత యగునుగదా! అప్పుడు నిర్భాగ్యురాలనగు నేను దాసినిగాక మఱి యెవ్వతె నగుదును?

రాజు—అట్లనుకొందువేల? పట్టమహిషివగు నిన్ను సగరకుమారుఁడు కన్నతల్లికంటె నధికముగనే గౌరవింపఁగలఁడు.

విమ—సగరుఁడు గౌరవించునా! మీ రేమియు నట్టియేర్పాటును జేసిపోవుట లేదుగద?

రాజు—దేవీ! నీ కిట్టి దురుద్దేశము లేలకలుగుచున్నవి?

విమ—కలుగవా? మీప్రేమప్రవాహ మొకవంక నే ప్రవహించి పోవుచున్నప్పుడు నాయేకపుత్రికయగుశోభనగతి ముందేమగునో యనువిచారము నాకుఁగాక మఱి యెవ్వరి కుండును?

రాజు—సార్వభౌముని పట్టమహిషివగు నీకు విచార మేల? సుమతి యన్నను, సగరుఁడన్నను నా కధిక ప్రేమయని నీవేల యనుమానించెదవు? ఇట్టి దుస్సంశయమునకు మనం బునఁ జోటొసంగినచో నది క్రమముగా రాజసంసారమును గంటకారణ్యమునుగాఁ జేసివైచును. తుదకది నీకును దారుణ దుఃఖముగాఁ బరిణమింపఁగలదు.

విమ—మీరిప్పుడు చెప్పుచున్నారు గాని నేనీవిషయ మును జాలకాలముక్రిందటనే యాలోచించుకొంటిని.

రాజు—దేవీ! ఇన్నిమాటలేల? ఇంతకుఁబూర్వము మనసంసారము నిరాశాసైకతములతో నిండిన యెడారియే గదా! పరమేశ్వరానుగ్రహముచే నందిప్పటికానందమయము లగు రెండు మొలక లంకురించి వర్ధిల్లుచున్నవి. అవి రెండును చిరతరాభ్యుదయములంగాంచుచు విస్తరిల్లునట్లు సర్వదా సర్వే శ్వరునిఁ బ్రార్థించుచుండుటయే మనకు విధాయకకృత్యము గాని యూరక లేనిపోనిసంశయములను బెట్టుకొని యాత్మ ద్రోహము చేసికొనుట యేమిలాభము?



విమ—నేనెప్పుడు నట్లే దైవప్రార్థనము చేయుచున్నా ను. ఒక్కమాట యడిగెదను. చెప్పెదరా? మనకుమారిక యగు శోభన మన సంసారోద్యానమునందుఁ బ్రథమానంద లతికగదా—మీ రాకుమారికకంటె సగరకుమారునే యధిక ముగాఁ బ్రేమించుచుండుటకుఁ గారణమేమి?

రాజు—నేనట్లు ప్రేమించుచుంటినని నీవు దేనినిబట్టి యనుమానించితివి?

విమ—అనుమానించుట యేమి? నిశ్చయముగ నే గ్రహింపఁగలిగితిని. మీక న్నెప్పుడును సగరకుమారునిమీఁ దనే యుండును. అతని నొక్కనిమిషమైనను మీరు విడిచి యుండుట లేదు.

రాజు—వెఱ్ఱిదానా! ఇదియా నీయనుమానము! దీనిని బట్టియా నీవు నాప్రేమను గొలుచుట? నేనట్లుండుటకుఁగార ణము వినుము! మనకు నలుదెసలును శత్రుమయములై యు న్నవి. మనయాశాలత యెప్పు డెవ్వరిచేఁ ద్రుటితమైపోవునో యెవ్వరు చెప్పఁగలరు? సగరకుమారుఁడు గర్భమందుండఁగ నే దురాత్ము లెవ్వరో పాపము సుమతికివిషము పెట్టినసంగతి నీవెఱుంగుదువుగదా! దేవీ! మనసూర్యవంశ మంత యు నిప్పు డొక్కసగరకుమారునిమీఁదనేగదా యాధార పడియున్నది! అందుచేతనే నేనక్కుమారునివిషయమునఁ నింత జాగ్రత్తతో నుండవలసివచ్చినది. ముందుముందు రాజదండము

ను జూనవలసినవాఁ డక్కుమారుఁడే. కావున నిత్యము నాతని నాసమీపమునందే యుంచుకొని నీతిబోధ చేయుచున్నాను. ఇంతకంటెఁ బుత్త్రికాపుత్త్రకులయెడల నాకు భేదబుద్ధి యేమున్నది?

విమ—మంచిది. ఏది యెట్లు చేసినను మహారాజులగు మీయిష్టమే, కాని నాప్రశంస యేమున్నది? నామాటయేదియును మీకు నచ్చనప్పుడు రాణిననుకొనుచు నే నీరాచనగరునందుండు టేల? నేను నాబిడ్డను దీసికొని యరణ్యములపాలై పోయెదను.

ఈసంభాషణమువలనఁ బట్టమహిషిహృదయమునందసూయానల మెట్లు జాజ్వల్యమాన మగుచున్నదో మహారాజునకు స్పష్టముగాఁ దెలియవచ్చెను. అందుచే నాతని కామెయెడల దేవిగౌరవము నశించుటయే కాక యాకస్మికముగఁ గ్రోధముదయించి యసహ్యమై తోఁచుటచే మహారాజు నుండి పడుచు "పాపాత్మురాలా! నీకు ద్వేషము పుట్టినది. అది క్రమముగా నిన్నే నశింపఁజేయును. కావున నిప్పుడైన నీభవిష్యమునుగూర్చి బాగుగ నాలోచించుకొనుము. పాపపుఁదలంపులకు నీహృదయమునం దించుకైనను జోటీయకుము! కోటరంబునఁ బ్రవేశించిన యనలకణము కొమ్మలతోఁగూడ వృక్షమును దహించివైచునట్లు హృదయగతంబగు ద్రోహబుద్ధి నానరున కాత్మవినాశముం గల్పింపక మానదు. నామాట విని



శాంతివహించి సుఖముగా నుండుము. అట్లు గాక దురుద్దేశముతో నీవెంత ప్రయత్నించినను నీపాపముచే నీవే భగ్నమై పోయెదవు గాని దైవబలముగల సగరకుమారు నేమియును జేయఁజాలవు. పొమ్ము! నీతోఁచినత్రోవను బొమ్ము! నీయిచ్చవచ్చినట్లు చేయుము" అని క్రోధావేశముచే తూలనాడుచు మహారాజటనుండి వెడలిపోయెను.

---

## నాలుగవప్రకరణము.

ఇక్ష్వాకువంశజుఁ డగు బాహుమహారాజు రాజనీతినిపుణుఁడేగాని రాజకార్యధురంధరుఁడు గాఁడు. వీరశిఖామణి యయ్యు నాతఁడు రణరంగకోలాహలమును సహింపఁజాలకుండెను. శాంతిసుఖాభిలాషి యగునాతఁ డించుకయశాంతిని గూడ సహింపలేఁడు. అతఁడు చాలకాలమువఱకును బిడ్డలు లేనిసంసారముతో రాజ్యభారమును వహించి విసుఁగు జెందియుండెను. దైవానుగ్రహముచే నిప్పుడాతని కొకతనయయుఁ దనయుఁడును గలిగిరి. కాని రాజ్యమునను నలువంకలను శత్రువులు ప్రబలి విద్రోహములు గలిగించుచుండుటచేతను, దనకు

వయసు చెల్లిపోవుటచేతను, పరసుఖసంపాదనాభిలాషచేతను నాతఁ డిప్పుడు చాలవఱకు విరక్తుఁడై యుండెను. సగరకుమారుఁ డింకను బాలుఁ డగుటచే నాతని కింకను రాజ్యము విడిచిపోవుట కవకాశము లేక రాజ్యభారమంతయు మంత్రి సేనాపతులయందు నిలిపియుంచుకవిశ్రాంతివహించియుండెను.

సంసారము సుఖదుఃఖభూయిష్ఠమైనది. ఎంతవాఁడైనను కష్టములఁ దప్పించుకొని జీవింపఁజాలఁడు. నేఁటి పెద్దరాణిమాటవలన నామెహృదయమంతయు స్పష్టముగాఁ దెలిసిపోయెను. రాజ్యపరిసరములయందే గాక యింటిలోఁగూడఁ బోరు ప్రారంభమైనది. ఇది క్రమముగావర్ధిలి యెట్టివిపత్తులను గల్పించునో యని యాతనిహృదయము పరితపించిపోవుచుండెను. అందుచే నాతని కుత్తరక్షణము లన్నియు నతిదారుణములుగనే తోఁచుచుండెను. ప్రకృతకాలము బాగుగ లేదని నారదమహర్షి చెప్పినవాక్యము లాతని కనుక్షణమును భయమును గల్పించుచుండెను. అయినను సగరకుమారుని కెందును గీడు గలుగకుండ నాతని మంత్రదీక్షితునిం గావించి యుద్ధరించెదనని నారదమహర్షి స్వయముగా ననుగ్రహించుట మహారాజునకు దుఃఖసముద్రములో సుఖతరంగమువలె నుండెను. అందుచే బాహుమహారాజు పరమానందభరితుఁడై సూర్యవంశోద్ధరణభారమంతయు నమ్మహర్షి చేతులపైనుంచి సగరకుమారు నమ్మునివరునిచరణకమలముల కర్పించెను.



సగరకుమారుఁ డెనిమిదివత్సరముల బాలుఁడయ్యెనను బదివత్సరములవానికంటెను విశేషించి లోకానుభవము గలవాఁడు. రవికులతిలకుఁడు గాఁగలఁడని సూచించు శుభలక్షణములతో నాతఁడు జన్మించెను. అట్టిశుభగుణపరంపరలతోడనే యాతఁడు వర్ధిల్లుచుండెను. తనయుఁడే సర్వస్వముగ భావించుకొనుచున్నతండ్రిగూడ నాతని బాలకునిఁగా భావింపక యెల్ల విషయములను బోధించుచుంటచే నక్కుమారుఁడు వయసునకుమించినప్రాజ్ఞతను సంపాదించెను. అక్కుమారుఁడు గర్భమునందే మృత్యువును జయించి యుదయించుటచేఁ బ్రజలందఱు నాతనిఁ జిరంజీవియనియు, దేవాంశసంభూతుఁ డనియు భావించి నిరంతరము నాతనియభ్యుదయమును వాంఛించుచుండిరి. కాని యాతని కింకను బాలారిష్టములు వదలలేదు.

తండ్రియానతిచే సగరకుమారుఁడు వినీతుఁడై నారదమహర్షిచెంతకుఁ బోయి యమ్మునీంద్రునిచరణములకడసాష్టాంగప్రణామము గావించుటయు నారదుండు పరమాదరంబున నాతని లేవనెత్తి దీవించిమృదుమధురభాషణంబులతో "కుమారా! రమ్ము! కూర్చుండుము! నీకిప్పుడు మీతండ్రిగారు ధర్మబోధనముగాని, ధర్మదీక్షగాని గావింపవలయు నని కోరియున్నారు. ఏధర్మముంగూర్చి బోధింపుమందువు ?" అని ప్రశ్నించెను.

సగ—మునీంద్రా! నన్నడిగెద రేల? తండ్రిగా రేమి

బోధింపు మనిరో యదియే బోధింపుఁడు.

నార—భవిష్యత్ప్రభుండ వగునీకుఁదల్లిదండ్రుల నెట్లు సేవింపవలెనో, గురుజనుల నెట్లు పూజింపవలెనో, సోదరుల నెట్లు ప్రేమింపవలెనో, బంధువుల నెట్లాదరింపవలెనో, సంఘము నెట్లు మన్నింపవలెనో, సాంఘికధర్మముల నెట్లు పాటింపవలెనో, రాజ్యము నెట్లు పాలింపవలెనో, ప్రజల నెట్లు రంజింపవలెనో, శత్రువుల నెట్లు నిర్జింపవలెనో, శత్రుభయము నుండి రాజ్యము నెట్లుద్ధరింపవలెనో యెల్లవిషయములనుబోధింపవలసియున్నది.

సగ—మునీంద్రా! ఇది యంతయు ధర్మబోధ యనుకొందును. ఇఁక దీక్ష యన నెట్టిది?

నార—కుమారా! దీక్షయనగా సాధన. గురునిచెంత మంత్రోపదేశముం గాంచి మంత్రదేవతను నిత్యము నారాధించుటయేదీక్ష. దీనివలన మానవులకు సర్వశక్తులును లభింపఁగలవు.

సగ—అట్లయినచో నాకు దీక్షనే ప్రసాదింపుఁడు.

నార—మంచిది నాయనా! ఆదీక్ష శైవవైష్ణవాదిభేదములచే వివిధములై యుండును. అందు వైష్ణవదీక్ష యతిసులభ మైనది.

సగ—గురువరా! అట్లయినచో నాలస్యము చేయక నా కాదీక్ష నొసంగుఁడు.



నార—కుమారా! నీవు తగినకోరికను గోరితివి. కాని దీక్షితుఁడవు కాఁదలఁచినచో ముందుగా రాజవేషమును త్యజింపవలయును.

సగ—అది యేమి?

నార—రాజవేషము విలాసముకొఱ కుపయోగపడును గాని దీక్షకుఁ బనికిరాదు.

సగ—అలాగైనచో నాయీవేషమును బరిత్యజించెదను. ఇఁక నే నేవసనములను దొడిగికొనవలయును..

నార—ఇదిగో! ఈకావిబట్టలును దొడిగికొనుము.

సగరకుమారుఁడు పరమానందముతో కాషాయవస్త్రములను దాల్చి నారదునకు నమస్కరించి యాతనిపాదసమీపమునఁ గూర్చుండెను. నారదుఁ డాతనికి ముమ్మాఱు నారాయణమంత్రము నుపదేశించెను. ప్రథమోచ్చారణసమయముందే యక్కుమారునినయనములనుండి ప్రేమాశ్రుబిందువులు బయలు వెడలెను. ఆదివ్యనామ మాబాలకుని మధురకంఠమునుండి వెలువడి యమృతవర్షమును గురియించుటయు నారదుండును ప్రేమపులకితుఁడై యాతనిచే మరల మరల నామోచ్చారణముం జేయింపఁదొడంగెను. సగరుఁడును ప్రేమావేశముతో నాట్యము చేయుచు నారాయణకీర్తనముం గావించుచు "మునీంద్రా! ఆనందముచే నామొడలంతయును ఝులకించుచున్నది. ఎంతసేపు గావించినను నా కీనామకీర్తన

మునఁ దనివి తీరుటలేదు. గురుదేవా! ఇంకను నేనేమి చేయవలయునో యుపదేశింపుఁడు'' అనియెను.

నార—కుమారా! ఇఁక నేమియుఁ జేయనక్కఱలేదు. సర్వదా నామకీర్తనము చేయుచుండుటయే—

సగ—స్వామీ! ఈసాధన యెన్నిదినములకుఁ బూర్తియగును?

నార—ఏమో! ఆసంగతి నేను చెప్పఁజాలను. అదినీ యదృష్టమునుబట్టియు, ఉపాసనాబలమునుబట్టియు నుండును.

సగ—దీనికిఁ బరిణామ మేమి?

నార—కుమారా! ఈయుపాసనవలనఁ గ్రమముగా శ్రీమన్నారాయణుని సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు లభింపఁగలవు. నీభౌతికశరీర మనంత మగువిశ్వమూర్తియందు విలీనము గాఁగలదు. నీప్రేమామృతప్రవాహము, అనంతప్రేమసాగరమున సమ్మిళితము గాఁగలదు. నీప్రాణబిందువు, విశాలజగత్ప్రాణసముద్రతరంగమునఁ జేరుకొనఁగలదు. ఇదియే నీసాధనకుఁ బరిణామము.

సగ—ఇది యంతయు నీనామకీర్తనమువలననే సిద్ధించునా?

నార—ఔను. సర్వమునకు నిదియే మూలమంత్రము.

సగ—దేవర్షిచంద్రా! ఇది యెవ్వరినామము?

నార—ప్రేమమయుఁ డగుపరమేశ్వరుని నామము.



సగ—అతఁ డెవ్వరు?

నార—ఈజగన్మాతయును సృజించువాఁడును బాలించువాఁడును నాతఁడే. యక్షరాక్షసులును, దేవదానవమానవాదిసకలజీవులు నాతనియాజ్ఞచేతనే మెలఁగుచుందురు. ఆతఁడు తల్లిరూపమున జీవులను బ్రసవించి, తండ్రిరూపమునఁ బాలించుచుండును. అనంతమగు నీవిశ్వనౌకను సంసారసముద్రమునుంచి నడపించుకర్ణధారుఁ డతఁడే. అతఁడే విశ్వాశ్రయుఁ డగు శ్రీమన్నారాయణుఁడు.

సగ—ఆతఁడు సాకారుఁడా? నిరాకారుఁడా?

నార—ఒకప్పుడు సాకారుఁడును, నిరాకారుఁడును గూడ నై యుండును.

సగ—సాకారుఁ డైనప్పు డాతనిరూపమెట్టిది?

నార—ఎవ్వ రేవిధముగా నుపాసింతురో వారి కారీతినే దర్శనమిచ్చి యభీష్టసిద్ధిఁ గూర్చుచుండును. ఇట్లే భక్తహృదయ మనుకాచఖండమునందు జ్యోతిర్మయంబగు పరమేశ్వరునిదివ్యమూర్తి బహురూపములతోఁ బ్రతిఫలించుచుండును.

సగ—అతఁ డెచ్చట నుండును?

నార—ఆపరమేశ్వరుఁడు విశ్వమునందలి సకలపదార్థములయందును నిండియుండును. ఆతఁడు సూర్యరూపమునఁ దేజమును బ్రదర్శించుచుండును. వాయురూపమున స్పృశించు

చుండును. మఱియుఁ బుష్పరూపమున వికాసమును, వృక్షరూపమున భూతదయను, లతారూపమునఁ బ్రేమను, బ్రబోధించుచుండును. ఆతఁడు నిత్యమును జలధారారూపమునఁ బ్రేమామృతమును వర్షించుచుండును. జలంబులయందును, స్థలంబులయందును, శూన్యంబులయందునుగూడ నాతఁడు సుస్థిరుఁడై యుండును. ఆతఁడు లేనిచోటే లేదు.

సగ—మహాత్మా! మీయుపదేశబలముచే నేను నిరంతరమును హరిసంకీర్తనముఁ గావించుచుందును. నాయుపాసన సిద్ధించినట్లు నాకెట్లు తెలియును?

నార—భక్తిభరంబున నామకీర్తనము చేయుచుండఁగాఁ దన్మయత్వము కలుగును. మోహాంధకార మంతర్హితమై బాహ్యప్రపంచమం దంతటను జ్యోతిర్మయదివ్యమూర్తి గోచరింపుచుండును. అహంకారము విస్మృతమైపోవును. అప్పుడు నీయుపాసన సిద్ధించినట్లు తెలిసికొనుము.

సగ—దేవమునీంద్రా! ఇంకను స్పష్టముగా బోధింపవలయును.

నార—కుమారా! అయస్కాంతము లోహమునుం బోలి జ్యోతిర్మూర్తియగు పరమేశ్వరుఁడు నిన్నాకర్షించుచున్నట్లును, నీజీవనబిందువు జగజ్జీవనసుధాసాగరమున మిళితమగుచున్నట్లును, పరమేశ్వరుఁడు పరమానురాగముతో బిడ్డకుం దండ్రివలె నీకాశ్రయ మిచ్చుచున్నట్లును దోఁచును. అప్పుడు



నీయుపాసన సిద్ధించె నని భావింపుము. ఇన్నిమాటలేల? త్రికరణశుద్ధిగా నామకీర్తనముం గావించుచుండుము. క్రమముగా నీవు సకలఫలములును సిద్ధింపఁగలవు.

సగ—మహాత్మా! ఈనామగాన మమృతరసపానముకంటెను మధురముగా నున్నది. మీయనుగ్రహముచే నేను ధన్యుఁడ నైతిని.

నార—కుమారా! సరేకాని—నీదీక్ష ఫలించినంతనే నీవు గురుదక్షిణ నొసంగవలసియున్నది.

సగ—మునీంద్రా! అట్లయినచో నేనేమి సమర్పింపవలయునో యాజ్ఞాపింపుఁడు.

నార—నాయనా! ఇప్పు డక్కఱలేదు. నిశ్చలభక్తితో నీవిట్లుగానము చేయుచుండఁగా దయాసాగరుఁడగు పరమేశ్వరుఁ డొకప్పుడు నీకు సాక్షాత్కరించి నిన్ను మాయాసాగరమునుండి యుద్ధరింపఁగలఁడు. అప్పుడు నీవా దీననాథు నింగూర్చి నావిషయమై మనవిచేసి నన్నుఁగూడ నుద్ధరింపఁజేయవలయు నని ప్రార్థింపుము. రాజనందనా! నాకు నీవింతకంటె నధికముగ నేమియు నీయనక్కఱలేదు.

సగ—గురుదేవా! నేను ధన్యుఁడ నైతిని. నాసాధన యచిరకాలముననే సిద్ధించునట్లాశీర్వదింపవలయును.

అని సగరకుమారుఁడు పరమోత్సాహముతో నారాయణనామకీర్తనము చేయుచు నృత్యము చేయ నారంభిం

చెను. ఆబాలకంఠమునుండి యాపవిత్రనామ మతిమధురముగా వినవచ్చుచుండెను. నారదుఁడు పరమానందపులకితుఁడై యాకర్ణించుచు నట్టిభద్రమూర్తి యగుపుత్త్రిరత్నముంగాంచిన బాహుమహారాజు ధన్యుఁడని భావించుచు నుండెను.

ఇంతలో రాజకుమారిక యగుశోభన యచ్చటికి వచ్చి నారదమునీంద్రునకు నమస్కరించి కాషాయవసనధారి యగు తమ్మునింగాంచి నివ్వెఱపడి "సోదరా! ఇదేమి వేషము!" అని యడిగెను.

సగ—ఈదేవర్షి యాజ్ఞచే నే నీవేషమును ధరించితిని.

శోభ—ఈవిధముగా రాజాలంకారములను ద్యజించి యింకను నీ వెంతకాల ముండవలయును?

సగ—నాయుపాసన సిద్ధించునంతవఱకు—

శోభ—ఈమునిచంద్రుఁడు నీకఖిలధర్మములనుబోధించెనా?

సగ—ఆపద్ధతి కఠినమైన దగుటచే నే నీమహాత్ముని కడ నతిసులభ మగుదీక్షను గ్రహించితిని.

శోభ—ఏమిదీక్ష?

సగ—నారాయణమంత్రదీక్ష.

శోభన యాత్రముతో నారదునిఁగాంచి "మహాత్మా! నాకుఁగూడ నిట్టిదీక్షను బ్రసాదింపరా?" అని ప్రార్థించెను.



నారదుఁడునవ్వుచు "అమ్మా! సంసారమునకు శోభనదాయినివి. బాలికవు నగునీకిట్టిదీక్షవలనఁ బ్రయోజనము లేదు. అందును నీవు రాజకుమారికవు!" అనియెను.

శోభ—మునీంద్రా! అట్లనియెద రేమి? తమ్ముఁడు దీక్షలోనుండి యుపాసన చేసికొనుచుండఁగా నే నెవ్వరితో నాడుకొందును? నాకుఁగూడ నేదియైన నొకసదుపాయము ననుగ్రహింపుఁడు.

నార—అమ్మా! నీ వీబొమ్మను దీసికొనుము. నీ వెప్పుడును దీనిని బూజించుచు దీనితో నాడుకొనుచుండుము.

శోభన పరమానందముతో బొమ్మనందికొని "ఆహా! ఇది యెంతయందముగా నున్నది! మునీంద్రా! నేను దీని నెట్లు పూజింపవలయును?" అని యడిగెను.

నార—పువ్వులతో.

శోభ—అట్లయిన దీనినిబూజించుచు తమ్మునిసాధనకు భంగము గలుగకుండ దీనితోనే యాడుకొనుచుండెదను. మహాత్మా! ఇందువలన నుపయోగ మేమి?

నార—మనసునం దపారానందము గలుగును. పూజ చేయుఁగా నీవిగ్రహము నీహృదయపీఠమునందు సుస్థిరముగా నెలకొనియున్నట్లు గోచరించుచుండును. దీనితో నాడుచుండఁగాఁ గ్రమముగ దన్మయత్వము గలిగి యిదియు నీతో నాడుచున్నట్లు తోఁచును. మఱియు నట్టితన్మయత్వము వర్ధిల్లినకొలఁది

నీవును, నేనును బ్రహ్మాండమంతయునుగూడ నీబొమ్మచేతిబొమ్మలమై యాడుచున్నట్లు ద్యోతకము గాఁగలదు. నీవీబొమ్మ నాడించినట్లే యిది మనల నందఱను బొమ్మలుగాఁ జేసి యాడించుచున్న దనుభావము స్పష్టముగా బోధ కాఁగలదు. అన్ని దేవతలవలెనే దీనిని బూజింపవచ్చును. అందఱిని బ్రార్థించినట్లే దీనిని బ్రార్థింపవచ్చును. వరమును గోరుకొనవచ్చును.

శోభ—మునీంద్రా! నే నేవరమును గోరుకొందును?

నారదుఁడు నవ్వుచు "నీకిష్టమైనవరమును గోరుకొనుము! నీవంటిచెల్లెలు గావలయునని కోరుకొనవచ్చును. ఏవి కోరుకొన్నను సరియే!" అనియెను.

శోభన సిగ్గుచేఁ దలవంచుకొని "మునీంద్రా! ఈబొమ్మ మనతో మాటాడఁగలదా?" అనియెను.

నార—మాటాడ కేమి? భక్తితోఁ బూజించినకొలఁది నిది నీతో మాటలాడుట కారంభించును.

శోభ—ఆలాగా? దీని నేపేరితోఁ బిలువవలయును?

నార—ఏపేరు నీకానందముగ నుండునో యాపేరితో బిలుచుకొనుము.

శోభ—దీని కేపేరుపెట్టిన బాగుగనుండునో చెప్పరా?

నార—గోపాలమూర్తి యని పేరుపెట్టుకొనుము. ప్రేమతో నారాధించుట కింతకంటె మధురనామ మేదియును లేదు.



శోభ—అట్లయినచో నే నీపేరే పెట్టుకొని నేఁటినుండియుఁ బూజించుచుండెదను.

అని యామె బాల్యచాపల్యముచే నావిగ్రహమును శిరమునం దుంచుకొని గోపాలనామము నుచ్చరించుచు గంతులు వేయ నారంభించెను. అది చూచి నారదుఁడు పరమానందముతో "పరమేశ్వరా! ఈబ్రహ్మాండము నంతను వింతవింతగ నాడించుచుండు నిన్ను నేనొకబాలికచేతిబొమ్మగాఁ జేసి వైచితిని. దేవా! ఇఁక నీవీబాలికచేతిలోనిబొమ్మవై యాడుకొనుచుండుము. ఈజగమంతయు నీలీలయే గాదా?" అని భావించుకొనుచు "అమ్మా! తమ్ముఁడును, నీవును నిఁక నంతఃపురమునకుఁ బొండు. నేను మరల నొకప్పుడువచ్చి మిమ్ముఁ జూచెదను. సగరకుమారా! ఏదీ! ఇంకొకసారి నామకీర్తనము గావింపుము!" అనియెను. అప్పుడు శోభన గోపాలమూర్తి నెత్తికొని యాడుచుండ సగరుఁడును నృత్యముచేయుచు నమృతమధురకంఠముతో నారాయణనామకీర్తనమును గావించెను. నారదుఁడును వారితోఁగలసి నారాయణస్మరణముచేసి వారి నాశీర్వదించి యనంతరము స్వస్థానమునకు వెడలిపోయెను.

శోభనయు సగరుఁడును మహోత్సాహముతో నంతఃపురమునకుఁ బోవుచుండిరి. అప్పుడు శోభన సగరునిం గాంచి "తమ్ముఁడూ! ఇంతటినుండి నాకును నీతో నాడుకొనుటకుఁ దీరిక లేదు. నేనీగోపాలమూర్తిని బూజించుకొనుచు దీనితోనే

యాడుకొనుచుండెదను. పూలదండలుకట్టి యీబొమ్మ నలంకరించుచుందును.'' అనియెను.

సగ—అక్కా! అట్లయినచో నీవీగోపాలమూర్తితోఁ గాలక్షేపము సేయుచు నన్ను మఱచిపోయెదవా?

శోభ—మఱచిపోను. నీవు దీక్షలో నుందువు గాదా? నీదీక్షకు భంగము లేకుండ నే నీమూర్తితో నాడుకొనుచుందును. సోదరా! నీవులోనికిఁ బొమ్ము. నే నుద్యానవనమునకుఁ బోయి యీగోపాలమూర్తిపూజకుఁబువ్వులు తెచ్చికొందును.

---

## ఐదవప్రకరణము.

---

''సందేహము వదలిపోయినది. ఆయననిశ్చయోద్దేశమదియే. ఇఁక నావిషయమున నింతకంటె నేమియుఁ జేయఁ దలఁచుకొనలేదు. ఎంత యన్యాయము! ఒకకంటఁ గర్పూరమును, నింకొకకంటఁ గఱదూపమునా? సరే! ఏమగునో చూతము. ఆఁడుదానను గదా—ఏమిచేయఁగల నని యనుకొనుచున్నాఁడు కాఁబోలును! ఈవిమతి యంతబుద్ధిహీనురాలుగాదు—కానిమ్ము! అతనియాశాకుసుమమును వృంతచ్యుతముగఁ జేసివైచెదను. అతనిసుఖోద్యానమునకు దావా-



నలజ్వాలను దరికొల్పక మానను. ఇఁక నాతఁ డేమి చేయఁ గలఁడో చూచెదను."

అని యీవిధముగా నాలోచించుకొనుచు విమతి తన మందిరమునందు దొక్కతెయుఁ గూర్చుండియుండెను. ఇంతలో మంత్రివచ్చి ద్వారముచెంత నిలువఁబడి "మహారాజ్ఞీమణీ!'' అని పిలిచెను. విమతి చటాలున లేచి ఓరవాకిలిగనున్న తలుపుకడ నిలువఁబడి కుటిలస్వరముతో "ఇంకను మహారాజ్ఞియేనా?'' అనియెను.

మం—అమ్మా! అట్లనియెదవేమి? పట్టమహిషి వగునీ వెప్పటికిని మహారాజ్ఞివే.

విమ—మహారాజప్రతినిధివగు నీవెట్లు రాజవైయుంటివో పట్టమహిషి నగు నేను నట్లే రాణినై యున్నాను. అధికారవిషయమున మనమిద్దఱము సమానులమే.

మం—అమ్మా! అది యెట్లు?

విమ—రాజ్యమును రక్షించుటకును భక్షించుటకును గూడ సర్వసేనాధిపతి యగు ప్రసేనుఁడధికారి యైయుండఁగా నీవు పేరికిమాత్రము రాజ్యభారమును వహించియుంటివి. సుమతి రాజమాతయై యుండఁగా నేను నట్లే రాణినై యున్నాను. ఇంతేనా?

మం—ఔనమ్మా! బాగుగ నాలోచించుకొన్నచో నంతే.

విమ—మంత్రీ! ఇది నీకవమానకరముగా లేదా?

మం—మహారాజునాజ్ఞ యట్లున్నది. దాని నుచితరీతిని బాలించుటయే సేవకులధర్మము. రాజశాసనము ననుసరించుపట్టున మానావమానములను జూచుకొనుట కవకాశ మెక్కడిది?

విమ—కాని, ప్రజలను ధర్మబుద్ధితోఁ బాలింపవలసిన రాజునకుఁ బక్షపాతముండవచ్చునా?

మం—ఇందుఁ బక్షపాత మేమున్నదమ్మా! ఇరువురమును దరతరములనుండి వచ్చుచున్నవారమే గదా?

విమ—మరియాదకొఱకు నీవిట్లనుచుంటివి గాని నీమాటలపొందిక మనోభావము ప్రకటించుచునే యున్నది. కన్నకడుపునందే పక్షపాతముగలయాతనికిఁ బైవారియందుండదా?

మం—ఏమమ్మా! మహారాజుగారు మనశోభనకుమారిని, సగరకుమారునిఁగూడ నొక్కరీతినే ప్రేమించుచున్నారు గాదా?

విమ—అది యంతయుఁ గపటనటనము. సమానప్రేమయే యున్నచోఁ బెద్దరాణిపెద్దకూఁతురుండఁగాఁ జిన్నరాణి చిన్నకొడుకునకు రాజ్యాభిషేకము సేయఁదలఁచునా?

మం—అమ్మా! అది ధర్మము గాదా?

విమ—ధర్మమా? నీకును బక్షపాతమేనా? అట్లయినచో నాకును సుశోభనకును గతియేమున్నది? ఆఁడుబిడ్డ



నుగన్నపాపముచేఁ బట్టమహిషి సవతికిఁ బావదాసి కావలసినదే కాఁబోలును. నిన్ననవలసినపని యేమున్నది? ఇది యంతయు స్వయంకృతాపరాధమువలననే పుట్టినది. మహారాజు రెండవపెండ్లికి మహానందముతో నంగీకరించుటయే నాతప్పయినది. నేను మొట్టమొదటనే మేలుకొనియున్నచో మీవంటివారిని బతిమాలుకొనుటయు మీమనస్సులకు శ్రమగలిగించుటయు లేకయే పోవును. నిజమే—రాజపరివారమునకు రాజుమాటయే ధర్మము గాని యంతఃపురములోనున్నయాఁడుదానిమాటయం దాదర మేముండును? మహారాజుబుద్ధి యెట్లుమారిపోయినను జిరకాలమునుండి రాజకుటుంబమునందు భక్తివిశ్వాసములతోఁ బనిచేయుచున్న నీవలననైన నించుక యుపకారము గలుగకపోదని యాసపడితిని. ఆయాశకూడ నీనిమిషముతో వదలిపోయినది. పోనిమ్ము! అదృష్టమును, ఆత్మీయులునుగూడ నెడమొగము, పెడమొగమైపోయినప్పుడాఁడుదానను నేనేమి చేయఁగలను? పుట్టెడాసతో నిన్నుఁ బిలిపించినపని నోరెత్తకుండఁగనే తీఱిపోయినది. ఇఁక నీవు పోవచ్చును.

మం—అమ్మా! అట్లు విసుఁగుగొనియెద వేల? నీయభిప్రాయమేమో తెలుపుము. నాచేతనైనంతసాయము చేయుదును.

విమ—అభిమానము నుంచి చేయఁదలఁచినచో నీచేతఁ

గాని పని యేమున్నది? నీవింతవాఁడ వనుభయముచేతనే మహారాజు రాజ్యభారమంతయు నీతలపైఁ బెట్టినను దానికీలు గండనాయకుని చేతులయం దుంచినాఁడు.

మం—అమ్మా! నాకిదివఱకుఁ దోఁచలేదు గాని నీమాటలనుబట్టి యాలోచింపఁగా నాకీవిషయము సందిప్పుడనుమానమే కలుగుచున్నది.

విమ—నామాటలయందు గౌరవముచే నిట్లంటివిగాని నీవీసంగతి నిదివఱ కాలోచించుకొనక యే యున్నావా? బృహస్పతినిమించిన బుద్ధిశాలివగు నీకు నేనా యాలోచన చెప్పుట? ఈరాజ్యమంతయు నీబుద్ధిబలముచేతనే యింతకాలము నిలిచినది గాని మహారాజుబాహుబల మెంతటిది? నీవు తలఁచుకొన్నచో నిమిషములో మహారాజును పదచ్యుతిని గావించి బంధించి పట్టమహిషిని రాణిగాఁ జేసి సర్వరాజ్యమును నిష్కంటకముగాఁ బాలింపఁగలవు. రాజకుమారిక యగుశోభనయందభిమానముచే నీవట్టియుపకారమును గావింతువనునమ్మకముచేతనే నిన్నిట్లు రహస్యముగాఁ బిలిపించితిని.

మం—అమ్మా! మీమాటలు నాకు మహాభయంకరములుగా నున్నవి. ఇంతటిసాహసకృత్యమునకు నన్నుఁ బురికొలుపవలదని ప్రార్థించుచున్నాను.

విమ—ఏమియును భయము లేదు. రెండవకంటివానికిఁ దెలియకుండ సర్వకార్యములును రహస్యముగ నేసాగింప



వచ్చును. తరువాత నేను పేరికిమాత్రమే రాణినై యుందును గాని సర్వాధికారములును నీచేతిలోనే యుండును.

మం—కాని—ఇంతటికఠినకార్యమును నేను చేయఁజాలను. ఈమాట తలఁచుకొన్న నాహృదయము తల్లడిల్లిపోవుచున్నది. అమ్మా! ఈసంగతి మహారాజున కేమాత్రము తెలిసినను బ్రాణములమీఁదికి రాదా?

విమ—రాజ్యమంతయు నిప్పుడు నీచేతిలో నున్నది. మహారా జేమి చేయఁగలఁడు? క్రమముగా నొక్కొక్కయధికారమును వశపఱచుకొని విద్రోహజ్వాలను రగుల్కొలిపి మిగుల నేర్పుతోఁ గార్యమును సాధింపవలయును. మంత్రీ! నీకు నేను బోధించుటా? ఎట్లయిన నీఘనకార్యమును దీర్చి పక్షపాతబుద్ధి యగు మహారాజునకుఁ దగినశాస్తి చేయవలయును. నే నీపరాభవమును సహింపఁజాలను. తప్పక నా కుపకారము చేయుదు వనువిశ్వాసముతోఁ బిలిపించితిని. ఉభయతారక మగునీకార్యమును నీవు సాధించితీరవలయును.

మం—అమ్మా! ఎటుపోయిన నెటువచ్చునో యెవ్వరు చెప్పఁగలరు? ప్రయత్నము చేసినచో మానవున కసాధ్యమగు కార్య మేదియును లేదు. కాని యికార్యమునకుఁ గడంగినచోఁ దుదివఱకుఁ బ్రతినిమిషమును బ్రాణసంకటముగనే యుండును. నా కేమో చాలభయముగా నున్నది తల్లీ!

విమ—మహావీరుఁడ వగునీవే యిట్లుభయపడినచో

నబలను నేనేమి చెప్పఁగలను? ప్రయత్నము చేయుదము. ఫలసిద్ధి యవశ్యము గాఁగలదు. సాహసించినచో సముద్రమునైనను దరింపవచ్చును. ఈపిల్లకాల్వను దాఁటుట యేపాటిపని?

ఇట్లు పట్టమహిషి ప్రోత్సహించుటచే మంత్రికి ధైర్యమును [illegible]డ నాశయు నంకురించెను. అతఁడు చాలసేపాలోచించి "అమ్మా! నేను సాధ్యమైనంతవఱకుఁ బ్రయత్నము చేసి శోభన కుపకారము గావించెదను. ఇది యంతయును మనసునం దుంచుకొనుము. ఈరహస్య మేమాత్రము బయల్పడినను గొంపలు మునిఁగిపోవును! అమ్మా! సెలవు తీసికొందును" అని చెప్పి మంత్రి వెడలిపోయెను.

---

## ఆ ఱ వ ప్ర క ర ణ ము .

---

ఆశాలోలతచే నెట్టియుత్తముఁడైనను నవిశ్వాసియైపోవును. అట్టివానిని దుర్బుద్ధులప్రోత్సాహము దుష్టరాక్షసునిఁగా మార్చివేయును. మంత్రి యింతవఱకును బాహుమహారాజునకుఁ బ్రాణపదమై యుండెను. అందుచేతనే మహారాజు రాజ్యభార మంతయు నాతనికి, దండనాయకుఁడగు ప్రసేనునకు నొప్పగించి నిశ్చింతుఁడై యుండెను. అట్లు చేయుట



విశ్వస్తుఁడగుమంత్రి కధర్మముగాఁ దోఁచలేదు. కాని స్వార్థపరురాలగు పట్టమహిషి "నన్ను రాణిగాఁ జేసినచో నీకుఁ బ్రతి యెవ్వరును లేకుండ సర్వాధికారముల నొసంగెదను." అని యాశపెట్టెను. ఆయాశ క్రమముగా నాతనిఁ జాలదూరము వఱకును గొనిపోయి యానందస్వప్నాంతరాళమునఁ గూర్చుండఁబెట్టెను. అటనుండియే యాతఁ డనేక భావదృశ్యములను గాంచుచుండెను. ఆతని హృదయమునందు నిమిషమున కెన్నియో కోరికలు మొలకలెత్తుచుండెను. ఆతని కెన్నియో యూహలు తోఁచి యనంతపరిణామములం గాంచుచుండెను.

"మంచి యవకాశము దొరకినది. ఊరక భయపడి యీశుభయోగమును నిరుపయోగముగఁ జేసికొనఁగూడదు. చేతికి రత్నము దొరకినప్పుడు చెడఁగొట్టుకొన్నచో జీవితకాలమున నది మరల లభింపదు. నాబుద్ధిబలమంతయు వినియోగించి కార్యమును నిర్వహింపవలయును. పట్టమహిషి చెప్పినట్లు క్రమక్రమముగా రాజ్యమంతయుఁ గరగతము చేసికొనవలయును. ఎంతటిరహస్యకార్యమునందైనను విశ్వాసి యగు నింకొకనిసాహాయ్య ముండవలయును. మహారాజవయస్యుఁడగు కుటిలు నెట్లయిన నాశపెట్టి వశపఱచుకొనవలయును. కాని సర్వసేనానాయకుఁడగు ప్రసేనుఁడున్నాఁడు. ముందు ముఖ్యముగా నాతని వంచింపవలసియున్నది. వాఁడు మహారాజునకు నచ్చినబంటు. అతఁడే నాప్రయత్నమున కంతకును గొప్ప

యాంతరాయముగా నున్నాఁడు—ఉన్న నేమి? ఆతనికిఁ దెలియకుండఁగనే సకలతంత్రములను నడపింపవలయును. సహాయదండనాథుఁడగు ప్రతివింధుఁ డున్నాఁడుగదా! ఆతనికిఁగూడ నించుమించుగా సేనలయందు ప్రసేనునకున్నంతపలుకుబడియున్నది. ఆప్రతివింధునకు నాయందుఁ జాలగౌరవమున్నది. ఆతఁడు నామాట నతిక్రమింపఁడు. ఆతనితోఁ గలసి పనిచేసినచో నాకార్య మతిత్వరితముగనే సిద్ధింపఁగలదు. కపటతంత్రముచే నెట్లయినఁ గార్యసిద్ధిగాంచి యీకౌసలరాజ్యమునంతను నిష్కంటకముగా నేనే యనుభవించెదను. ఈరాజ్యము రాణికిని, శోభనకుమారికినిగూడ దక్కనీయను. తుద కెల్లవిషయములందును విశ్వాసఘాతుకుఁడనే యగుదును గాక! లోకులు దురాత్ముఁడని నన్ను నిందింతురుగాక! సులభముగా మహారాజును గాఁదగిన యిట్టియవకాశము నూరక పోఁగొట్టుకొందునా? ఏమైననుసరియే—నేనిక్కార్యమును సాధించి తీఱుదును'' అని యాతఁడు భావించుకొనుచుండెను.

“మంత్రిశిరోమణీ! ఇన్నియాలోచనలెందులకు? దృఢప్రయత్నము చేసినచో నీయాశ తీరఁగలదు. ఒకరిమాటగాని యొకరిగౌరవముగాని లెక్క చేయకుము. సుఖమార్గ మెన్నియో కంటకములతోఁ గూడియుండును. ఎందఱో వంచకులు విఘాతములఁ గల్పించుచుందురు. నీ వేమియును భయపడవలదు. నిర్భయముగా స్వకార్యమును సాధించుకొనుము. ఇఁక నీవెవ్వాతోడను నాలోచింపవలదు. శ్రేయోదాయక మగు నాయుపదేశమును గ్రహింపుము. ఎవ్వరిమాటను వినకుము. అమృతమును ద్యజించి విభ్రాంతుఁడవై హాలాహలమును పానము చేయకుము.” అని యిట్లు పాపబుద్ధి యాతనిఁ బ్రోత్సహింపఁదొడంగెను.



అంతలోనే యాతనియంతరంగమునందుఁ బుణ్యబుద్ధి యుదయించి “నాయనా! అనేకములగు నంతరాయములును నాపదలును గల కార్యము నాచరించునప్పుడు బుద్ధిమంతులగువారు వెనుకముం దాలోచించుకొని మఱి యారంభింపవలయును. కంటకమయం బగునడవిత్రోవను వదలి రాజమార్గమునఁ బోవుట సుఖార్థులగుబుద్ధిమంతులకృత్యము. మంత్రివరా! నామాట వినుము. నీహృదయమునందు దురాశ కెన్నఁడును దావొసంగకుము. వేఁపచెట్టునం దెప్పుడైనను మామిడిపండు ఫలించునా? ఐహికసుఖలంపటులు గాని సజ్జనులు గరళమునుండియే యమృతమును బడయఁగలుగుచుందురు. నీవు దురాశపడి తుదకు దుఃఖము దెచ్చికొనకుము. అజ్ఞానముచే నామాటల ననాదరింపకుము.” అని బోధింపనారంభించెను.

కాని దురాశాపిశాచావిష్టుఁడగుమంత్రికిఁ బుణ్యబోధయేమియును నచ్చలేదు. అతఁడు తుదకు “ఈప్రపంచమునందు శత్రుమిత్రుల నెఱుంగుట యసాధ్యకార్యము. పరలోకము

నకు భయపడి యిహలోకసుఖమును త్యజించుట కేవల మజ్ఞానము. పరలోకమనునది పిఱికిపందల ప్రాణరక్షణముకొఱకుఁ గల్పింపఁబడినదిగాని నిక్కముగా నది లేనేలేదు. నేను నిశ్చయముగా సంకల్పించుకొన్న యీప్రయత్నము నిఁక నెవ్వరెంతబోధించినను విడుచువాఁడను గాను. తప్పక నాబుద్ధిబలముచే సాధించితీఱుదును." అని నిశ్చయించుకొనియెను.

ఇంతలో రాజవయస్యుఁ డగుకుటిలుఁ డచ్చటికి విచ్చేయుటయు మంత్రి యాతనిం గాంచి పరమాదరముతోఁ దోడితెచ్చి సమీపమునఁ గూర్చుండఁజేసి "మిత్రమా! వచ్చితివా? నీరాకకే నిరీక్షించుచున్నాను. ప్రియమిత్రుఁడ వగు నీతోఁ గలసి యొకవిషయముంగూర్చి యాలోచింపవలయునని నినుఁ బిలిపించితిని. నీకంటె నా కాత్మీయు లెవ్వరున్నారు?" అనియెను.

కుటి—మీకు నాయం దంతయనుగ్రహమున్నది.

మం—నీకును నాయం దంతగౌరవమే—మిత్రమా! నే నిప్పు డొకఘనకార్యమును జేయఁదలంచితిని. అది చాల రహస్యమైనది. నీతో నాలోచింపకుండ దానిని బ్రారంభించుట కిష్టము లేదు.

కుటి—చెప్పుట కభ్యంతరము లేనిచో నది యేమో సెలవిండు. అందు నాసాహాయ్య మేమైనఁ గావలసివచ్చి



నచోఁ బ్రాణములనైన గణింపక మీకొఱ కర్పించుటకుసిద్ధముగ నున్నాను.

మం—నీకుఁ జెప్పుట కభ్యంతర మేమున్నది? కాని యది మిగుల రహస్యకార్యమగుటచేతను, నాకువలెనే మహారాజునకుఁగూడ నీవు ప్రాణమిత్రుఁడ వగుటచేతను నే నించుక సంశయపడుచున్నాను.

కుటి—అయ్యా! మీ రట్లు సంశయింపనక్కఱలేదు. నేను మహారాజవయస్యుఁడనైనను నాకు మీయందె యధికభక్తి. చేఁప చెరువులో నున్నను దానిజీవితము మేఘునియందే యాధారపడియున్నట్లు నేను రాజకుటుంబమునం దున్నను మీయనుగ్రహమునే వాంఛించుచున్నాను.

మం—కుటిలా! నీకు నాయం దంతభక్తి యున్నదని నే నెఱుఁగుదును. అందుచేతనే నీయందు నాకంత నమ్మకమున్నది—కాని యెవ్వరి మనములో నేముండునో యెట్లు తెలియును? అందుచేతనే నామాట యటుండఁగాఁ గేవలము నీకు లాభకరమగు విషయమునుగూడ నాకస్మికముగా నీతోఁ జెప్పుటకు నేనంత సందేహపడవలసివచ్చుచున్నది.

కుటి—నామేలునుగూర్చినవిషయమును నాకుఁ దెలుపుటకు సంశయమేమి? ఎంతమూర్ఖుఁడైనను దనకుఁ దా నపకారము చేసికొనునా?

మంత్రి యించుక సేపాలోచించి మృదులస్వరముతో

"మిత్రమా! నేనెప్పుడైన నేరాజ్యమునకైన రాజ నగుదు ననుకొనుము. మాటవరుసకుఁ జెప్పుచున్నాను సుమీ!—అప్పుడు నీవు నాకు మంత్రివై సాహాయ్యము చేయుదువా?" అనియెను. కుటిలుఁడు పరమానందముతోఁ గెవ్వునఁ గేకవైచి "చేయకేమి ప్రభూ! అంతటిసుదృష్ట మెప్పటికైనఁ గలుగునా?" అనియెను.

మం—ప్రయత్నము చేసినచోఁ గలుగకేమి? కేవలమును, అదృష్టముమీఁదనే యాధారపడి యూరకకూర్చుండుటవలన లాభములేదు. ఈశ్వరుఁడు మనకు బుద్ధిబలమును బాహుబలమునుగూడ నొసంగియున్నాఁడు. వానిని జాగ్రత్తతో నుపయోగించుకొన్నచో మనకసాధ్య మేదియునుండదు—మిత్రమా! నీ కొక రహస్యము చెప్పెదను. ఎవ్వరికిని వెల్లడింపవుగద?

కుటి—ఎంతమాట! నేను బ్రాహ్మణుఁడను. గాయత్రిసాక్షిగాఁ బ్రమాణము చేయుచున్నాను. ఎవ్వరికిని జెప్పను.

మం—అట్లయిన వినుము: ఏకపటతంత్రముచేనైన రాజును, చిన్నరాణిని, సగరకుమారుని బహిష్కరింపవలయునని పెద్దరాణి తొందరపడుచున్నది. తరువాత నీయయోధ్యారాజ్యభారమంతయు నాపై నుంచెదనని యామె నన్ను నమ్మించుచున్నది.

కుటి—ఏమి! ఈమాట నిజమేనా? నామనసు పరీ



క్షించుటకై యిట్లనుచున్నారా?

మం—లేదు. లేదు. నీతో నేనెన్నఁడైనఁ బరిహాసమాడితినా? ఈవిషయమునఁ బ్రతివిందుఁడును, నీవును సాయపడినచో నీలాభమంతయు మీయిరువురిదే—అప్పు డామె పేరికిమాత్రము రాణియై యుండును. రాజకార్యము లన్నియు నాచేతిలోనే యుండును. నీవు నాయంతవాఁడవై నా కాలోచనలఁ జెప్పుచుందువు. ప్రతివిందుఁడు సర్వసేనానాయకుఁడు గాఁగలఁడు.

కుటి—మంచిది. కాని సంపూర్ణముగ నీవే రాజవై నేను మంత్రినై యుండుట తటస్థించినచో నింతకంటె ననుకూలముగా నుండును.

మం—వయస్యా! నీయూహ నాయుద్దేశముకంటెను దూరముగా నున్నది. నా కిప్పు డిట్టివారిసాహాయ్యమే కావలసియున్నది. సరే—అలాగే యగును. ముందుగా నొకకొమ్మపైఁ గాలూనుకొన్నచోఁ గ్రమముగా నన్ని కొమ్మలకును లంఘింపవచ్చును. ఈకార్యమునందు నీవు నాకు సాయము చేయుదువా?

కుటి—చేయకేమి—మీయాజ్ఞయైనచోఁ బ్రాణములనైన నర్పించుటకు సిద్ధమై యుందును.

మం—సరే. ఇప్పుడు నీవును నేనును గలసి యేదో విధముగా బోధించి ప్రతివిందుని మనలోఁ జేర్చుకొనవల

యును. అతఁడు మనకు వశుఁడు గాఁడా?

కుటి—ప్రయత్నించి చూతము. ఆతఁ డధర్మాచరణమునకు భయపడుస్వభావము గలవాఁడు. కాని మన మిరువురమును గలసినచో నాతని నెట్లో లొంగఁదీయవచ్చును. అగ్నిముఖమునఁ బడినచోఁ బచ్చిపుల్లయైనను మండకమానునా? మట్టియైనను భస్మమై రంగుమాఱక మానునా? ఇఁకఁ బ్రసేనునిమాటయో—

మం—ఆతఁ డెప్పుడును మనకుఁ బ్రతిపక్షియే యైయుండును. మహారాజునకు నచ్చినబంటుగదా—ఏమైననేమి—ఆతఁ డేమి చేయఁగలఁడు? ఆతని కీసంగతి యెంతమాత్రమును దెలియనీయఁగూడదు.

కుటి—మంచిది. అయ్యో! పెద్దరాణికి మహారాజుపై నింతద్వేష మేల కలిగినది?

మం—మహారాజు తనకొమార్తెను రాణిఁగాఁ జేయక సగరకుమారునిఁ బట్టాభిషిక్తునిగాఁ జేయ నిశ్చయించుటయే యామెద్వేషమునకుఁ గారణము.

కుటి—ఆలాగా? సరే—అది మనకు లాభకారియైనది. తేనెపట్టును బడఁద్రోయుట కోఁతిపనియు, తేనెనుపయోగించుట జీమలపనియు నగుచున్నది. మంచిది. మనకిప్పు డుపాయమేమి? ప్రసేనుఁడు రాజుపక్షమై యుండఁగా రణరంగమున నాతని జయించుట చాలకష్టము.



మం—అన్నియుపాయములను ముందు నిశ్చయించుకొనియే కార్యక్షేత్రమునఁ బ్రవేశింపవలయును. మనమహారాజునకు హైహాయప్రభువు ప్రక్కలోని బల్లెమై యున్నాఁడు గదా! ఆతనితో నొకతంత్రమును సాగింపవలయును. ఆకార్యము నీవలనఁ గావలసియున్నది.

కుటి—మీ రేమి చేయుమన్నను నిస్సంశయముగాఁ జేయుటకు నేను సిద్ధముగా నున్నాను.

---

## ఏ డ వ ప్ర క ర ణ ము.

రాజకుమారిక యగుశోభన నిత్యమును గోపాలమూర్తిని నిశ్చలచిత్తముతోఁ బూజించుకొనుచుండెను. విమతిమనసుమాత్రము మనసులో లేదు. ఆమెహృదయాంతరాళమునం బుట్టినయీర్ష్యానలము క్షణక్షణమునకుఁ బ్రజ్వలించిపోవుచుండెను. ఆమెయాశాంధకారమున కవధి లేకుండెను. ఆమెయాలోచనాతరంగములకు విరామము లేకుండెను. ఆమె సంకల్పసోపానములకుఁ దీరము లేకుండెను. ఆమె యిప్పుడు రాజకుమారి పూజామందిరపార్శ్వమునందున్న తనగదిలో నొకదంతపుమంచముపై నర్ధశాయినియై యుండి యిదేవిధముగ నాలోచించు

కొనుచుండెను. అప్పు డామెహృదయభావము లామెవదనమండలమును నిమిషమున కొకవింతరీతిని మార్చివైచుచుండెను. ఆసమయమున సుమతి యచ్చటికి వచ్చి "అక్కా! అమ్మాయి పూజ యైనదా ?" అని ప్రశ్నించెను.

విమతి తనయూహాప్రపంచమునుండి యాకస్మికముగ విడివడి చటాలున లేచి కూర్చుండి వికటస్వరముతో "ఎందులకు ?" అనియెను.

సుమ—ఏమున్నది? అబ్బాయిభజన యైనది. అక్క—పూజ యైనదేమో చూచిరమ్మని పంపినాఁడు. ఇరువురును గలసిగాని భోజనము చేయరుగాదా ?

విమ—చిన్నతనపువెఱ్ఱులు. ఎవరిభోజనము వారేచేయుదురు గాని యొకరి కొకరు తినరు గదా! దీనికొఱ కింత యారాట మేల?

సుమ—అది గాదు. వారిద్దఱు నొకజట్టు. ఎప్పుడును విడువకుండ నొక్కచోఁ గలసియుండువారికిఁ బూజలును భజనలును వచ్చినవి. ఒకఁడింత యెడఁబాయుటకూడ వారికిఁ గష్టముగనే యున్నది. మహాత్ముఁ డగునారదమహర్షి మన మేలుకొఱకే యిట్టియేర్పాటు గావించి యున్నాఁడు. కాని, కన్నకుమారుఁడు నాకన్నులయెదుటఁ గావిబట్టలతో భజనసేయుచుండుటం గాంచి యొక్కొక్కప్పుడు నామనసు కలుక్కుమనుచునే యుండును సుమా!



విమ—ఆతని కేమమ్మా! మహారాజు! అరిష్టశాంతికొఱకుఁ గొంతకాల మట్టివేషముం దాల్చియున్నకుమారునిం గాంచి నీకే యంతకష్టముగా నున్నప్పుడు, మహారాజకుమారికయయ్యును, మంగళహారతిబొమ్మవంటిదై యున్న మాశోభనను జూచి నే నెంతవిచారింపవలయును?

సుమ—అదేమిసోదరీ యట్లనియెదవు? ఇరువురును మహారాజసంతానమే గాదా ? తాత్కాలికస్థితినిబట్టి తల్లులమగుమన కించుక మనస్సంకోచమేగాని వారికేమమ్మా!

విమ—ఈమాటల కేమిలే. సాంత్వనాలాపములచే సన్నిపాతోన్మాదము శాంతింపఁగలదా? నీవన్నట్లు తాత్కాలికస్థితినిబట్టి యిరువురును రాజసంతానమే గాని, భవిష్యత్కాలమునందు నీకుమారుఁడు మహారాజును, నీవు రాజమాతవు నగుదురు. నాకును నాకుమారికకు నేమున్నది ?

సుమ—అక్కా! ఎంతమాట యంటివి! నాకుమారుఁడు నీకుఁగాఁడా? నీకుమారిక నాకుఁగాదా ?

విమ—మాటవరుసకుమాత్ర మట్లే కాని మహారాజభోగముమాత్ర మెవరిది వారిదే.

సుమ—అట్లెన్నఁటికినిగాదు. నీతరువాతిదానను నేను. శోభనతరువాతివాఁడు సగరుఁడు. మహారాజననుమాత్రమో మనమందఱమును సమానమే.

విమ—అట్లయైనచో మహారాజు సభలో సగరునకు

రాజ్యమిచ్చెదననియే చెప్పెను గాని శోభన కేమైన నిచ్చెద నన్నాఁడా?

సుమ—ఆయన కా భేదబుద్ధి లేదు. రాజ్యభారముఁ వహింపఁగలవాఁడు మగవాఁడు గావున నాబరు వాతనితలపైఁ బెట్టెదనని చెప్పినాఁడు. కుమారుని రాజును జేయుట, కుమారి ననాదరించుట యనుసంశయ మాతనికిఁ గలుగలేదు.

విమ—నీవు మగబిడ్డను గన్నదానవుగాన నెంత ధైర్యముగ నైన మాటాడఁగలవు. నిర్భాగ్యురాల నగునా కా ధైర్య మెట్లు కలుగును?

సుమ—అక్కా! అట్లయినచో శోభననే రాణీగాఁ జేయుమని మన మిరువురమును మహారాజును బ్రార్థించి యట్లు చేయింతము. సగరుఁ డామెకుఁ దోడుగా నుండి యెల్లకార్యములను దీర్చుచుండును.

విమ—అప్పుడు మాత్రము ప్రజలందఱును రాజకార్యనిర్వాహకుఁ డగు సగరునే రాజుగా భావింతురు గాని శోభన యూరును బేరును వారి కెందులకు?

సుమ—అట్లయినచో నేను కుమారసహితముగా మహారాజుతోఁ గలసిపోయి వానప్రస్థధర్మమును స్వీకరింతును. అప్పుడు మన శోభనయే నిష్కంటకముగా రాజ్యమును బరిపాలింపవచ్చును గదా!

విమ—అమ్మా! ఎంతమాట యన్నావే! నీకొడుకును



జూచి నేను కంటకపడుచున్నానా? ఇంతకాలమునకు నీకడుపులోని కళంకము బయటఁ బడినది. ఇన్నాళ్ళపరిచయమున్నను నీ వింతలోఁతుగుండె గలదానవని నేను గ్రహింపనే లేకపోయితినే!

సుమ—అక్కా! అదియేమో కాని కొన్నాళ్ళనుండి నీవు నామాటలకు దురర్థములను గల్పించుకొనుచున్నావు. నే నేమి యపచారము చేసితిని? ఎప్పుడైన నీమాటకు జవదాఁటితినా? తోడఁబుట్టినదానివలె నన్నింతకాలమువఱకును జూచుకొనుచుండు నీకు నాయందిప్పుడింతదయతప్పిపోవుటకుఁ గారణమేమి? ఒక్కతల్లిబిడ్డలవలె నుండువారముగదా!

విమ—ఆ "వలె" ననుటలోనే భేద మగపడుచున్నది గాదా? అందుచేతనే యెవరియదృష్టము వారిదని చెప్పితిని. అదృష్టవతివగు నీవు క్రమముగా రాజమాత వయ్యెదవు. దురదృష్టవంతురాల నగు నేను నగరిదాసికంటె నధమాధమురాలిని గావలసివచ్చును. కాదా మఱి—అర్థశరీర మగు మహారాజే నన్నలక్ష్యము జేయుచున్నప్పుఁ డంతశ్శత్రువగు సవతి నన్నాదరించునని యాశపడుట యవివేకము గాదా?

సుమ—అయ్యో! ఊరక లేనిపోని సంశయములఁ బెట్టుకొని మనసు పాడుచేసికొనుచున్నావు. ఇందువలనఁ బండువంటి మనసంసారము క్రమముగా నెట్లు పాడైపోవునో యని భయమగుచున్నది.

విమ—అభయము నాకుఁగాని నీకేమి? మహారాజు తల్లివగునీకు మాబోంటివారి లెక్కయేమున్నది?

సుమ—అక్కా! నీకింత భేదబుద్ధియేల? ఆనాఁటివిష ప్రయోగముచే నేనప్పుడే మరణించితి ననుకొనుము. ఆకుమారుఁడు నీకుమారుఁడే యనుకొనుము. అతని నీయిష్టమువచ్చినట్లు చేసికొనుము.

విమ—ఎంత గడుసుదానవే! అన్నమన కొన్నంతనే యాఁకలిదీఱునఁటే! అయోధ్యాధీశ్వరుఁ డగుసగరుఁ డెప్పటికిని నీకొడుకే యగునుగాని నాకుమారుఁ డెట్లగును?

సుమ—సోదరీ! నీవు నన్నింత మోసముచేసెదవనియు, నీమనసింత కఠినముగా మాఱిపోవుననియు నేను కలనైనఁ దలంచుకొనలేదు. అక్కా! నీపాదములు పట్టుకొని బ్రతిమాలుకొనుచున్నాను. నే నేపాపము నెఱుంగను. నీవే తల్లిగను, దైవముగను జూచుకొనుచు నాభారమంతయు నీయందుంచి నిర్భయముగా జీవించియున్నాను. కుటుంబక్షేమముం గోరిన పెద్దదానవగు నీవేమి చెప్పిననట్లు చేయుచున్నాను. నన్నుఁ గోరి తెచ్చుకొని నీమగనికిఁ బెండ్లి చేసికొంటివి; నీయంతటిదానిఁగ జేసి యాదరించుచుంటివి; వంశము నిలిపినవధువని నన్నెంతయో యాదరించి ప్రేమించుచుంటివి. అట్టి నీకు నే నింతలోనే పగదాననై పోవుటకుఁ గారణమేమి? తల్లికే బిడ్డ బరువైపోయినప్పు డింక దిక్కేమున్నది? అక్కా! నాయందుఁ



దప్పులున్న క్షమింపుము. లోపములున్న సవరింపుము. నేనును నాబిడ్డయు నీబిడ్డలము. ఎప్పటికిని నీగీచినగీటు దాఁటువారము గాము. మాయెడ నీకట్టిసంశయమును వలదు. నీవు మఱియొకలాగు భావించినచో నాతోడు!

అని సుమతి కన్నీరు మున్నీరుగా వెక్కి వెక్కి యేడువఁ దొడంగెను. ఇంతలో శోభనకుమారి పూజ ముగించుకొని యచ్చటికి వచ్చి మొగము చిట్లించుకొనియున్న తల్లిని, కన్నీరుపెట్టుకొనుచున్న పినతల్లిని గాంచి విభ్రాంతయై ప్రేమమయకంఠస్వరముతో "పిన్నీ! ఏడ్చుచున్నావేమి?" అనియెను. సుమతి యేమియు మాటాడలేదు.

విమతి మెడనాడించుచుఁ గర్కశస్వరముతో "శోభనా! ఏమి యట్లడుగుచున్నావు! ఆలించుదానవా? పాలించుదానవా? నీకెందులకీగొడవ?" అని గద్దించెను.

శోభ—అదేమమ్మా! ఎప్పటికిని జిన్నవారమేమై యుందుమా? ఇఁకముందు క్రమక్రమముగా నీయయోధ్యానగరమునం దాలించుదానను నేనును, బాలించువాఁడు తమ్ముడునుగాక మఱియెవ్వరగుదురు?

విమ—అబ్బో! నీకింత మొగసిపాటున్నదిగనుకనే మీతండ్రి తగినశాస్తి చేయఁజూచుచున్నాఁడు. నిర్భాగ్యురాలా! కలిపోసినను నీవింక నుట్టివంకనే చూచుచున్నావు.

అనుటయు సుమతి కన్నీరు దుడిచికొనుచు "అక్కా!

నోరెఱుఁగని పసిపాపతో నిట్టిమాట లెందుకమ్మా! పాపము! దాని కేమి తెలియును?'' అనియెను.

విమ—నాబిడ్డను మందలించుకొనుటకుఁగూడ నీయాజ్ఞయే కావలయునా ?

సుమ—కాదమ్మా ! ఇట్టిమాటలు బిడ్డలచెవులఁబడఁగూడదని—

విమ—ఇదేమి రహస్యమా! ఘంటాపథముగఁ జాటించినమాటలు కప్పి మూసిన దాఁగుననుకొన్నావో ? నాకొడుకు, నాకూఁతురు నని చెప్పుచు చల్లగా సామ్రాజ్యము నాక్రమింపఁజూచుచున్నావు కాఁబోలును! చిన్న పెద్దతనము లక్కఱలేదా ?

అని యింకను నేమేమో యనఁబోవుచుండఁగా శోభన కుమారి యిరువురినడుమను బ్రవేశించి పినతల్లి చేయి పట్టుకొని "పిన్నీ! అమ్మమాటల కేమి లే. ఆమెకీదినమున మనస్సు స్తిమితముగ లేదు. ఏమోకాని యస్వస్థతగా నున్నది. ఇంతదాఁక నేను గోపాలమూర్తి కర్పించిన కర్పూరహారతిని దెచ్చి చూపఁగాఁ గన్నులకైన నద్దుకొనలేదు. పదపద—భోజనసమయమైనది. తమ్ముఁడు నాకొఱకు గనిపెట్టుకొని కూర్చుండి యుండును. పోదముపద" అని యామెను వెంటఁబెట్టుకొని లోనికిఁ దీసికొనిపోయెను.

# ఎనిమిదవ ప్రకరణము.

రాజమందిరమునకు దక్షిణభాగమునఁ బుష్పోద్యానమునం దొకమాలతీకుంజమునఁ గూర్చుండి మల్లిక పరధ్యానముతోఁ బూలమాలికను గూర్చుచుండెను. అప్పుడొక బాలికవచ్చి "మల్లికా! శోభనవచ్చినదా?" అని ప్రశ్నించెను.

మల్లి—పూలకొఱకు వచ్చువేళయైనది. ఇఁక నామెకుఁ బూజాసమయముగదా! ఇప్పు డామెకొఱ కేలవచ్చితివి?

బాలి—ఇరువురము నొక్కనాఁడైన నెడఁబాయక యాడుకొనుచుండువారముగదా! ఈనడుమ చాలదినములనుండి తఱచుగా నామె దర్శనమే యగుటలేదు. తోఁటలోనికి వచ్చినచో నిప్పుడైన నొకసారి చూచిపోవలయునని వచ్చితిని. దేవర్షి యామె కేముహూర్తమునందు బొమ్మ నిచ్చెనోగాని యంతటినుండి యామెకు దానితోడిదే లోకమైపోయినది.

మల్లి—ఔను. నిజమే—ఆగోపాలమూర్తి పేరుచెప్పినచో నామెయొడలు పరవశమైపోవును. శోభన కాబొమ్మయనిన నంతప్రేమ.

బాలి—మల్లికా! శోభన యింకను జిన్నపిల్లయేనా? వయసువచ్చుచున్న రాకుమారికగదా! ఏరాజ్యమునకో పట్టపురాణి కాఁదగినయామె కింకను బొమ్మలాటలేనా?

అనుచుండఁగా నింతలో శోభన గోపాలమూర్తి నిజంకఁ బెట్టుకొని యచ్చటికి వచ్చి యావిగ్రహమును బాలికకుఁ జూపుచు "లలితా! ఇటుచూడుము. నాగోపాలమూర్తి నిజ ముగా నవ్వుచున్నట్లే యున్నాఁడు. ఆనగుమొగముతో నా వంక నెట్లు చూచుచున్నాఁడో చూడుము." అనియెను.

లలి—సోదరీ! నీవెఱ్ఱి బాగుగనే యున్నది. నీసొగసు చూచి యంతగా నవ్వుట కీబొమ్మ మాబావయా యేమి?

శోభ—లలితా! ఈపరిహాసముల కేమిగాని నాకీవిగ్ర హము లభించినప్పటినుండియు నితరచింతయే లేదుసుమా!

లలి—ఆసంగతి వేఱుగఁ జెప్పనక్కఱలేదు. నిమిష మెడఁబాయఁజాలని మనకు నెలకొక్కసారియైనను దర్శనమే లేదు. ఈడు వచ్చుచున్నదిగదా! ఇంకను నీబొమ్మతో నెంత కాలము గడపఁగలవు?

శోభ—నాగోపాలమూర్తితో నాడుకొనుచు నేనెం తకాలమైనను సుఖముగాఁ గడపఁగలను.

లలి—ఈవేడుక యెంతకాలముండును? దినదినమున కును నీకోమలాంగకములలోఁ గ్రొత్తవన్నెలు బయలుదేఱు చున్నవి. కలికిచూపులలో తళుకు నీలములు కళలుజేరుచు న్నవి. మొలకనవ్వులలో జిలుగువెన్నెలలు ముద్దుగారు చున్నవి. ఇంకను నీబొమ్మలాట యెన్నాళ్ళుండునో యీకన్ను లతోనే చూతునుగాదా?



శోభ—అదేమే లలితా యటనుచున్నావు. నే నీ గోపాలమూర్తిని జీవములతో విడువఁగలనఁటే!

లలి—ఈపూజలిట్లే సాగుచుండు ననుకొనుచున్నా వా? వయసువచ్చినవధువుల కెప్పుడును వరుల నన్వేషించు చుండుటయే పనిగాని, వాసుదేవుఁడును, గోపాలమూర్తియు వారి కెందులకు?

శోభ—అక్కా! నాకిట్టిమాటలు చెప్పకే—

లలి—నేను చెప్పుటయేమి? నీవయసుతో మనసు గూడఁ దిరిగిపోయినప్పుడు మావంటివారి కందఱకును నీవే చెప్పుదువు.

శోభ—ఏమో! అప్పటిమాట చూచుకొందము.

అని మల్లికవంకఁజూచి "ఏమే! పుష్పమాలికను సిద్ధము చేసితివా? పూజాసమయము గావచ్చినది. పూవులను గోసి కొని తెచ్చినాను. ఆపుష్పహారము నిచ్చినచో నేను పోయె దను" అనియెను. తోడనే మల్లిక హారము నామెకొసంగెను. శోభన దానిం గైకొని పరిశీలించి యించుక విసుగుతో "మల్లికా! అదియేమో కాని కొన్నాళ్ళనుండి నీవు మునుపటి వలె పూలదండలను బాగుగఁ గట్టుట లేదు. ఈపూలమాలిక మాబాలగోపాలమూర్తి కందముగానుండదు. నేను గోసి తెచ్చికొన్నపువ్వులతో స్వయముగనే దండగ్రుచ్చి నాస్వామి నలంకరించికొందును-(అని లలితవంకఁ దిరిగి) అక్కా! నాకుఁ

బూజాసమయమైనది. మఱియొకప్పుడు మరలఁ గలిసికొందము" అని యామెను వెంటఁబెట్టుకొని వెడలిపోయెను.

శోభనమాటకు మల్లిక చాల నొచ్చుకొనియెను. ఆమె తనలో "ఈనడుమ నేను చేయుచున్నపనులంగూర్చి యందఱు నన్నిట్లే నిందించుచున్నారు. పూలదండలు గట్టుట నా కీనాఁటిపనియా? ఎన్నాళ్ళనుండి కట్టుట లేదు! నావయస్సంతయుఁ జాలవఱకీపనిలోనే గడచిపోయినది. కాని యిప్పుడు మాలికారచనమునందు నామనసు నిలుచుటయే లేదు. చాల దినములనుండి నాప్రియుఁడగు కుటిలుఁడు తఱచుగా నాచెంతకే వచ్చుట లేదు. విలాసవిహారి యగునాతఁడిప్పుడు రాజకార్యధురంధరుఁడై పోయినాఁడు. ఆతొందరపనులలోఁ బడి యాతఁడెట్లో కాలక్షేపము చేయుచున్నాఁడు గాని యాతఁడే ప్రాణముగ నున్న నాకిచ్చుట తోఁచుట కనకాశ మేమున్నది? ఆతనివియోగమువలననే నాపనులన్నియును జెడిపోవుచున్నవి. నామనస్సంతయును జెదరిపోవుచున్నది. ఈదినమున నాతఁ డూరినుండి వచ్చినట్లు తెలిసినది. ఇంకను నాచెంతకుఁ రాలే దేమి చెపుమా?" అని భావించుకొనుచుండెను.

ఇంతలోనే కుటిలుఁడు తోఁటలోఁ బ్రవేశించి నలుదెసల నరయుచు "మల్లికా! మల్లికా!" అని పిలిచెను. మల్లిక చటాలున నాతని కెదురుగాఁ బోయి "ప్రియా!



మాటలోనే వచ్చితివే! నన్ను విడిచి యిన్నిన్నిదినము లెట్లుండఁగలుగుచున్నావు?" అనియెను.

కుటి—ప్రేయసీ! ఇఁకముం దెక్కడకును గదలకుండ మనమిద్దఱము నొక్కచోఁగలసి మహారాజదంపతులవలె సుఖముగాఁ గాలక్షేపము సేయు నవకాశమును గల్పించుకొనుటకే యిన్నికష్టములు పడుచున్నాను.

మల్లి—ఈకష్టములు కడముట్టుట యెప్పటికి? ఉన్నదానితో సంతుష్టినందినచో నిన్నికష్టములే లేకపోవునుగాదా?

కుటి—అట్లూరక కూరుచుండుట యవివేకము. ఎల్లప్పుడు నొకరిదయమీఁదనే యాధారపడి యుండుట పురుషధర్మము గాదు.

మల్లి—ఎప్పుడు నొక్కనినే నమ్మించి యుభయతారకముగా జీవించుట యధర్మమేనా?

కుటి—కాదు. అది స్త్రీధర్మము.

మల్లి—ఈస్త్రీపురుషధర్మములు రెండును నిప్పటి మనయుభయులజీవితములయందును స్పష్టముగాఁ బ్రతిఫలించుచున్నవి. కాని యీధర్మములు రెండును మనకుఁ గష్టములనే కూర్చుచున్నవి. పురుషధర్మము నవలంబించిన నీవు సుఖాశచే దేశములపాలై కష్టముల పాలగుచున్నావు. స్త్రీధర్మము నవలంబించిన నేను నీవియోగమును సహింపఁజాలక దుఃఖముల పాలగుచున్నాను. ధర్మాచరణ మనిన నెప్పటికిని గష్టానుభవమే కాఁబోలు నేమి?

కుటి—అక్కా! అట్లు భావింపఁగూడదు. కష్టసహనము వలనగాని ధర్మనిర్వహణము గాఁజాలదు. ధర్మనిర్వహణమునఁ గాని సుఖలాభము చేకూరదు. ధర్మరహస్యతత్త్వమిదియే—

మల్లి—ధర్మరహస్యముంగూర్చి యిన్నిమాటలు చెప్పితివిగదా! ఆరాజరహస్యతత్త్వముంగూర్చి యొక్కమాటయైనను జెప్పఁగూడదా?

కుటి—అమ్మయ్యో! గోరంతరహస్యము వెల్లడియైనచోఁ గొంపలు మునిఁగిపోవా? అందును నాఁడువారినోట నువ్వుగింజ నానునా?

మల్లి—చాలుచాలు! ఈముగమాటలకేమి లే. ఈరహస్యతంత్రమంతయు నాఁడుదానిమాటలనుండి పుట్టినదేగాదా?

కుటి—అదిగో! అప్పుడే యాఱునూఱైనది. ఆఁడువాండ్రు సామాన్యులుగారు. ఆవ్రలించినచోఁ బ్రేవులు లెక్కపెట్టుదురు. ఈసంగతి నీకెట్లు తెలిసినది?

మల్లి—అదిగొప్పప్రశ్న! నాకేల తెలియలేదని యడుగుదు. పెద్దరాణిమాట మంత్రిగారిచెవిలో ముందుగాఁ బ్రతిధ్వనించుట నానోటనుండియేగాదా?

కుటి—అలాగా? ఇంకేమి! మనయదృష్టదేవత యాఁడుదానియడుగుజాడలనే వచ్చి యెదురుకొనుచున్నదా?

మల్లి—అప్పుడే యేమైనది? సేనలన్నియును బ్రసేనునిచేతిక్రిందనే యున్నవిగాదా?



కుటి—మెల్లఁగ మాటాడుము! ఈనడుమ నిపుణమతియగు మనమంత్రి సహాయదండనాథుఁడగు ప్రతివిందునిఁ గొంతవఱకు వశపఱచుకొని ప్రసేనుఁ డెఱుంగకుండ సేనలన్నిఁటిని బరీక్షించి తనపరిపాలనముంగూర్చి వారికి బోధించి తనయెడల విశ్వాసముగలిగి యుండవలయునని కోరి యుచితరీతిని బహుమతుల నొసంగి వారినిఁ దృప్తిపఱచియున్నాఁడు. అవకాశము వచ్చినప్పుడు వారందఱును గాకపోయినను జాలమంది మనపక్షమునఁ బనిచేసితీఱుదురు.

మల్లి—మనపక్షమనియెదవేమి? మంత్రిపక్షమనుము.

కుటి—అక్కఱలేదు. ఇంకను నీకుఁ దెలియలేదు. క్రమముగా నదృష్టముపట్టి యధికారములు మాఱినప్పుడు మంత్రి రాజగును. అప్పుడు నేనే మంత్రి నగుదును. అందుచేతనే మనపక్షమనినను, మంత్రిపక్షమనినను నొక్కటే యని యట్లు చెప్పితిని.

మల్లి—ఆలాగా! అట్లయినచో రాజకార్యములలోఁ బడి నన్నసలే మఱచిపోయెదవు కాఁబోలును!

కుటి—నీవట్లెన్నఁటికిని సంశయింపకుము. నీవు నాప్రాణప్రియవు. ఎన్నిపనులలో నున్నను నిత్యమును నామనసు నీయందే యుండును. మల్లికా! నీచల్లనిపాట విని చాలనాళ్ళయినది. ఏదీ యొకపాటపాడుము!

మల్లిక పరమానందముతో నృత్యము చేయుచు మధురస్వరమున నిట్లు పాడఁదొడంగెను:—

"చలువలఁ దావుల వెదచల్లెడునా
చక్కనిపూవులతోఁటా;
చెలువరి మాధవుఁ డెడలినతటి నసి
చెడినది పూటకుఁ బూఁటా;
వలరసమున సలలితగతిఁ బెరుఁగుచు
నలరెడు నా యెలఁదీఁగా
వలవంతకుఁ జిక్కి స్రుక్కి ఘనతరు
వాల్లభ్యమెడలి పోఁగా;
కడు వేడుక నేఁగోసి తెచ్చుకొని
కట్టినపూవులదండా,
వెడఁ దాల్చెడువారు లేక రే చనఁ
బడియున్నది యెదు రిండా."

కుటిలుఁ డాపాటయందును నాటయందును దన్మయుఁడై పోయెను. అట్లు కొంతసేపైనతరువాత నాతఁ డామెతోఁగూడ నింటికిఁ బోయి యానాఁటికి మంత్రిదర్శనము చేయుటయే మఱచిపోయెను.

---

## తొమ్మిదవప్రకరణము.

---

మంత్రియాశలు దినమున కొకరీతిగా మాఱుచుండెను. ఆతని రహస్యప్రయత్నములుగూడ నొకదాని కొకటి సాయపడి యాశలను వర్ధిల్లఁజేయుచుండెను. కాని యాలోచనలచే నాతనితల తిరిగిపోవుచుండెను. "కుటిలుఁడు నిన్ననే వచ్చె నంట గాదా! ఇంకను నాకడకు రాలేదేమి? ఆతఁడు పోయిన పని కాలేదేమో! అయినచో నతిత్వరితముగ వచ్చి చెప్పకుండునా? ఊరక మఱచిపోవుట కిది సామాన్యకార్యమా? అదృష్టమంతయు నాతనిపనిమీఁదనే యాధారపడి యున్నది. అందుచేతనే యీరహస్యవిషయమునం దాతనిసహాయ మపేక్షింపవలసివచ్చినది. అట్లు గాకున్నచో మహామంత్రి నగు నేనీపేదబాపని నాశ్రయించు టెందులకు? కఱకునారసమున నైననుఁబులుగుఱెక్కతోఁబనియుండునుగదా! ఆబుద్ధిహీనుని నాశాపాశములచే బంధించివైచితిని. ఇఁక నాతఁడు నాచేతిలోనిబొమ్మ. నేనెట్లాడించిననట్లాడఁగలఁడు. ఈయుపకరణములన్నియును నాకార్యము సిద్ధించునంతవఱకే గాని తరువాత వీనితోఁ బనియేమున్నది? నిశ్చయముగా నాకివి యదృష్టదినములు. అందుచేతనే యల్పప్రయత్నముచే నెంతటి ఘనకార్యములైనను సిద్ధించుసూచనలు గానవచ్చుచున్నవి." అని

యనేకవిధముల నాలోచించుకొనుచుండెను.

అప్పుడు కుటిలుఁడు వచ్చి యానందసూచకకంఠస్వరముతో "కార్యము ఫలించినది." అనియెను. ఆమాట విన్నంతనే మంత్రి చటాలున లేచి కుటిలునిఁ గౌఁగిలించుకొని "మిత్రమా! నీవు పోవుటయును, గార్యసిద్ధి కాకుండుటయు నా? మన కదృష్టదినములు సమీపించి యున్నవి. కావుననే నలుదెసలనుండియు శుభసూచన లగపడుచున్నవి. కొలఁది దినములలోనే నీ వీకోసలరాజ్యమునకు మహామంత్రివి కాఁగలవు!" అనియెను.

కుటిలుఁడు సంతోషావేశముచేఁ బొంగిపోవుచు "ప్రభూ! నీవన్నమాట నిజమే. నాపని యెంత యసాధ్యమైనదో యంతసులభముగా సాధ్యమైపోయినది." అనియెను.

మం—అలాగా? ఏమిజరిగినదో సంక్షేపముగఁ జెప్పుము! హైహయప్రభు వేమనియెను?

కుటి—మొట్టమొదట నామాటలయం దాతని కెట్టి విశ్వాసమును గలుగ లేదు.

మం—ఎట్లు గలుగును? మనరాజాతనికిగర్భశత్రుఁడు గాఁడా? ఆతనిపక్షమువార మగుమనలనుగూడ నట్లే భావించుటలో నాశ్చర్య మేమున్నది?

కుటి—ఎన్నివిధముల బోధించినను నాతనికినమ్మకము గలుగ లేదు. తుదకు మీయుత్తరమును జూపించితిని. దానితో



నాతనిమనసు తిరిగిపోయినది. క్రమముగా నాదారికి వచ్చినాఁడు. రాఁడా మఱి! ఇం దాతనికి నష్టమేమున్నది? ఇఁక రెండురాజ్యములును నిష్కంటకములై యుండవచ్చును. వారి సరిహద్దుల ప్రాంతములు వారికి లభించును. ఇంకేమి?

మం—ఆహైహయరా జన్నిపద్ధతులకు నంగీకరించినాఁడా?

కుటి—మాటలతో నంగీకరించుటగాదు. స్వయముగా మీకుత్తరముగూడ వ్రాసి యిచ్చినాఁడు. ఇదిగో చూడుము.

మంత్రి యాయుత్తరము నాత్రముతో నందుకొని చదువుకొనియెను. అం దిట్లున్నది.

"భవిష్యత్కోసలరాజ్యసర్వాధికారు లగుకోసలమంత్రిశేఖరులకు—హైహయరాజ్యేశ్వరుఁ డగువిజయకేతుఁడు వందనపూర్వకముగా వ్రాయునది. మీనిబంధనల నన్నిటి నంగీకరించితిమి. మీ చెప్పినచొప్పున దండెత్తివచ్చుటకుఁ దగుసన్నాహము చేయుచున్నాము. కావలసిన కట్టుదిట్టములన్నియును జేసికొని మీరు సిద్ధముగా నుండవలయును. ఒకడపటి కపటయుద్ధనటనముతో మీకును మాకునుగూడ శత్రునిశ్శేషము గాఁగలదు. మీ రిచ్చెదమన్నది మాకుఁ జాలును. తరువాత మీరాజ్యమును బట్టపురాణిచేఁ బరిపాలింపఁజేసినను, మీరే యేలుకొన్నను మాకెట్టియభ్యంతరమును లేదు. సమయము వచ్చునంతకు నన్నిప్రయత్నములు నతిగూఢముగనే

జరిగింపవలయును. ఇంతటినుండి మనమైత్రి చిరకాలమువఱకును వర్ధిల్లుఁగాక !

ఇట్లు

విజయకేతుఁడు."

మంత్రి యిట్లాయుత్తరమును జదివి తనలో "ఈ వెఢఁగు బాపనివలెనే యీవెఱ్ఱిరాజుగూడ నావలలోఁ బడిపోయినాఁడు. ఇప్పటికి నాపైపని యంతయును బూర్తియైనది. ఇఁక లోపలివారిని లోఁబఱుచుకొనవలయును. అది యెంతసేపు! అదృష్టము పట్టినప్పు డన్నిమార్గములును సుగమములుగనే యుండును" అని భావించుకొని కుటిలునిఁగాంచి "వయస్యా! నీవు పోవుటవలన నింతపని జరిగినది గాని లేకున్నచోఁ గాదుసుమా!'' అనియెను.

కుటి—మీకు నాయం దంతదయ యున్నది.

మంత్రి నవ్వుచు "మిత్రమా! నీవు మంత్రివైనప్పుడు నన్నుఁగూడ నిట్లే చేయుదువా యేమి?" అనియెను.

కుటి—సరిసరి! ఎంతమాట యంటివి! అట్టితుచ్ఛబుద్ధి నాయింటను వొంటనుగూడ లేదు.

ఆమాట మంత్రికి చెప్పుదెబ్బవలెఁ దగిలెను. అది యాతని కెంతయో దూరార్థమును సద్యస్స్ఫురణకుఁదెచ్చినది. మాటకు మాట యనియెనే గాని కుటిలున కంతయర్థము తోఁచనే లేదు. కాని యీవిషయమునం దిరువురును సమాను



లే— రెండును క్రూరసర్పములే - ప్రాణములుతీయుటయందు వానివిషమును సమానమే—

ఇంతలో నొకసేవకుఁడు వచ్చి "అయ్యా! ప్రతివింధుఁడు వచ్చి దర్శనమును గోరుచున్నాఁడు" అని మనవి చేసెను. సమయమునకు సరిగనే వచ్చెనని సంతోషించి మంత్రి యాతని వెంటనే లోనికిఁ దీసికొని రమ్మని యాజ్ఞాపించెను. మఱియొకనిమిషమునకుఁ బ్రతివింధుఁ డచ్చటికి వచ్చి మంత్రి కభివాదనముచేసి "అమాత్యశేఖరా! నాయుద్యోగమునకు సెలవు దయచేయవలయును'' అని కోరెను.

మం—అది యేమి!

ప్రతి—అయ్యా! దానికనేక కారణములున్నవి. ఇట్టి రాజసేవ చేయుటకంటె బిచ్చమెత్తుకొని జీవించుట మంచిది.

మం—ఆకస్మికముగా నీకింతటివిరక్తి యేల గలిగినది?

ప్రతి-తమ మనఃప్రాణముల నర్పించి దాస్యము చేయవచ్చును గాని, తక్కువమాటలుపడి పనిచేయుట చాలకష్టము.

మం—నిన్నిప్పు డెవ్వ రేమన్నారు?

ప్రతి—సర్వసేనాపతియగు ప్రసేనుఁడుతనకుఁ దెలియకుండ మీకు సేనాపరిచయమును గల్పించితినని నన్ననరాని మాటలని పరాభవించినాఁడు. అతని కధికార మధికముగా నుండవచ్చును గాని యాత్మగౌరవముచే నాతఁడు నేనును సమానులమే గాదా ?

మం—ఏమిది! ప్రసేనుం డంతగర్వముతోనున్నాఁడా? సేనావిషయమున నాకెట్టియధికారమును లేదనియే కాఁబోలు నాతని యుద్దేశము!

ప్ర—మహారాజుగారట్టే యేర్పఱచినారఁటగాదా?

మం—అట్లుగాదు. అతఁడు సేనాపతిగావున సేనలఁ జూచుకొను చుండవలయు నని నియమించి రాజ్యభారమంతయు నాయం దుంచినాఁడు. నేను రాజప్రతినిధినై రాజ్యశాసనము చేయుచున్నప్పుడు నాకెల్లవిషయములయందును సమానాధికారమేయున్నది. ప్రసేనుని వానియధికారమునుండి యొక్కనిమిషములోఁ దొలఁగించుటకు నాకధికారమున్నది. ఈసంగతి నాతఁడు తెలిసికొనలేఁడు కాఁబోలును—సరే—దానికేమి—నాకు సేనలను జూపించుటయేనా నీతప్పు? ఇంకను నితరాపరాధమేమైన నీయం దాతఁడుమోపినాఁడా?

ప్రతి—ఇదియే నేఁజేసినమహాపరాధము. సైనికశాఖయందుఁ గొలఁదితప్పులైనను గొంపలు ముంచివైచుననియు, నిశ్చయముగా నీవిప్పుడు రాజద్రోహము చేసితి వనియును నాతఁడు నన్ను నిందించెను. ఇందునాతప్పేమున్నది? మీయాజ్ఞను నెఱవేర్చుటకై యాతని నడుగకుండ మీపని చేసితిని. అందుచే నాకాతనిచేఁ దిట్లా? భిన్నస్వభావు లగునిరువురి మనసులనుగూడ రంజింపఁజేయుట యెట్లు? ఇట్టికఠినదాస్యముకంటె భిక్షాజీవనమైనను మేలేయని నాకుఁ దోఁచుచున్నది.



మం—మంచిది. ఇంతటినుండి నీపై నాతని కెట్టియధికారమును లేకుండఁ జేసెదను. అందుకొఱకు నీవేమియు విచారింపవలదు.

ప్రతి—నాకేమియు విచారములేదు. అయుద్ధోపజీవియగుక్షత్రియకుమారుఁడనైననాకు మీయాశీర్వాదముచే నిచ్చటఁ గాకున్న నెచ్చటనైన నుద్యోగము లభింపఁగలదు.

మం—వలదు. నీవెచ్చటికినిఁ బోవలదు. ఇచ్చటనే యుండుము. నేను నిన్ను సర్వసేనానాయకునింగావించెదను.

ప్రతి—అయ్యా! క్షమింపుఁడు. నాకంతటియాశ లేదు.

మం—నీకట్టియాశ లేదుగాని మాకంతటివివేచన మున్నది. ప్రధానదండనాయకత్వమునకుఁ బ్రసేనునికంటె నీవే యర్హుఁడవు.

ప్రతి—నన్నంతగాఁ బ్రశంసింపవలదు. నేను సామాన్యసైనికుఁడనైయుండఁగా బ్రసేనుఁడే మహారణనైపుణ్యముం గఱపి నన్నింతటివానింగాఁ జేసినాఁడు.

కుటి—అదేమిమాట! నీయోగ్యతయే నిన్నింతవానింగాఁ జేసినది. నీవు నిజముగాఁ బ్రాజ్ఞుఁడగు నేరాజునొద్దనైన నున్నచో నీపాటికి సర్వసేనానాయకుఁడవుగాకుందువా?

ప్రతి—అయ్యా! అట్లనవలదు. మనమహారాజట్టియప్రాజ్ఞుఁడని సంశయించుటకైనను నేను సహింపఁజాలను. అది నాయదృష్టము గాని మహారాజు చేసినలోప మేమున్నది?

మం—ప్రతివిందా! ఈమాటలతోఁ బనియేమి? నీవు నన్ను నమ్మియున్నచో నీకభ్యున్నతినిఁ గల్పింపఁగలను.

ప్రతి—అమాత్యవరా! "మంత్రిచెప్పినపని చేసినచో నిన్ను సహాయదండనాయకపదమునుండి తొలఁగించివైతును" అని ప్రసేనుఁడు నన్ను శాసించి యున్నాఁడు.

మం—నిన్నే తొలఁగించునో యాతఁడే తొలఁగిపోవునో కొలఁదిదినములలో నీవే చూతువు గాని.

ప్రతి—నాకొఱకు మీరంతపని చేయవలదు. నన్నుఁ గూర్చి మీయిరువురిలోఁ బరస్పరస్పర్ధలు వర్ధిల్లఁగలవు. అందువలన మహారాజునకును రాజ్యమునకునుగూడ ననర్థములు గలుగును. కావున నేనే సెలవు గైకొని పోఁదలంచితిని.

మం—నేనంతటి యవివేకిననుకొనుచుంటివా? నాకంఠమునఁ బ్రాణముండఁగా వేయిమంది ప్రసేనులైనను రాజ్యమున కనర్థమును గల్పింపఁగలరా? కప్పలెంతగట్టిగాఁ గూసినను ఘనాఘనగర్జనము ననుకరింపఁగలవా? ఒక్కమాట నిన్నడుగుచున్నాను. నీవు నాయాజ్ఞ ననుసరించిపని చేయుదువా?

ప్రతి—మా సేనాధిపతివలె మాటిమాటికి నవమానించుచున్నచో నెంతప్రేమించుచున్నను మిమ్ము నేను సేవింపఁజాలను.

మం—నన్ను నీవెన్నఁడు నట్లు భావింపవలదు. నీయభివృద్ధిని వాంఛించుచున్న నేను నిన్నట్లవమానింతునా?



ప్రతి—అట్లయినచో నతివిశ్వాసముతో నేను మిమ్ము సేవింపఁగలను.

మం—నీయభివృద్ధికొఱకై నేఁ జేయుప్రయత్నములకన్నిటికిని నీవు సాయపడుదువా? ఆవిషయమునందు నేఁ జెప్పినట్లు చేయుదువా?

ప్రతి—అందువలన నితరుల కనిష్టముగాని, నాకు మనఃకష్టముగాని లేకున్నచో నది యెట్టిపనియైనను జేయుటకు సిద్ధముగా నున్నాను.

మం—ప్రతివిందా! అదేమిమాట! ఇతరుని కొక్కనికైనను గష్టము గల్పింపనిసుఖ మీలోకమం దెక్కడనైన నున్నదా? మనము సుఖమును గోరి పనిచేసినచో నది ప్రత్యక్షముగనో, పరోక్షముగనో యితరులకుఁ గష్టమును గల్పింపక మానదు. మనము రాజ్యరక్ష చేసికొనఁదలఁచినచో శత్రుమర్దనముచేయవలయును. కఠినశాసనములు చేయవలయును. మనము వాహన మధిష్ఠింపఁదలఁచినచో జీవులచే మోయింపవలయును. అందువలన నితరులకుఁ గష్టము గలుగకమానునా?

ప్రతి—సరే. ఇప్పుడు నేనేమి చేయవలయునో సెలవిండు!

మం—చెప్పెదను. కాని నీకంతసాహస ముండునో యుండదో యని సంశయించుచున్నాను.

ప్రతి—మంత్రివరా! జీవికి మృత్యుభయమును మించిన భయము లేదుగదా! అట్టిమరణమునకుఁ గూడ క్షత్రియకుమారుఁడు భయపడఁబోఁడు. సుక్షత్రియవీరుఁ డగునీప్రతివిందుఁ డెట్టి ఘనకార్యాచరణమునకైనను వెనుకంజవేయువాఁడు గాఁడని నిశ్చయముగా నమ్ముఁడు.

కుటి—సెబాస్ప్రతివిందా! నీమాటలు నీ యోధోచితములై యున్నవి. మహామంత్రియే యిప్పుడు నీవిషయమున దూరదృష్టితో నాలోచింపఁజాలక పోయెను.

మంత్రి—ప్రతివిందా! ఘనకార్యనిర్వహణము గావున వెనుకముందాలోచింపవలసి వచ్చుచున్నది. ఇంకెందులకు? పెద్దరాణియాజ్ఞ ననుసరించి నీతో నిప్పుడొక్క మాట చెప్పుచున్నాను. వినుము. ఇందు నాకెట్టిస్వార్థపరత్వమును లేదు. అది యంతయు నీకే లాభకరమైనది. నే నామెకు సాయముచేయుట కంగీకరించితి. నీవుకూడ నామెయాజ్ఞను మన్నింపవలయును.

ప్రతి—దానికేమి! వారియన్నమును దినుచున్న సేవకుఁడనగునాకుఁ బ్రాణములనైన నిచ్చి వారియాజ్ఞను బాలించుట ప్రధానకర్తవ్యముగదా!

మంత్రి—హృదయమును బరీక్షింపకుండ నెవ్వరికిని దనయుద్దేశమును దెలుపవలసినదని పట్టపురాణి నాకానతిచ్చినది. నీయందు నాకుఁ జిరవిశ్వాసమున్నది గావునఁ జెప్పు



చున్నాను. తనపెద్దకుమారి శోభన యుండఁగా మహారాజు సగరునకే రాజ్యమీయఁదలంచుట యన్యాయమని పట్టపుదేవికి విచారముగా నున్నది.

ప్రతి—ఇందన్యాయ మేమున్నది? రాజ్యార్హుఁడు రాజకుమారుఁడేగాదా ?

మం—ఔను. నిజమే—అయినను పట్టమహిషి కది మనఃకష్టముగా నుండుటయం దసంభవ మేమున్నది?

ప్రతి—ఉత్తమరాజపుత్త్రి యగునామె యట్లు భావించునని నేను నమ్మఁజాలను.

మం—నామాట నమ్మవు! ఈమాట యామెయే చెప్పినది. ఎట్లైన నీవును, ప్రతివిందుఁడును, కుటిలుఁడును గలసి యీరాజ్యమును నాకు హస్తగతముగఁ జేయవలయునని నాతోఁ జెప్పినది.

ప్రతి—మహారాజుండఁగా నది యెట్లు సాధ్యమగును?

మం—మనము మువ్వురమును గలసినచో నదియెంత పని! మహారాజుతోఁ బ్రతిఘటించి యుద్ధము చేసియైనను రాజ్యమును దేవి కర్పింపవచ్చును.

ప్రతి—మంత్రివర్యా! ఎవ్వరైన నవ్వి పోదురు. మనమా యంతపని చేయుట? మహానలజ్వాలలోఁ బడు మిడుతలవలె మాడిపోమా?

మం—మహావీరుఁడవగు నీవుకూడ నంతభయపడి పోవుచున్నావే?

ప్రతి—నిజముగా భయపడవలసినదే. ప్రాణముల కొఱకుఁ గాదు-పాపముకొఱకు.

మం—ఆమె రాజేశ్వరి యైన వెంటనే నిన్ను సర్వసేనానాయకునిగాఁ జేసెదనని చెప్పుచున్నది.

ప్రతి—మంత్రిశేఖరా ! ఇవి యన్నియు నున్మత్తప్రలాపములు—వీనికర్థ మెంతమాత్రమును లేదు.

మం—ఈమాటలు నవ్వులాటలుగాఁ ద్రోసివైవకుము. నామాటవినుము. ఇప్పుడునీచేతిక్రిందఁగూడఁ జాలమంది సైనికు లున్నారు. వారిని నీవు వశపఱచుకొనుము. ప్రసేనుని పగతీర్చుకొనుటకుఁగూడ నిప్పుడే యవకాశ మున్నది. మంచి యవకాశము చూచుకొని మనమందఱమును గలసి రాజు నెదిరించి యుద్ధముచేయుదము. మనకు జయము లభించుటకుఁ దగినప్రయత్నము లన్నియును నేఁ జేయుదును. పట్టపురాణి మనపక్షమునం దుండఁగా నిఁక భయమేమున్నది?

ప్రతి—మంత్రివరా ! క్షమింపుము. నన్నట్టిపాపకార్యమునకుఁ బ్రోత్సహింపకుము. ఇది నీచులును, ధర్మశూన్యులును, పాపాత్ములును, పశువులును జేయఁదగిన దుష్కార్యముగాని మనవంటివారు వినుటకైన నర్హమైనది గాదు. స్వామిద్రోహులును, విశ్వాసఘాతుకులును గూడ జగమున్నంతకాలమును నరకపతితులై ఘోరయాతనల ననుభవించు



చుందురు. వారిదుశ్చరిత్రములు కవులలేఖినులనుండి యక్షరరూపమున వెలువడి శాశ్వతముగా వారిపాపవృత్తములను ఘోషించుచుండును. చదివినపాఠకులెల్లరును వారిననేకవిధములఁ దిట్టుచుండక మానరు. అట్టియపకీర్తి లోకమందున్నంతకాలము నట్టిదుష్టాత్ముల కధోగతియే—ఛీ! ఛీ! మంత్రీ! ఇట్టిదుస్సంకల్పము పశువునకైనను గలుగదు.

మం—ప్రతివిందా! నీవూరక భయపడుచున్నావు. నేఁజెప్పినమాట వినుము. ఈపనిచేసినచో నీవు త్వరలోనే సర్వసేనాధిపతి వయ్యెదవు.

ప్రతి—మంత్రీ! అన్నిపాపములకును బ్రాయశ్చిత్తమున్నది గాని విశ్వాసఘాతకత్వమున కెట్టిప్రాయశ్చిత్తమును లేదు. సకలకర్మములకును విముక్తి యున్నదిగాని స్వామిద్రోహదుష్కృతికిమాత్రము నిష్కృతి లేదు.

మం—సేనాపతీ! ఇంచుక మనస్సుస్థిరపఱచుకొనుము. పిఱికిపందలును, దుర్బలులును, బుద్ధిహీనులునుమాత్రమే పాపమునకు భయపడుచుందురు. సుఖదుఃఖములకంటెఁ బుణ్యాపాపము లెక్కడ నున్నవి? నామాటవినుము. నీవచిరకాలములోనే సుఖి వయ్యెదవు.

ప్రతి—నాకట్టిసుఖము వాంఛనీయముగాదు. సుక్షత్రియవీరుఁడు లోకనింద్యములగు హేయకృత్యముల నెన్నఁటికి నాచరింపఁబోఁడు. మీరు నృశంసులు! ఘాతుకులు! స్వామి

ద్రోహులు! నేనిఁక మీచెంత నొకనిమిషమైనను నిలువఁజాలను. మీపాపమున మీరు పొండు. మీగొడవ నాకక్కఱలేదు.

అని చటాలున నటనుండి లేచిపోయెను.

---

## పదియవ ప్రకరణము

---

హైహయులు మరలఁ గోలుకొని దండెత్తివచ్చుటకు సిద్ధముగా నుండిరను వార్త విన్నప్పటినుండియు మహారాజునకు మనస్స్తిమితత లేదు. అతఁడీవిషయమునఁ బ్రసేనునితోఁ నుద్యానవనమున రహస్యముగా మాటలాడుట కేర్పాటుచేసికొనియెను. కావున నుద్యానమునకుఁ బోయి లతామండపమునఁ గూర్చుండి ప్రసేనునిరాకకుఁ జూచుచుండెను. ఇంతలోఁ గుటిలుఁ డచ్చటికి వచ్చి "మహారాజా! ఒంటిగఁ గూర్చున్నారేమి? నన్నుఁగూడఁ బిలిచినచో నేనును వత్తును గదా!" అనియెను.

రాజు—నాకేమియుఁ దోఁచుటలేదు. మరల రాజ్యమునందు గందరగోళము పుట్టినది.

కుటి—ఔను ప్రభూ! ఈసమయమునందు మీరిట్లుదా



సీనులై యుండుట యుచితముగాదు. వేయికన్నులతోఁ జూచికొనవలయును. వేయి చేతులతోఁ బనిచేయవలయును.

రాజు—వయస్యా! ఎంతకాలము పాట్లుపడుమనియెదవు? ఎటుపోయి యెటువచ్చినను మంత్రిసేనాపతులు చూచుకొనవలసినదే గాని నేనేమియుఁ జేయఁజాలను.

కుటి—సరిసరి. మీరిట్లు విరక్తులై యున్నారు. మంత్రిసేనాపతులకు మనసులు కలియుట లేదు. సమయము ప్రతికూలముగా నున్నది. ఇప్పు డందఱు నేకమై పని చేయకున్నచో నెట్లు?

రాజు—వయస్యా! ప్రసేనుఁడు చాలవిశ్వాసముగలవాఁడే!

కుటి—నిజమే—మంత్రిమాత్రమో—అతఁడు మంచివాఁడు గాఁడందురా?

రాజు—కాకేమి! ఇరువురును మంచివారను విశ్వాసముచేతనే వారికి రాజ్యమంతయు నొప్పగించి నిశ్చింతుఁడనై యున్నాను.

కుటి—నిజమే గాని క్రమముగా నీద్వంద్వప్రభుత్వము రాజ్యమునకుఁ బ్రతికూలముగాఁ బరిణమించునేమో యని భయమగుచున్నది.

రాజు—అదియేమి? ఇట్టిసమయములయం దిరువురు నేకీభవించియే పని చేసికొనవలయును.

కుటి—మీయుద్దేశ మదియే కావచ్చును. పనిమాత్రమట్లు జరుగవలదా ?

రాజు—జరుగ కేమి ? మంత్రియాలోచనము ననుసరించియే మెలంగవలయు నని నేను ప్రసేనునితోఁ జెప్పెదను. నీవిప్పు డింటికిఁబొమ్ము. ఇప్పుడు ప్రసేనుఁ డిచ్చటికి వచ్చును.

అని యాజ్ఞాపించుటయుఁ గుటిలుఁడు చిత్తమని వెడలిపోయెను. తరువాతఁ గొంతసేపటికిఁ బ్రసేనుఁడు వచ్చి మహారాజునకు నమస్కరించి యాతని యనుజ్ఞచే సమీపమునఁ గూర్చుండెను. మహారాజాతనిం గాంచి "సేనాపతీ ! విశేషము లేమి ?" అనియెను.

ప్రసే—మహాప్రభూ ! మీరు రాజకార్యములనుండి విరమించినప్పటినుండియుఁ గ్రమముగ నుద్యోగు లందఱు నెవరికివారే పెద్దలైపోయినారు. ప్రజలలో నెన్నఁడును లేనిమోసములును, చోరాదిభయములును పుట్టుటచేఁ గ్రమముగా రాజభక్తి తగ్గిపోవుచున్నది. ఇదియంతయుఁ జూచి భయపడుచుండఁగా నెన్నఁడో చచ్చినట్లుగా నెచ్చటను బేరైనవినఁబడని శత్రువులుగూడ నిప్పుడు విజృంభించుచున్నారు.

రాజు—అలాగా ? రాజ్యభారమంతయు నేను మంత్రిపైఁ బెట్టితినిగదా! అతఁడే యీవిషయము లన్నియునుబరిశీలించి యుచితరీతినిఁ బరిపాలింపవలసి యుండును.

ప్రసే—నిజమే—మంత్రి యిప్పుడు నాయెఱుక లేకుండఁగనే సేనలను బరీక్షించుట కారంభించినాఁడు ?



రాజు—అది యెట్లు ?

ప్రసే—సహాయదండనాయకుఁడు ప్రతివిందుఁడున్నాఁడుగాదా ? ఆతఁ డిప్పుడు మంత్రికిఁ బ్రధానదండనాయకుఁడైయున్నాఁడు.

రాజు—ఆతనికి నీయిష్టముమీఁదనే గాదా నేనంత యధికార మిచ్చితిని. ఇప్పు డాతఁడు నీకుఁ బ్రతికూలముగ సంచరించుచుండెనా ?

ప్రసే—ప్రతికూలమో యనుకూలమో యిప్పుడేమని చెప్పఁగలను ? ఆతఁడు నాయాజ్ఞ లేకుండఁగనే మంత్రి యిష్టము ననుసరించి పని చేయుచున్నాఁడు. సేనావిభాగవిషయమున మంత్రి యేమియు నాతో నాలోచించుటయే లేదు సరిగదా—తఱచుగా సైనికులను బరీక్షింపవలసిన యావశ్యక మాతని కేమున్నది ?

రాజు—రాజ్యభార మంతయు వహింపవలసినవాఁడు గావున నాతఁడు సేనలనుగూడఁ జూడవచ్చును. అందువలనఁ దప్పేమున్నది ?

ప్రసే—చూడవచ్చును గాని నాతోఁగూడ నాలోచింపవక్కఱలేదా ? అట్లయినచో నాకీసర్వసేనానాయకత్వ మెందులకు ? అందువలన నాయెడల సైనికుల కలక్ష్యము గలుగదా ?

రాజు—మంత్రియావిషయమైయాలోచింపవలసినదే.

ప్రసే—అతఁ డెప్పుడును ప్రతివిందునితోడను, గుటిలునితోడను గలసి యాలోచించుచుండును. నాప్రస్తావమే లేదు. ఇదిగాక—ఇప్పుడు నేను గొంతసైన్యముతో నీదుర్గమును వదలిపోయి దండెత్తి వచ్చుచున్నశత్రువులను మార్గమధ్యమునందే యెదిరించి యాఁపవలయునని మంత్రి యొక యుత్తరువుగూడఁ జేసియున్నాఁడు. ఇట్టిసమయమునందుఁ గోట విడిచి పోవుటకు నాకుఁ జాలభయముగా నున్నది.

రాజు—ఔను.నిజమే—కాని పరిపాలనలోపముచేఁ బ్రజలయందలి విశ్వాసమును, మోసమును వర్ధిల్లుచున్నట్లు నీవె చెప్పితివిగాదా? శత్రువులు వచ్చి మనదుర్గమునే ముట్టడించుట తటస్థించెనేని ప్రజలందఱు నెట్టిప్రతికూలసంఘటనములను గావింతురో మనము చెప్పఁజాలము. శత్రువులుమన దుర్గముచెంతకు రాకుండ వారిని వెనుకకుఁ దఱిమినైచినచో మనకీయవాంతరదుస్తంత్రముల కవకాశమే లేకుండఁబోవును. అంతపని చేయుటకు సర్వవిధముల నీకంటె విశ్వస్తులును సమర్థులు నగువారింకెవ్వరున్నారు ?

ప్రసే—మహారాజా! సామర్థ్యముమాట యెటులున్నను జిన్నతనమునుండియు మీయన్నమును దినుచున్న విశ్వాసము గలవాఁడ నగుటచేతనే యిట్లు మనవి చేయుచున్నాను.



ఈస్థితిలో మిమ్ముఁ గోటలో నొంటిగా విడిచి నే నెచ్చటికిని బోఁజాలను.

రాజు—నీకంతభయ మెందులకు ?

ప్రసే—మహారాజా! ప్రసేనుఁడు తనకొఱకును,దన ప్రాణముకొఱకు నెన్నఁడు భయపడువాఁడు గాఁడని యేలినవారికే యెఱుక—కాని ప్రభువువారి నొంటిగా—

రాజు—ప్రసేనా! నాకేమి భయము?

ప్రసే—ప్రస్తుతస్థితిగతులనుబట్టి నాకుఁ జాల భయముగానున్నది. ఎవ్వరినిగూర్చి యేమిచెప్పుటకును సంశయముగా నున్నది. ఎంతవారినైనను నమ్ముట కవకాశము లేకుండఁబోవుచున్నది.

రాజు—ప్రసేనా! ఎవ్వరికైనను నాయెడల నెట్టి యవిశ్వాసము పుట్టుటకైనను నవకాశము లేదు. నేను నాయుద్యోగులకందఱకు నేరాజ్యమునందైనను లభింపనంతటి వేతనముల నిచ్చుచు సుఖముగా వారినాదరించి పోషించుచున్నాను. ఎవరియధికారములను వారికి సంపూర్ణముగా నొసంగి నేను విశ్రాంతి గైకొనియున్నాను. అందుచే నావారు నాకుఁ బ్రతికూలు రగుదు రను ననుమానము నాకెంతమాత్రము గలుగుట లేదు.ఒకవేళ నెవ్వరైనదుర్బుద్ధిచే నాకపకారముచేయఁ దలంచిన వారిపాపమున వారే పోవుదురు. సార్వభౌముఁడనగు నారాజ్యమునందే, సర్వసముఁడనగు నాయాదరమునందే

సుఖింపఁజాలని దురాశాపరుల కీపృథ్వీతలమునం దెచ్చటను సుఖస్థానమే యుండదు. శుద్ధజలార్ణవమధ్యమందున్నను దాహశాంతి లేనివారికి క్షుద్రపుష్కరిణులును, సరోవరములు నేమి లెక్క?

ప్రసే—ప్రభూ! నాకేమోగాని యిప్పుడు నాయందే విశ్వాసము గలుగుట లేదు. సగరకుమారుఁడు పెద్దవాఁడగువఱకు నెట్లో తామే రాజకార్యములను జూచుకొనుచుండవలయు నని ప్రార్థించుచున్నాను.

రాజు—కొలఁదిదినములలో మరల నాలోచించియట్లు చేయుదును. ఇప్పుడుమాత్రము నీవు నీమనసునం దెట్టికష్టము నుంచుకొనక స్వధర్మమును నిర్వహింపుము. ఇట్టిసమయములయం దేకీభావ ముండవలయును గాని భేదబుద్ధు లుండఁగూడదు. మంత్రి చెప్పినట్లుగా నీసారిమాత్రము నీవు సేనలతోఁ బోయి శత్రువుల నెదిరించి పలాయితులం గావించి రమ్ము. పరమేశ్వరుఁడు నీకు విజయము నొసంగుఁగాక!

అని చెప్పి ప్రసేనునిఁ బంపివైచెను.

## పదునొకండవప్రకరణము.

"ఇంతకాలమునకు నాప్రయత్నము ఫలించినది. ఉచితజ్ఞుఁడగు మంత్రి తనయసాధారణబుద్ధిబలమును బాగుగనుపయోగించి యిప్పటి కన్నికార్యములను సాధింపఁగలిగినాఁడు. ప్రసేనునిచే నవమానితుఁడగు ప్రతివిందుని వశపఱచుకొని యామూలమున సగముసేనకుఁ బైఁగా స్వాధీనము చేసికొన్నాఁడు. ప్రతివిందుఁడుగూడ రాజభక్తుఁడే యైనను క్షత్రియవీరుఁడు గావున ప్రసేనునియెడలఁ బగఁ దీర్చుకొనుటకై మంత్రి చెప్పినట్లు చేయుట కంగీకరించెను. మొట్టమొదట నీపని సాధించుటకే మంత్రి చాల శ్రమపడవలసివచ్చినది. కాని కార్యము ఫలించువఱకును బ్రతివిందుని నమ్ముట కవకాశము లేదు. కేవల రాజపక్షమువాఁడగు నాతఁ డెప్పటికైనను బరిత్యాజనీయుఁడే—ఇఁక హైహయప్రభువుతో మంత్రి చేసినతంత్రము చాల ప్రశంసనీయమైనది. వారి నాశ పెట్టి యూరక యుద్ధమునకు రావలసినదని చెప్పి వారి నడ్డగింపవలయునని యిచ్చట నుండి ప్రసేను నాతని సేనలతోఁ బంపినాఁడు. అటఁ బ్రసేనుఁడును శత్రువులగు హైహయులును బోరాడి పోరాడి యిరువాఁగులును గూడఁ జాలవఱకు హ్రాస్వములై యలసియున్న సమయమున వెనుకనుండి ప్రతివిందుఁడు కొంత సేన

తోఁ బోయి ససైన్యముగఁ బ్రసేనుని నశింపఁజేయుటకును, దాను ప్రత్యేకముగఁ గొంతసేనతోఁ జుట్టుతిరిగి వచ్చి హైహయులపైఁ బడి వారినందఱ నొక్కపెట్టున నిహతులం గావించుటకును నతిసులభమగు నేర్పాటును గావించినాఁడు. ఇట్లు సరిగా జరగినచో నీకరాజ్యము నిష్కంటకమై చేతికిఁజిక్కఁగలదు. అప్పుడు మహారాజును సపుత్త్రదారముగ బంధించి నిర్భయముగా నేనురాజ్యము చేయవచ్చును. ఇఁకమాశోభన రాజరాజేశ్వరియగును. నాహృదయశల్య మంతటితో వదలిపోవును. ఇఁకఁ గావలసిన దేమున్నది? మహారాజెంతపక్షపాతియైనను, అదృష్టవతి యగుశోభన నేమి చేయఁగలఁడు? కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బయన్నట్లు గానాతనికిఁ దగినశాస్తి గానున్నది. ఒకరు రాలురువ్వినప్పుడు మఱియొకరు పూలు చల్లుదురా? ఆతఁడు మగఁడైనంతమాత్రమున నే నాతని తప్పులనుగూడ గౌరవింపవలయునా? పనసతొనలనుభక్షింతుముగాని పై పిచ్చులు నటికి పాఱవైవవలసినవే గావా! ఇంతకును దైవము నాపక్షమందుండెను గావున నాబిడ్డకు న్యాయములభించినది. ఇంకెంత! ఒకటిరెండుదినములలోనన్ని కార్యములును ఫలింపఁగలవు. సంతోషము పొంగి పొరలుచునే యున్నది గాని, అదియేమో యొకొక్కప్పుడు సంశయముతోఁచి గుండె గుభిల్లుమని పోవుచున్నది. మహాకార్యమును సాధించునప్పుడు, మహాఫలము లభింపనున్నప్పుడు



మంచిమాట చెవినిబడువఱకు నెంతటిమహాధీరులకైనను మనసు కలఁగిపోవుచుండక మానదు.''

అని యీవిధముగా విమతి యాకాశపంచాంగములను గుణించుకొనుచుండఁగా శోభన తనగోపాలమూర్తిని జేతఁబట్టుకొని తల్లియొద్దకు వచ్చి "అమ్మా! ఇటుచూడుము! మన గోపాలుని మొగము నేఁడేమో చిన్నవోయిన ట్లున్నదేమే? మనశత్రురాజు మనపై యుద్ధమునకు వచ్చుననువార్త తెలిసిననాఁడుగూడ నీదేవుని మొగ మట్లే యగపడినది. అమ్మా! ఇందువలన మన కెట్టికష్టములు గలుగునో యని సంశయముగా నున్నది. నాకేమియుఁ దోఁచుటలేదు.'' అని కన్నీరు విడువఁ దొడఁగెను.

అప్పుడు విమతి తనయయగు శోభనను కౌఁగిటం జేర్చుకొని "వెఱ్ఱిదానా? ఈమట్టిబొమ్మలఁబట్టియా మంచిచెడ్డల నూహించుట? నీవు సంస్కరించుటలో నేదియో లోపము గలుగుటవలన బొమ్మమొగ మొకింత మలినముగానున్నది. అంతే—దీనికొఱకింత విచార మెందులకు?'' అని యూఱడించెను.

శోభ—అట్లు గాదమ్మా! ఈగోపాలమూర్తియందెట్టిమాలిన్యము గోచరించినను నాకెంతయో భయముగా నుండును.

విమ—భయ మెందులకమ్మా! దైవానుగ్రహముచే

మనకు శుభమే కలుగును. ఈమట్టిబొమ్మ కేమి తెలియునే తల్లీ!

శోభ—అట్లనకమ్మా! అపచారము! గోపాలమూర్తికిఁ గోపము రాఁగలదు.

విమ—ఎంతవెఱ్ఱియే. బొమ్మకుఁ గోపమా? నీకెప్పుడైన దీనికోప మగపడినదా?

శోభ—ఈగోపాలమూర్తి నాపై నెన్నఁడును గోపింపలేదుగాని చాలసారులు నన్నుఁజూచి నవ్వుచుండుట గలదు.

విమ—కుమారీ! ఇది కేవలము నిర్జీవప్రతిమగదా! దీనినవ్వు నీ కెట్లగపడినది?

శోభ—నా గోపాలునినవ్వు నాకు స్పష్టముగా నగపడుచునే యుండును.

విమ—లోకమం దెవ్వరికిని లేనిజ్ఞానము నీకెట్లు గలిగినదే?

శోభ—నాగోపాలునినవ్వెవ్వరికిని గోచరింపకపోవుఁగాక! నాకుమాత్రము స్పష్టముగా నగపడుచునే యుండును.

విమ—అదియే వెఱ్ఱి యనుచున్నాను. అమ్మా! నామాట వినుము. ఇది యంతయును భ్రాంతి. వయసువచ్చుచున్నది గాని నీకింకను బుద్ధివచ్చుట లేదేమి? అచేతనమగు నీప్రతిమ నవ్వఁగలదా? యేడ్వఁగలదా? ఆదేవర్షి చిన్నబిడ్డవగు నీవినోదమునకై నీకీబొమ్మ నిచ్చి పోయినాఁడు. నీవి



దియే సర్వస్వముగా భావించి పిచ్చిదానవై పోవుచున్నావు. అమ్మా! ఇఁక నేఁటినుండి నీవీపూజను గట్టిపెట్టి నాతోఁ దిరుగుచుండుము. కొంతలోకజ్ఞానమైనను గలుగును. ఇట్లేయున్నచో నింకను మతి పోఁగలదు. ఈబొమ్మ నావలఁ బాఱవేయుము.

శోభ—వద్దమ్మా! అట్టిమాటలు చెప్పకుము. ప్రాణముండగా నాగోపాలుని నేను విడువఁజాలను. ఈతనిఁ బూజించుచున్నప్పుడు, యీతనికంఠమును బుష్పహారములతో నలంకరించుచున్నప్పుడు నాకెంత యానందముగా నుండు ననుకొన్నావు? నేనొక్కొక్కప్పుడు మహానందముచే సర్వమును మఱచియీగోపాలుని మొగమువంక నేచూచుచుందును. ఆయానందములో మఱపే నాకుఁ గావలయును గాని యీలోకములోఁ దెలివి యేమియు నాకక్కఱలేదు. నాకీరాజ్యభోగాదు లేవియును వలదు. రేయుంబవ లీగోపాలునే భావించుచు నీతనినే పూజించుచు సుఖముగాఁ గాలక్షేపము చేసికొనుచుండెదను.

విమ—అమ్మా! నేను దినదినమును నీయదృష్టలాభముకొఱ కెంతప్రయత్నము చేయుచుంటినో నీవంతకంతకును గ్రమక్రమముగాఁ బిచ్చిదానవైపోవుచున్నావు. నీకుఁ గేవలము భోగాదులయందు విరక్తి గలుగుచున్నది. మహారాజకుమారి వగునీకిది యెంతమాత్రము నుచితము గాదు.

శోభ—అమ్మా! నే నాఁడుదానను. నాకు రాజభోగాదు లెందులకు? నీవు నాకొఱకు శ్రమపడుటకంటెఁ దమ్ముఁడగు సగరుఁడు సంసారమునం దనురక్తుఁ డగునట్టి ప్రయత్నములను గావింపుము. అతఁడు క్రమముగాఁ బరమేశ్వరనామ మంత్రజపపరాయణుఁడై నారాయణధ్యాననిమగ్నుఁడై సర్వము మఱచిపోవుచున్నాఁడు. ఇఁకఁ గొలఁదిదినములలో నాతఁ డీసంసారమునే సంపూర్ణముగాఁ ద్యజించివైచునేమో యని భయమగుచున్నది.

ఇట్లు వారు సంభాషించుకొనుచుండఁగా వెలుపలనుండి,

"జయజయ బృందావనగోపాలా
జయ గోపవధూలోలా
నయగుణజాలా నవనవ ఖేలా
నరనారాయణలీలా,
జయజయ నిత్య నిరంజన శౌరీ
జయ మునిహృదయవిహారీ!
భయపరిహారీ పాపవిదారీ
భక్తజనావనకారీ"

అను సంకీర్తనము వినవచ్చుటయు సగరకుమారుఁడు వచ్చుచుండె నని గ్రహించి శోభన యెదురుగాఁ బోయి తమ్ముని గాఁగిలించుకొని "తమ్ముఁడూ! నీ వెప్పుడు నిట్టివేషములోనే యుండి రాజాలంకారమును సంపూర్ణముగాఁ ద్యజించివైచుట బాగుగ లేదుసుమీ!" అనియెను.



సగ—అక్కా! అమ్మవలె నీవుగూడ నట్లనియెద వేమి! మంత్రసిద్ధి యగునంతవఱకును రాజవేషమును ధరింపవలదని దేవర్షి యుపదేశించెను గాదా?

శోభ—ఔను. నిజమే—కాని—అది యెంతకాలమునకు సిద్ధించును?

సగ—ఆసంగతి నేనెట్లు చెప్పఁగలను? అదృష్టము లేకున్నచో నది యీజన్మమునఁగూడ సిద్ధింపకపోవచ్చును.

శోభ—ఇంతలో సిద్ధింపకపోయినచోఁ బట్టాభిషేకసమయమునఁగూడ నీవీదుస్తులనే ధరించియుందువుగాఁబోలును!

సగ—అక్కా! అమూల్యవసనభూషణాదులను ధరించుటయే గౌరవ మనుకొనుచున్నావా? నాకు రాజవేషముకంటె నిదియే యతిప్రియముగా నున్నదిసుమా!

శోభ—సోదరా! స్వర్ణాభరణాదులు లేక నీసౌందర్యమునం దించుకలోపము నాకంటికగపడుచున్నది.

సగ—అక్కా! అది నీకనువెఱ్ఱియేగాని వేఱుగాదు. స్వర్ణభూషణములు సౌందర్యమును వర్ధిల్లఁజేయుననుకొనుట వట్టి యవివేకము. ఇవి యన్నియు నించుక దేహమునకు మెఱుఁగు పెట్టునేమోగాని మనసున కెంతమాత్రమును శోభను గూర్పఁజాలవు. కావున నివి శరీరమునకు భారమాత్రములే యని తలంచి యిష్టపడియే వీనిని ద్యజించితిని.

అని యీవిధముగా మాటాడుకొనుచు నిరువురును

విమతిచెంతకుఁ బోయి కూరుచుండిరి. విమత యప్పుడు సగరునిం గాంచి "కుమారా ! అక్కయు నీవునుగూడ నొకరినొకరు మించిపోవుచున్నారు. మీప్రవర్తనము చిత్రముగా నగపడుచున్నది. నీకు రాజును గావలయుననుకోరికయే లేదా?" అనియెను.

సగ—దొడ్డమ్మా ! నీకిప్పుడు నా మనసులోనిమాట చెప్పుచున్నాను. పూర్వము నాకట్టిపెద్దకోరిక యున్నది గాని భగవన్నామమంత్రదీక్షితుఁడనైనప్పటినుండియు నాకు రాజ్యమనిన నసహ్యముగా నున్నది. సుఖదుఃఖసంకులమగు నీరాజధానిని విడిచి యెచ్చటనైన నిర్జనారణ్యమున నిత్యమును ప్రాణము పులకించునట్లుగా హరినామకీర్తనము చేసికొనుచుఁ గాలక్షేపము సేయవలయు నని యున్నది. అమ్మా ! ఇంకను నీమాట మాయమ్మతోఁ జెప్పవలదు. ఆమెకుఁ దెలిసినచో నానామకీర్తనమున కిప్పటినుండియు నంతరాయము గలుగఁ గలదు.

విమ—చెప్పను లెమ్ము! నాయనా! మీయమ్మతోఁ జెప్పను. అచిరకాలముననే నీకు మంత్రసిద్ధి యగుఁగాక !

శోభ—సోదరా ! నీస్థితిగతులనుబట్టిచూడఁగా నీవు సంసారి వయ్యెద వనునాశ కలుగుట లేదు. నీవు పెద్దవాఁడవై రాజసింహాసనము నలంకరించి యుండఁగా కన్నులపండువుగాఁ జూడవలయునను మాయాశ యంతయు నిరర్థకమేనా ?



సగరుఁ డామాటను మఱపించి వైచి "అక్కా ! నీవు మునుపటివలె నన్నుఁ బ్రేమించుట లేదేమి ?" అనియెను.

శోభ—సోదరా! దేనినిబట్టి నీ వట్లనుమానించుచున్నావు ?

సగ—నీవు మునుపటివలెఁ బూలదండలఁ గట్టి నాకియక నీగోపాలమూర్తి నలంకరించుకొనుచున్నావు. ఒంటిగాఁ గూర్చుండి యామూర్తినే పూవులతోఁ బూజించుకొనుచున్నావు. నీకిప్పు డాగోపాలమూర్తియందే యెక్కువప్రేమ !

శోభ—నేనీగోపాలమూర్తిని నీకంటె నధికముగాఁ బ్రేమించుట లేదు. నీవలె నీగోపాలమూర్తియింకను నావాఁడు గాకపోవుటచేతనే నిత్యమును నే నీతనిఁ బూజించుచుంటిని. ఆడుచుఁ బాడుచు నీమూర్తి నారాధించుకొలఁది నీతఁడునీతోఁ గలసి యాడుచుఁ బాడుచు నిన్నాదరింపఁగలఁడు"అని దేవర్షి యుపదేశించియున్నాఁడు. కాని యట్టిశుభదినమింకను లభింపలేదు. అప్పటినుండియు నీవు నామకీర్తనమునం దెట్లు నిమగ్నుఁడవై యుంటివో నేను నట్లే యీగోపాలమూర్తిపూజయందు లగ్నహృదయనై యున్నాను.

విమ—అమ్మా ! నీమాటల కర్థము లేదు. సగరుఁడు కార్యదీక్షితుఁడై యున్నాఁడు. నీవు నిరర్థకముగా శ్రమపడుచున్నావు. మగవానికి నాఁడుదానికిని గలభేద మిదియే. ఇఁక రండు ! లోనికిఁ బోదము.

---

## పండ్రెండవ ప్రకరణము.

సుమతి భయావేగముచేఁ దూలుచు సకలాంగకములు జెమర్చి కంపించిపోవుచుండ విమతిగదిలోనికివచ్చి గద్గద కంఠస్వరముతో "అక్కా! అక్కా! ఇఁక నేమున్నది! అతి విషమంబగుమహావిపత్తు తటస్థించినది. దుర్మాత్ముఁడగుమన మంత్రియే శత్రువులలోఁ గలసి మనకుఁ బ్రతికూలముగా యుద్ధము చేయుచున్నాఁడఁట! సోదరీ! మనకిఁక గత్యంతర మేమున్నది? ఈవిపత్సముద్రమును దరించుట కుపాయ మేమున్నది?" అని యిఁక నోటమాట రాక యూరకనిట్టూర్పులు విడువనారంభించెను.

విమతి యెంతమాత్రమునుజలింపక ధీరకంఠస్వరముతో "సుమతీ! అంతభయపడియెద వేల? శత్రువులు తమ యిచ్చవచ్చినట్లు చేయుదురుగాక! కొలఁదికాలములోనే మన సేనలు వారిని నలుదెసలకుఁ బలాయితులం గావింపఁగలవు. నదీతరంగము లెన్ని వచ్చిపడినను బర్వతమును జలింపఁజేయఁ గలవా? ప్రస్తుతము మనకుఁ బ్రతికూలముగా మహారణము జరుగుచుండుఁగాక! క్షత్రియవీరనారీమణులైనమనమిట్లుభయ పడవలసినదా? చతుస్సముద్రముద్రిత మగుధరావలయమున కంతకు నేకచ్ఛత్రాధిపతి యగు మనమహారాజు నెట్టికపటశ



త్రముచేనైనను దుర్బలులగు సామాన్యశత్రువు లేమి చేయఁ గలరు?

సుమ—అక్కా! శత్రువు లితరులైనచో నంతభయమే లేదు. మనసంగతు లన్నియుఁ దెలిసిన మనవారే శత్రువులతోఁ గలియుటచే నాకుఁ జాల భయమగుచున్నది. రాజ్యలాభలోభముచే మనమంత్రియే యిట్టి విషమసంఘటనము గావించుచుండెనఁట! అందుచేతనే యింకముందు మనగతి యేమగునో యని నామనసు తల్లడిల్లిపోవుచున్నది.

విమ — సోదరీ! నామాట విని యించుక మనసుకుదురుపఱుచుకొనుము. తుచ్ఛసంఘటనములఁ దలంచుకొని, వట్టి యనుమానములఁ బెట్టుకొని విపత్కల్పనము గావించుకొనుచు నూరక గుండెలు చెదరఁగొట్టుకొనకుము. అనలజ్వాలలుపుండినంత సేపు మండనిమ్ము. మన మించుక సేపు చూచుచున్నచో నవి తమయంతనే చల్లారిపోఁగలవు.

శోభన యామాట కడ్డము వచ్చి "అమ్మా! అట్లు గాదు. మన కేదియో విపత్తు గలుగనై యున్నదని నేను నీకి దివఱకే చెప్పితినిగాదా? నామాట త్రోసివైచితివి. ఇప్పుడు నిదర్శన మగపడుచున్నదా?" అనియెను.

విమతి యామె నదలించుచు "బుద్ధిహీనురాలా! అమంగళవాక్యము లాడకుము. మన కేమి భయము!" అనియెను.

సుమ—అక్కా! నామాట నూరకత్రోసివైవకుము.

ఆయుద్ధములో మనమంత్రియే సర్వసేనాధిపతి యగుమన ప్రసే నుని జంపించుటకై సేనలతోఁ బ్రతివిందునిఁ బంపినాఁడఁట. ప్రసేనుఁడు తుదకుఁ జావుతప్పించుకొని కొలఁదిసైన్యముతోఁ బాఱిపోవుచు సర్వవృత్తాంతమును దెలుపుటకై మహారాజు నొద్దకు నొకసైనికునిఁ బంపించినాఁడు. మహారా జాతనితో నింకను మాటాడుచున్నారు. నే నామాట విని భయముచే నిచ్చటికిఁ బరుగెత్తుకొని వచ్చితిని.

విమ—అంతపని జరిగినదా ? ఇది యంతయుఁ గపట తంత్రమువలె నున్నది. ఏమని నిశ్చయించుటకు నవకాశము లేకున్నది. ఏమైనను మన మేమి చేయఁగలము ? ఇఁకఁ గొలఁది సేపటిలోనే మహారాజువలన మన కెల్లసంగతులును దెలియఁ గలవు. మహారాజు చెంతనుండఁగా మన కేమిభయము?

విమతి యిట్లు చెప్పుచుండగా సగరుఁడు తల్లిం గాంచి "ఇంతటియనర్థమునకుఁ గారణమేమి?" అని ప్రశ్నించెను.

సుమ—కుమారా! ఏమని చెప్పుదును ? ధనలోభము చేతను, పాపప్రకోపముచేతను నిట్టిదుస్సంఘటనమైనది. ధనాఢ్యులదుఃఖజీవితముకంటె దరిద్రజీవితమే శాంతిసుఖదాయకమైనది తండ్రీ!

సగ—అమ్మా! అట్లయినచో నవివేకులగు మానవులైశ్వర్యమహిమచే నశాంతికి దాసులైపోవుచుందురా? ఆశామోహావివశులగువారి కైహికాముష్మికవిచారమే యుండదు.



గాఁబోలును ! అమ్మా ! కేవలదరిద్రులగువారి కీగొడవ లేవియు నుండవుగదా ! ఒకవేళ నిప్పుడు మనయదృష్టము తిరిగిపోయి రాజ్యవినాశము గలిగినచో నిఁక ముందు మన మందఱమును సుఖముగా నుందుమా ?

అనుటయు సుమతి దుఃఖాతిరేకముచే నేమియు మాటాడఁజాలకపోయెను. అప్పుడు శోభన గద్గదస్వరముతో "తమ్ముఁడూ ! నీవింకను జిన్నవాఁడవు. నీవావిషయమై యాలోచింప వలదు. మనకట్టియోగమే యున్నచో నెవ్వరు తప్పింపఁగలరు? సుఖసమయమందైనను, గష్టసమయమందైనను మనము పక్షిశాబకములవలెఁ దల్లితండ్రులచేఁ బోషింపఁబడఁదగినవారమే. అట్టిరాజ్యభంగయోగమే తటస్థించినచో మనము వనవాసము చేయవలసి వచ్చును. కందమూలఫలాశనులమై కాలక్షేపము చేయవలయును. తమ్ముఁడూ! అప్పుడచ్చట లభించినవానిలోఁ బ్రియవస్తువుల నందఱకును బ్రాణప్రియుఁడవగు నీకు ముందుగఁ బెట్టి తరువాతమే మనుభవింపవలసియుండును. తెలిసినదా? ఈకష్టమునకును,ఆకష్టమునకును, యీసుఖమునకును, ఆసుఖమునకుఁ గలభేద మిదియే—కాని సోదరా ! జీవితమే సుఖదుఃఖమయమైనది !" అనియెను.

ఆమాట విని విమతి కోపముతో "పిచ్చిదానా ! ఎన్నిసారులు చెప్పినను నీకు బుద్ధి లేదు. పెద్దవారిగొడవలు నీకెందులకు ? పిట్ట కొంచెము, కూఁత ఘనము నన్నట్లున్నది నీసంగతి. చాలుఁజాలు నీపాటికి నోరు మూయుము!" అనియెను.

శోభ—కాదమ్మా! మనసగరకుమారుని మొగము వంకఁ జూడుము! కష్టవార్త నాలకించినంతనే వడగాడ్పుచే వసంతకుసుమమువలె నెట్లు వాఁడిపోయినదో?

సుమ—అక్కా! మనశోభనమధురభాషణము లాపత్సమయమునఁగూడ నానందమును గల్పించుచున్నవమ్మా?

అని పలుకుచు సుమతి కుమారు నక్కునఁ జేర్చుకొని "బాబూ! పసిబాలుఁడ వగునీవు భవిష్యదాలోచనములు మనసునకుఁ దెచ్చుకొని కలఁగిపోవకుము. తుచ్ఛమగు నైశ్వర్యముతో నెంతమాత్రమును నుపయోగము లేదు. నీవే నావజ్రాలమూటవు. తండ్రీ! నిన్ను నావక్షమునం జేర్చుకొని పక్షివలె నాహృదయరక్తముతో నిన్నుఁ బెంచుకొనుచు సుఖముగాఁగాలక్షేపము చేయుదును. తండ్రీ! నీవెంతమాత్రమును విచారింపవలదు" అని కన్నులనీరు వెట్టుకొనఁదొడంగెను.

అంతలో మహారాజు కాలాగ్నిరుద్రునివలె మండిపడుచు నొక్కపెట్టున నచ్చటికివచ్చి క్రోధకంపితకంఠస్వరముతో "ఓసిదురాత్మురాలా! పట్టమహిషివని నిన్నెంతయో బహూకరించుచున్నందులకుఁ బాపాత్మురాలవగునీవు తుదకుఁ బతిప్రాణహంతకురాల వైతివా? ఈకపటతంత్రమంతయు నీదేనా? దుష్టబుద్ధియగు మంత్రితో రహస్యాలోచనము చేసి యింతటియనర్థమును గల్పించితివా? నీవు పట్టమహిషి వని భావించి నామనఃప్రాణము లన్నియు నీకర్పించి యాదరించు



చుంటినే—పాపాత్మురాలా! ఇట్టినీవే యర్థలోభముచే నింతటివిశ్వాసఘాతుకురాల వైపోయినప్పు డీలోకమునందు నాకు విశ్వసింపఁదగినవా రింకెవ్వరున్నారు? కఠినహృదయురాలా! కాలభుజంగినీ! నీమనసునం దింతపాపచింత యున్నదా? నిన్నెంతయో ప్రేమించుచున్నందులకు నీవు నాకుఁ జేసినప్రత్యుపకార మిదియేనా? మూర్ఖురాలా! నాకీరూపపిశాచివగు నిన్ను నమ్మి నాసర్వస్వమును నీకర్పించితిని. ఛీ-ఛీ! కులకళంకినీ! ఎంతపని చేసితివే! ఇందు నీతప్పేమియును లేదు. నేనే మూర్ఖుఁడనై మృణాళభ్రాంతిచేఁ గాలభుజంగమును గళమున ధరించితిని. విమతీ! తుచ్ఛమతీ! నీకింతయాశ యున్నదఁటే! నన్ను వంచించి కపటోపాయముచే రాజ్యమంతయు నీకన్నకూఁతున కర్పింపఁదలఁచితివా? హా! అర్థలోభమా! నీవెంతకైనను దగుదువు. మానవుల మానవత్వమునే నశింపఁజేయఁగలనీచేఁ గావింపరానియకార్య మీలోకమునం దేమున్నది? విశ్వాసఘాతుకురాలా! నీవీరాజ్యమంతయు సుఖముగా ననుభవింపఁదలఁచితివా? నీకీదురాశ దుఃఖమునకే గలిగినది. నీపాపఫలము ననుభవింపుము! దుష్టురాలా! నీసుఖాశతోఁ గూడ నీపాపపుదేహ మిప్పుడే ఖండఖండములై కాకులకును కుక్కలకును నాహారమగుఁగాక" అని ధిక్కరించుచు నొరనుండి కరవాలమును చరాలునఁ దీసి మహారాజు విమతి కొప్పువట్టుకొని క్రోధోద్రేకముచే నఱకివైచుటకు నుద్యుక్తుఁ డయ్యెను.

అప్పుడు సుమతి ప్రాణేశ్వరునికృపాణమునకడ్డమువచ్చి యాతని చేయిపట్టుకొని మృదులస్వరముతో "నాథా! ఆకస్మికక్రోధోద్రేకముచే ననుచితకార్యము గావింపవలదు. అరాతిశిరఃఖండనపటిష్ఠంబగు నీయమోఘకృపాణము నబలపైనుపయోగించుట యవమానకరము గాదా! ప్రాణేశ్వరా! అబలయపరాధము క్షంతవ్యమైనది. క్షమానాథులకు క్షమయే సదమలాలంకారముగదా! స్వామీ! స్త్రీహత్య మహాపాతకము! ఇట్టియకార్యమును మీరుచేయవలదు. ఎవరిపాపమున వారే పోయెదరుగాక! రాజ్యపాలనమునందు మీరిదివఱకే విరక్తులై యున్నారు. మీరులేని యీరాజ్య మింక నెవ్వరికిఁ గావలయును? మనసగరకుమారుఁడు పేదవానివలె నైనను సుఖముగ నెందైన జీవించియున్నచో మన కదియే చాలును. మీకోపమును శాంతింపఁజేసికొనుఁడు. ఇఁక మాఱుమాటాడినచో నాతోడు." అని మహారాజును వెంటఁ బెట్టుకొని తనయంతఃపురమునకుఁ దీసికొనిపోయెను.

అప్పటి సగరశోభనమూర్తులను యథారూపముగఁ జిత్రించుటకుఁగాని, వారిహృదయభావములను వర్ణించుటకుఁ గాని యెట్టి చిత్రకారుఁడైనను, నెట్టికవియైనను బూనుకొన్నచో సంపూర్ణముగఁ గృతార్థుఁడు గాఁజాలఁడని మేము నిస్సంశయముగాఁ జెప్పఁగలము.

---

## పదుమూఁడవ ప్రకరణము.

ఇంతవఱకుఁ బాపము ఫలించినది. మంత్రిమ స్తంత్రము నెఱుఁగక హైహయులు పరమోత్సాహముతో దండెత్తి వచ్చిరి. ప్రసేనుఁడు ససైన్యముగఁబోయి వారిని మార్గమధ్యమునందే యెదిరించి వారితో మహారణము గావించుచుండెను. ఇంతలోఁ బ్రతివింధుఁడు కొంతసేనతోఁ బోయి వెనుకనుండి ప్రసేనుని సేనలపైఁబడి పోరాటమున కారంభించెను. అప్పుడు ప్రసేనుఁడు తనయనుమానము సత్యమయ్యెనని గ్రహించియు నట్టియాపత్సమయమున నించుకంతయు నధైర్యపడక ద్విగుణితోత్సాహముతో నావల శత్రుసేనలతోడను, నీవల నంతశ్శత్రుసేనలతోడను సత్యద్భుతముగా మహారణము గావింపఁ దొడంగెను. కాని యిదివఱకే హైహయులతోఁ బోరి యలసియున్న యాతనిసైనికుల కిరువంకలవారినిగూడ నెదిరించి పోరాటము సాగించుట దుర్భరముగా నుండెను.

అప్పుడు రణకళాకోవిదుఁడగు ప్రసేనుఁ డదివఱకేబలహీనమై నవసియున్న హైహయసైన్యము నాపుటకుఁ గొలఁది సేనను మోహరముగఁ జేర్చి నిలిపి తక్కిన యంతసైన్యముతోడను వెనుదిరిగి ప్రతివింధునిసేనపైఁ బడి చెల్లాచెదరు చేయఁదొడంగెను. ఆసమయమునందుఁ బ్రతివింధుఁ డెంతప్రో

త్సహించినను నాతని సైనికులు సర్వసేనాధిపతి యగు ప్రసేను
నిచేఁబడి విజృంభించుటకు వెనుకదీయుచునే యుండిరి. కాని
రణరంగమునందు రక్తపాతసందర్శనసమయమునందు రాజ
పుత్రవీరులకుఁ బౌరుషములు పుట్టక మానవు. వారందఱును
దాత్కాలికోత్సాహముచేఁ బ్రసేను నెదిరించి యాతనిశరాన
లజ్వాలలోఁబడి శలభములవలె మ్రగ్గిపోవుచుండిరి.

ప్రసేనుచే నిలుపఁబడిన కొలఁదిసైన్యము చావఁగా
మిగిలిన హైహాయసైన్యమును నిరవశేషముగఁ జేసివైచుచుం
డెను. అప్పు డాకస్మికముగా మంత్రి ప్రబలసేనాసహితుఁడై
వచ్చి హైహాయులనందఱను నిశ్శేషముగ నాశనముచేసి ప్రసే
నుని సేనాభాగమును జెదరఁగొట్టి వెనుకనుండి యతిఘోరముగ
మహారణమునకుఁ దలపడియెను. అప్పటికిఁ బ్రసేనుఁడు ప్రతి
విందు నొడిసిపట్టి "దురాత్మా! విశ్వాసఘాతుకా! స్వామి
ద్రోహీ! ఇఁక నెందుఁ బోఁగలవు! నీపాపఫలము ననుభవిం
పుము! పాపాత్మా! పగదీర్చుకొనఁ దలంచినచో నన్ను ద్వం
ద్వయుద్ధమున కాహ్వానింపఁగూడదా? దుర్బుద్ధియగుమంత్రి
దుస్తంత్రమునఁజిక్కి మహారాజకుటుంబమును మంటఁగలుపఁ
దలఁచితివా? కృతఘ్నా! సుక్షత్రియతేజోనిధివగు శూరశిఖా
మణి వగుదువని యాసించితినిగాని నీవిట్టి స్వామిద్రోహి
వగుదువని నేనొక్కప్పుడును భావింపలేదు. ఆత్మద్రోహి
వగుటకుఁ దగినశాస్తియగుచున్నది. ఇప్పుడైనను బశ్చాత్తా



పపడి పాపమును నివేదించి పరమేశ్వరుని బ్రార్థించికొనుము.
పశ్చాత్తాపముచేఁ బరిశుద్ధమగువఱకును నీపాపపుదేహమును
స్పృశించుటకు పరబలభంజకం బగునాభయదకృపాణము సం
శయించుచున్నది. త్వరపడుము! త్వరపడుము! దైవమును
బ్రార్థించుకొనుము!" అని ధిక్కరించుచు నాయుత్తమాంగ
మును ఖండింపఁబోవుచుండెను.

అది యంతయుం జూచి మహారణకోవిదుం డగుమంత్రి
చటాలున నొక వాఁడిబాణముచేఁ బ్రసేనుని కరవాలమును
ఖండించివైచెను. అందుచే నాకస్మికముగ ధైర్యోత్సాహ
ములు విజృంభించుటయుఁ బ్రతివిందుఁడు ప్రసేనునిపట్టు విడి
పించుకొని యాత్మసేనామధ్యమునకుఁ బాఱిపోయెను. అనంత
రము వెనుకనుండి మంత్రిసైన్యమును, ఎదుటనుండి ప్రతివిం
దుని సైన్యము నొక్కసారిగా విజృంభించి రణంబు గావించు
టయుఁ బ్రసేనుని సైన్యము చెల్లాచెదరైపోయెను. ఇఁక నుపా
యాంతరము లేక ప్రసేనుఁడు తనప్రాణములకొఱకుఁగాక మహా
రాజరక్షణముకొఱకు రణరంగమునుండి తప్పించుకొని పాఱి
పోయెను.

ప్రసేనుఁడు పోయినంతనే తక్కినసేనయంతయును బ్రతి
విందు ననుసరించి మంత్రికి వశమైపోయెను. ఈవిధముగా
మంత్రిపాపతంత్రమునకుఁ బరాజయము లేకుండఁబోయెను.
గర్భశత్రు లయ్యును నొకశత్రుపక్షమును విశ్వసించిన యవి

వేగముచే హైహయు లందఱును హతులైపోయిరి. రాజభక్తుఁడైనను ప్రసేనునిపగ దీర్చుకొనవలయునను స్వార్థపరత్వముచేఁ బ్రతివిందుఁడు ససైన్యముగ వశుఁడై పోయెను. ధనలోభముచేఁ గుటిలుఁడు సర్వతంత్రనిర్వహణమునకును సహకారి యయ్యెను. పాపమతి యగుపట్టమహిషి విమతి యసూయాపరవశయై యాత్మద్రోహమును బాటింపక యఖిలానర్థములకు నాదికారణ మయ్యెను. ఇన్నియనుకూలసందర్భములవలన దురాశాపరుఁడగు మంత్రిపాపతంత్రము ఫలించినది.

ఆమహోత్సాహముతో మంత్రి సపుత్త్రదారముగా సార్వభౌముని సంహరించి నిష్కంటకముగా గోసలరాజ్యమును బరిపాలింపవలయు నని నిశ్చయించికొని యతిత్వరితముగా సేనాసహితుఁడై రాజధానికిఁ దిరిగి వచ్చుచుండెను. కాని మార్గమధ్యమునందే మహారాజు సగరకుమారునితోడను సుమతితోడను గలసి యెచ్చటికో పలాయితుఁడైపోయె ననువార్త తెలియవచ్చెను. అతనియుత్సాహమంతయు నొక్కసారిగా నశించిపోయెను.

మతిమంతుఁ డగుమంత్రికిఁ దాత్కాలికముగా మహాభాగ్యయోగము పట్టినది. కాని యది పాపలబ్ధమగుటచేఁ జిరస్థాయి యగుటకుఁ దగినయవకాశము లభించినదిగాదు. మహారాజు సపుత్త్రకుఁడై తప్పించుకొనిపోవుటయు నాతనికిఁ బ్రక్క-



లోని బల్లెపుఁబోటువలె బాధించుచునే యుండెను. అందుచేతనే "ఇంతవఱకుఁ బాపము ఫలించినది" అని చెప్పవలసి వచ్చినది.

---

## పదునాల్గవ ప్రకరణము.

---

విజయభేరీవిరావములు దెసలఁ బ్రతిధ్వనించుచుండఁ జతురంగబలపదసంఘట్టనమునఁ బుడమి కంపించిపోవుచుండ విజయోత్సాహముతో మంత్రి రాజధానికిఁ జేరుకొనియెను. ఆకోలాహలమంతయు నాలకించి శోభన భయభ్రాంతయై తల్లినిఁ గౌఁగిలించుకొని గోలుగోలున నేడువ నారంభించెను. విమతి యామె నొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని "అమ్మా! ఏమియుఁ దోఁపనీయకుండ నూరక యట్లేడ్చెద వేమి?" అనియెను.

శోభ—అమ్మా! ఇంకేమున్నది? మనలను బాధించి వైచుటకై మహాపాపాత్ముఁ డగు మంత్రి వచ్చుచున్నాఁడు. నాయనగారు పిన్నినిఁ దమ్ముని వెంటఁబెట్టుకొని యెట్లో తప్పించుకొని పోయినారు. మనముకూడ వారితోఁ బోఁజాలమైతిమి. శత్రువులు చుట్టుముట్టుచున్నారు. ఇంకను నాలస్యము

చేసినచోఁ బ్రమాదము గాదా? నాయనగారి కేమోగాని నీపైఁ గోపము గలిగినది. అందుచేతనే వారు నన్నుఁగూడ నిందు విడిచిపోయినారు.

విమ—మీనాయనగారికి నామీఁదను నీమీఁదను గూడఁ గోపము మీతమ్ముఁడు పుట్టినప్పుడే పుట్టినది.

శోభ—అట్లనియెద వేమమ్మా! నాయనగారికి నామీఁదఁ గోపమా?

విమ—నీయెడల లేకున్నను నీతమ్మునియెడలఁ బక్షపాతమున్నది.

శోభ—అమ్మా! అట్టిపాపపుమాట లెందుల కాడెదవు? నీకు నాయొక్క దాసియందే పక్షపాత మున్నదా?

విమ—ఎవరిబిడ్డలయందు వారి కభిమాన ముండదా?

శోభ—నాయనగారికి మేమిద్దఱమును బిడ్డలమే గాదా?

విమ—అయిన నేమి? సగరుఁడు మగవాఁడు. నీవాఁడుదానవు. అందుచేతనే పెద్దదానవు నీవున్నను మీతండ్రిమీతమ్మునికే రాజ్య మీయఁదలఁచినాఁడు. దానికిఁ దగినశాస్తి దైవము చేసినాఁడు.

శోభ—అమ్మా! కష్టకాలమున నీకఠినభాషణము లెందులకు? ప్రస్తుతము శత్రుహస్తములనుండి మానప్రాణరక్షణమున కుపాయము చూచుకొన నక్కఱలేదా? మహారాజు మహావిపత్సమయమున మతి చెదరి మనమాటయే మఱచిపో



యినాఁడు. నీమూలమున నాకుఁగూడ నాయనతో నెడఁబాటు గలిగినది. అమ్మా! ఇఁక మనకు దిక్కేమున్నది? ఇఁకఁ బరమపాపాత్ముఁ డగుమంత్రి వచ్చి మిగిలియున్నమనలను బంధింపక మానఁడు. ఆదురాత్మునిబారిఁ బడినచో నిఁకమన మానప్రాణములు దక్కవు. త్వరపడుము. ఎటులైనఁ దప్పించుకొని పాఱిపోయి యెప్పటికైనను దండ్రిగారిని గలిసికొందము.

విమ—వెఱ్ఱిదానా! అంతభయ మెందులకే? మన మంత్రి మనకు శత్రువని నీతో నెవ్వరు చెప్పినారు? అతినిగూఢ మగునీవిషయరహస్యము నీ కెట్లు తెలియును? అమ్మా! ఇంచుక మనసు కుదురు పఱుచుకొని నేను జెప్పినమాటవినుము. ఊఱక దిగులుపడకుము. మనకీయయోధ్యానగరమునందిఁక శత్రువు లెవ్వరును లేరు. మహారాజును బుత్రసహితముగాఁ బ్రతారితునిం గావించి రాజ్యము నీవశము గావించుటకే నే నీతంత్రమును బన్నితిని. నామాటనుబట్టియే మతిమంతుఁ డగుమంత్రి యీప్రయత్నమంతయును గావించినాఁడు. మన యదృష్టము ఫలించినది. ఇఁక మనమిరువురము నీయయోధ్యారాజ్యమును నిష్కంటకముగా ననుభవింపవచ్చును. ఇట్టి సంతోషసమయమున నింతగా విచారించు టెందులకు?

శోభ—ఛీ-ఛీ! అమ్మా! ఎంతపని చేసితివే! రాజ్యలోభముచే నెంతటినృశంసురాలవైపోయితివే! దురాశాపర

వశత్వముచే వెనుకముం దరయక సార్వభౌముఁ డగుజనకుని బిచ్చగానిగాఁ జేసివైచితివి. నోరెఱుఁగనిపసిపాప యగుసగర కుమారునిఁ దల్లితోఁగూడఁ గడలేనిదుఃఖసాగరమున ముంచివైచితివి. అయ్యో! తల్లీ! నీవెంతకఠినురాలవె! ఇఁక నేనొక నిమిషమైనను నీచెంత నిలువఁజాలను. అరణ్యములపాలై పోయి తండ్రిగారిని సగరకుమారునిఁ గలిసికొని వారిచెంత నే సుఖముగా నుండెదను.

విమ—బుద్ధిహీనురాలా! నీకు మంచిచెడ్డ లేమియును దెలియుట లేదు. సగరుఁ డెచ్చట నున్న నేమి? ఏమైన నేమి? నీకాబాధ యెందులకు? ఇంతటినుంచి నీవాతనిమాట మఱచిపొమ్ము! నీకు గర్భశత్రుఁ డగునాతనిజోలి నీ కెందులకు?

శోభ—ఓసిపాషాణహృదయా! నీనోటినుండి యిట్టి మాటలు వెడలవచ్చునఁటే! నాప్రాణము లుండఁగా నేను నాసగరకుమారుని చిన్నారిముద్దుమొగమును మఱచిపోఁగలనఁటే! హా! పరమేశ్వరా! ఇంతటి కఠినురాలిగర్భమునుండి నన్నేలపుట్టించితివి? అయ్యో! ఘాతుకజంతుస్వరూపిణీ! జననీ! ఎంతదారుణకృత్యమును గావించితివే! నీహృదయమున జాలి యనుమాటయే లేదఁటే! జగద్రంజకుఁ డగుమహారాజ కుమారుని, జగన్మోహనాకారుని, ఆగర్భశ్రీమంతుని, ఆజన్మసుఖభోగిని, దుఃఖదేవతకుఁ గబళముగాఁ జేసివైచుటకు నీగుండె లెట్లు తాళినవే! లోకరంజకుఁ డగుసగరకుమారుఁడు



పుట్టినదినముననే నీవు మరణించినచో నిష్కళంకమగునీసూర్యవంశమున కిట్టిశాశ్వతకళంకము గలుగకపోవునుగదే! అయ్యో! బిడ్డలనే కబళించివైచు తల్లులనుగూర్చి నే నిదివఱ కెన్నఁడును విననైన లేదే! అకటా! ఎంతపాపాత్మురాలవే తల్లీ!

విమ—ఇఁకఁ జాలు నోరు మూయుము! ఒక్కటే మాట! నేను చెప్పినట్లు వినకున్నచో నిఁక నెన్నఁడును నీ మొగము చూచుదాననుగాను. తెలిసినదా?

శోభ—ఇంకను నీకు నామొగముచూపించుటయేనా? ఇంతటి దురాత్మురాలవగు నీచెంత నే నొకనిమిషమైనను నిలువఁజాలను. విడిచివైచిన మందిరమునందు విషసర్పముంబోలి నీవొక్కతెవే యీరాజాంతఃపురమునఁ బడియుండుము. నేను పోయి నాతండ్రిని సోదరుని గలిసికొని వనంబుననైన సుఖంబుగ నుండెదను.

విమ—వెఱ్ఱిపిల్లా! చిన్నతనపుబుద్ధిచేఁ దొందరపడకుము. తల్లులెప్పుడును బిడ్డలక్షేమముకొఱకే ప్రయత్నించుచుందురని నమ్ముము. కోపదుఃఖావేగముచే మనసు చెదరఁగొట్టుకొనకుము.

శోభ—వలదు! వలదు! పితృశూన్యమగు నీమందిరమునం దిఁక నొకక్షణమైనను నిలువఁజాలను. నన్ను విడిచిపెట్టుము. నే నరణ్యముల పాలైపోయెదను.

విమ—కుమారీ! అభీష్టసిద్ధిసమయంబున నవాంతరకష్టములం గల్పించుకొని సుఖజీవితమును శాశ్వతదుఃఖమయముగాఁ జేసికొనకుము. తల్లీ! నామాట వినుము.

## పదునేనవ ప్రకరణము.

ఇట్లు విమలియును శోభనయుఁ బరస్పరవిరుద్ధముగా సంభాషించుకొనుచుండఁగా సంపూర్ణవిజయానందము నగుమొగమునఁ దాండవించుచుండఁగా మంత్రి కుటిలసహితుఁడై యంతఃపురమునఁ బ్రవేశించుటయు శోభన భయభ్రాంతయై చటాలునఁదల్లివెనుకకుఁ బోయి దాఁగికొనియెను. అప్పుడు విమలి మందహాసము సేయుచు "మంత్రివరా! అభిమతార్థసిద్ధి యైనదిగదా!" అనియెను.

మం—కాకేమి! ఈజగంబున బుద్ధిబలమునకసాధ్యమేమున్నది? కాని—ఇంతకును మహారాజేమైనాఁడు?

విమ—అతఁడు సుమతిసహితుఁడై సపుత్త్రీముగా రాజ్యమును ద్యజించి పాఱిపోయినాఁడు.

మం—ఘు చిది. ఇంకేమికావలయును. నాప్రయత్నముఫలించినది. నేనిఁక నిశ్చింతుఁడనై నిర్భయముగా నుండవచ్చును.



విమ—మంత్రీ! నీవు ధన్యుఁడవు. అపారమగునీబుద్ధిబలము ధన్యమైనది. అతిస్వల్పకాలములో నభేద్యతంత్రకౌశలముచేఁ బరోపకారపరతంత్రుఁడవై యసాధ్యకార్యము నసాధించితివి. ఈజన్మమునందు నేను నీఋణము దీర్చికొనఁజాలను—మంత్రీ! ఇఁక నాలస్య మెందులకు? నేటినుండి పట్టమహిషియే సర్వరాజ్యేశ్వరి యనియు, మంత్రి తత్ప్రతినిధియనియు, ప్రతివింధుఁడు సర్వసేనానాయకుఁడనియు రాజధానియందంతటను జాటింపఁబంపుము. త్వరపడుము. మనపక్షమునఁ బనిచేసినవారందఱికి నచిరకాలములోనే బహుమతులొసంగవలయును గదా! వారినామములను నాకెఱిఁగింపుము. ఈనగరమునం దింకను రాజపక్షమువా రెవ్వరైనను న్నచో నందఱను వెడలఁ గొట్టింపుము. రాజ్యపాలనమునకుఁ దగినకట్టుదిట్టములను గావింపుము.

అని యిట్లు విమలి మహోత్సాహముతోఁ బలుకుటయు మంత్రి తనలో "ఔరా! ఈమెనురాలం జూచిననాకు నవ్వువచ్చుచున్నది. అయోధ్యారాజ్య మశ్రమముగా లభించెనుగదా యని పొంగిపోవుచున్నది. ఇఁక వృథావాగ్వ్యయ మెందులకు? నాయుద్దేశ మీమెకుస్పష్టముగా నిప్పుడే చెప్పివైచెదను." అని నిశ్చయించుకొని "రా.శీ! నీ వాఁడుదానవు. ఈగొడవ లన్నియు నీకెందులకు? చేయఁదగినపనులన్నియు నేనే చేయుదును. పారలౌకికము లెవ్వరికేమి

వలయునో నేనే యిచ్చెదను." అనియెను.

విమ—ఔను నిజమే—అన్నిపనులను నీవే చేయవలయును. అయినను రాజేశ్వరినగు నాకుఁగూడ నించుక తెలుపుట యుచితముగాదా?

మం—ఈరాజ్యమునకు నీవే యధీశ్వరి వని యెవ్వరన్నారు? నిన్ను రాణిగా నెవ్వరంగీకరించినారు? ప్రాణములపై నాశవదలుకొని విద్రోహమహాసాగరగర్భమున మునిఁగి మునిఁగి యెంతయో శ్రమపడి యెట్టకేల కీమహారాజ్యరత్నమును సంపాదించితిని. ఈశ్రమయంతయుఁ గేవలము నీకొఱకేనా?

విమతి యాకస్మికముగ హతాశురాలైపోయెను. ఆమె యుత్సాహమంతయు నడుగంటిపోయెను. తుదకామె హీనకంపితస్వరముతో "మంత్రీ! పట్టమహిషి నగునన్ను నీవిట్లగౌరవింపవచ్చునా? నీవు నామాటలను విశ్వసించి సాహసించి కార్యదీక్ష వహించి నాకు మహోపకారముం గావించితివి. నీకుఁ దగినప్రత్యుపకారము గావించుటకు నేను బాధ్యురాలనై యున్నాను. ఈవికటభాషణము లెందులకు? నీయభీష్ట మేమో తెలుపఁగూడదా?" అనియెను.

మం—రాణీ! నేనొక్కమాట చెప్పెదను వినుము. మనయుభయులయభీష్టమును సంపూర్ణముగా సిద్ధించుటకొక్కటే యుపాయమున్నది. నీకోరిక యంతయును నీతనయ



కీరాజ్యము లభింపవలయు ననియే గదా! నేను ప్రాణములకైనను తెగించి యింతటి ఘనప్రయత్నము గావించుటయును రాజ్యముఁగొఱకే—కావున నీవిప్పుడు నీతనయను నాకుఁ బెండ్లిచేసినచో నిరువురికోరికలును ఫలింపఁగలవు. అప్పుడు నేను మహారాజ నగుదును. నీతనయ మహారాజ్ఞి కాఁగలదు. అభిమతార్థము ననుభవింపఁదలంచినచో నీ వీశుభకార్యమున కంగీకరింపుము.

విమతి కాక్షణమునందే ప్రాణవాయువులు నిలువున నెగసిపోయినట్లుండెను. ఆపలుకులువిసపుములుకులవలెనామె హృదయమున నాఁటికొనియసహ్య వేదననుగల్పించుచుండెను. కాదామఱి—ఆమె తనపాపవృక్షమును దనచేతులతోనే పండించుకొన్నది. దురాశావేశముచే సహజకోమలం బగునాసతీహృదయము వజ్రకఠినమైపోయినది. స్వయంకృతాపరాధముచేతనే యామెశాశ్వతసుఖము సంతాపజ్వాలగా మాఱిపోయినది. ఆమెయాశాకుసుమము కాలకీటదంశితమైపోయినది. తుదకామెదుస్సహనిరాశాక్రోధావేశముచే నొడలెఱుంగక కంఠస్వరముతోఁగూడ సకలాంగకములునుగంపించిపోవుచుండ "మంత్రీ! మంత్రీ! నీకీయయోధ్యారాజ్యమును కరగతము చేసికొనవలయు నన్నంతటియుత్సాహ మెవ్వరియుపదేశమున లభించినది? నావాక్యము నూతగాఁ జేసికొనుటచేతనేగాదా కుంటిపాఁడవగునీవు కులగిరిశిఖరము నధిరోహిం

పుఁగలిగితివి? నీకింతయన్యాయమా? ఇంతకృతఘ్నతయా? నన్నిట్లేడ్పించి నీవుమాత్రము సుఖపడఁగలవా?" అనియెను.

మం—ఇరువురమును సమానముగ సుఖింపవలయుననియే యిట్టియుపాయము చెప్పితిని. ఇందు నాచేసినతప్పేమున్నది?

అనుటయు శోభన చటాలున లేచి ముందటికి వచ్చి "అమ్మా! నీతగనితప్పునకుఁ దగినశాస్తియైనది. ఇఁక మనకీ తుచ్ఛరాజ్యముతో నేమిపని. పదపద. అరణ్యములపాలై నాయనగారెటనుండిరో యచ్చటికే పోవుదము." అనియెను.

మంత్రి—ఎట్లుపోయెదరు? వ్యాఘ్రముఖముండి విడివడి పోవుటకు మీకు మార్గాంతరమేమున్నది? శోభనా! అట్లుపోయిమాత్రమేమిసుఖమనుభవించెదరు! నేనింతశ్రమపడి యింతసాహసించి, తెగించి సర్వప్రయత్నములచేతను సాధించి యీరాజ్యమును సంపాదించుట నిశ్చయముగా నామనోమోహిని వగునీకొఱకేసుమా! నీవిఁక మాఱుమాట చెప్పక నాయర్ధాంగలక్ష్మివై యీయయోధ్యారాజ్యభోగములను మహాసుఖమున ననుభవింపుము.

ఆమాట విన్నంతనే యవమతియయ్యు నభిమానవతి యగువిమతి క్రోధోద్రేకముచే మండిపడుచు "దురాత్మా! పశువా! క్రూరరాక్షసా! ధూర్తా! ఏమనుచున్నావు! నీకింతయాశ యున్నదఁటరా? మహారాజోచితమగు మణిమాలిక



మర్కటకంఠమున కలంకారమగునఁటరా? దుష్టబుద్ధీ! వంచకా? నీకింతకావరమా? సార్వభౌమకుమారి యగుశోభన పాదధూళి యించుక శిరంబున సోకినంతనే ధన్యుఁడనైతినని భావింపవలసిననీ వామెపాణిగ్రహణము నాసించుచుంటివా? మహాపాపీ! మంత్రీ! చండాలా! ఇంతటిదురాశావిష్టుఁడవగు నీకీజన్మమున సుఖముండు ననుకొంటివా? చేతులార మాశోభనను చండాలుఁడవగు నీకొప్పగింతు ననుకొంటివా? అయ్యో! ఇఁక నాకు గత్యంతరమేమున్నది! నేనేయగ్నిజ్వాలనురగుల్కొల్పితినో దానిలోనే నాప్రాణము లాహుతి కావలసివచ్చెను. నాపాపమునకుఁ బరిమితిలేదు. నాదుఃఖమున కంతములేదు. నాజీవితమున కింక నాధారములేదు. మంత్రీ! మంత్రీ! ఆఁడుబుద్ధిచే దూరమాలోచింపక తుదకిట్టి యాపద దెచ్చికొంటిని. అసూయాపరవశత్వముచే నాత్మేశ్వరునకు సర్వనాశనముఁగల్పించుకొంటిని. పశ్చాత్తాపదుఃఖముచే నాసర్వాంగకములును దహించుకొనిపోవుచున్నవి. మంత్రీ! మాయెడలఁ బూర్వవిశ్వాస ముంచి మాకులగౌరవమునైన నుద్ధరింపుము. ఇఁక నాకీరాజ్యముతోఁ బనిలేదు. ఈజీవితముతోనే పనిలేదు. ఈతుచ్ఛరాజ్యమును నీయిచ్చవచ్చినట్లు చేసికొనుము. దయయుంచి నన్నును నాశోభనను విడిచిపెట్టుము!" అని గోలుగోలున నేడువనారంభించెను.

కఠినహృదయుఁ డగుమంత్రి యామాటలను వినిపించు

కొనకయే కుటిలునింగాంచి "ఈరాకాసి నవ్వలికిఁ దీసికొని పోయి కారాగారమునం దుంపుము!" అని యాజ్ఞాపించుటయుఁ గుటిలుఁ డామెను బలవంతముగఁ దీసికొనిపోయెను. అప్పుడు శోభన యేడ్చుచు "పాపాత్మా! పట్టమహిషినే యీవిధముగాఁ బరిభవించుటా? దురాత్మా! నీహృదయము పాషాణమా యేమి? మంత్రీ! నాకు రాజ్యము వలదు. మా యమ్మను నన్నును విడిచిపెట్టుము. నీపాదములపైఁ బడి ప్రార్థించుచున్నాను. మాకులగౌరవమును గాపాడుము!" అని వేఁడుకొనియెను.

అప్పుడు మంత్రి దృఢస్వరముతో "నీవు వచ్చెదవా? రావా?" అని ప్రశ్నించెను.

శోభ—ఎక్కడకు?

మంత్రి—నీకేమియును భయములేదు. నావెంట రమ్ము. శోభనా? నామాట విన్నచో నీవు సుఖపడఁగలవు. బాగుగా నాలోచించుకొనుము. నీవింకను బసిపాపవు గాదుగద! నేను పట్టభద్రుఁడనై నావామాంకమున నిన్నుధరించెదను. నాహృదయపీఠమునందు నిన్నుంచి ప్రేమరసముచే నభిషేకించెదను. రమ్ము మాఱుమాట చెప్పక నాతో రమ్ము.

శోభ—ఛీ! ఛీ! దురాత్మా! ఎంతనీచుఁడవురా! నీకింతటిపాపబుద్ధి తగదు. నేను నిన్నేలినమహారాజకుమారిని గానా? నన్నిట్టిపాపపుమాటలచేఁ బరిభవించుచున్న నీకు శ్రేయముగాదు.



మంత్రి—శోభనా! నీముందుగతి బాగుగ నాలోచించుకొనుము. నీజీవితమంతయు దుఃఖమయముగా నేల చేసికొందువు?

శోభ—మంత్రీ! నాకొఱకు విచారింపవలదు. నా గోపాలమూర్తి యున్నంతవఱకు నాకెట్టిదుఃఖమును గలుగదు. నన్ను విడిచిపెట్టుము. వనవాసము చేసి నాగోపాలునిఁ బూజించుకొనుచు నానందముతోఁ గాలక్షేపము చేసికొందును.

మంత్రి—వేటకానిచేతఁబడినపిట్ట యెట్లు తప్పించుకొని పోఁగలదు? నన్ను నీపాలిటిగోపాలునిఁ జేసికొని సుఖింపుము. వచ్చెదవా? రావా? రాకున్నచో బలవంతముగఁ దీసికొనిపోయెదను.

శోభ—మంత్రీ! నీవు నన్నేమిచేయఁగలవు? ఈప్రాణములు పోవుటకైనను నేనుభయపడుదానను గాను. మంత్రీ! కాలవశమున దిక్కుమాలి దీనురాలినై నిన్నుఁ బ్రార్థించుచున్నాను. నేను మహారాజకుమారిని. నన్నవమానింపవలదు. రక్షింపుము. అబలను. ఆర్తనై యభయదానమును గోరుకొనుచున్నాను. రక్షింపుము! రక్షింపుము!

అని యనేకవిధములఁ బ్రార్థించుచుండఁగనే యదయహృదయుఁ డగుమంత్రి బలవంతముగ నామెను బట్టి దీసికొనిపోయెను.

---

## పదునాఱవప్రకరణము.

మంత్రి కతిసులభముగా నయోధ్యారాజ్యము హస్తంగతమయ్యెను. ఆతఁడు సర్వరాజ్యేశ్వరుఁ డయ్యెను రాజకుమారి తనకాత్మేశ్వరి యగుట కంగీకరింపకుండుటచే సంపూర్ణముగ సంతుష్టి నందఁజాలకుండెను. విమతి యెంతపాపాత్మురాలైనను కులాభిమానముచేఁ దనకుమారికను మంత్రికిచ్చుట కంగీకరింపదయ్యెను. గోపాలమూర్తితోడనే లోకమై యున్న శోభన నీచాతినీచుఁడగుమంత్రిప్రార్థనమును లక్ష్యము సేయక యాతనితుచ్ఛమోహావిషవల్లికపై నగ్నివర్షముఁగురియింపఁదొడంగెను. ఆకారణముచే మంత్రి విమతిని శోభననుగూడఁ గారాగారమున బంధించి యుంచెను. సుకుమారిణులగువా రెప్పటికైనఁ గష్టములను సహింపఁజాలక తాను చెప్పునట్లు చేయుదు రని యాతఁ డాశపడుచుండెను.

ఇట్టిదారుణకృత్యము లన్నియును ప్రజలహృదయములయం దశాంతిజ్వాలలను దరికొలుపుచున్నను సర్వాధికారి యగుమంత్రి సార్వభౌముఁడై తననిరంకుశపరిపాలనమును రాజ్యమందంతటను సాగించుచునేయుండెను. కాని యాతనికి సర్వదా శోభనవిషయమునం గలుగుచుండుమోహవికారముతోఁ గూడ భావివిచారము గూడ దుస్సహముగాఁ దోఁచు



చుండెను. మహారాజు పుత్త్రసహితముగఁ దప్పించుకొనిపోయెనుగదా! అతఁ డెందైన నున్నంతవఱకు మంత్రికి శాంతి యెక్కడిది? ప్రజ లెప్పటికైన నాతని రాజుగాఁ జేయకమానరు. అశత్రుశేషముగూడ లేకుండఁ జేసికొనవలయునని మంత్రి యనేకవిధములఁ బ్రయత్నములు చేయుచుండెను.

మహారాజు దారపుత్రసహితుఁడై హిమాలయపర్వతప్రాంతారణ్యమునం దజ్ఞాతవాసముసేయుచుఁ గాలక్షేపము సేయుచున్నట్లాతనికిఁ జారులవలనఁ దెలియవచ్చెను. ఆసంగతి తెలిసినంతనే యాతఁడు కుటిలునిం బిలిపించి యాతనికెల్లవిషయములను దెలిపి "వయస్యా! ఎట్లో యతికష్టముల కోర్చి మహారాజ్యమును సంపాదించుకొంటిమి. ఇఁక దీనిని సుస్థిరముగా నిలుపుకొనవలయును" అనియెను.

కుటి—ఔను. నిజమే. నా రెందున్నను శోధించి యెట్లయినను గనిపెట్టి వధించి మనయదృష్టపథమును నిష్కంటకముగాఁ జేసికొనవలయును.

మం—ఈసంగతి మనప్రతివిందునితోఁగూడ నాలోచింపవలయును. ఆతనికి వార్త నంపితిని.

అనుచుండఁగాఁ బ్రతివిందుఁ డచటికివచ్చి, "అయ్యా! నన్నుఁ బిలిపించినపని యేమి?" అని ప్రశ్నించెను. అప్పు డాతనికంఠస్వరము విలక్షణముగా నుండెను. ఆతనిమొగము వివర్ణమై యుండెను. ఆతనిగుండె లతివేగముగఁ జలించుచుండుటచే

సర్వాంగకములయందునురక్తనాళములుపొంగిపోవుచుండెను.

మంత్రి యాతనిం గాంచి "ప్రతివిందా! ఇంకొక చిన్నపనియున్నది. తలంచుకొన్నచో నొకనిమిషములోఁ జేయవచ్చును. అందుకొఱకే నిన్నుఁ బిలిపించితిని." అనియెను.

ప్రతి—ఇంకను నొకపని మిగిలిపోయినదా? అది యేమిపని?

మం—మనము కేవలము బుద్ధిబలముచేతనే రాజ్యము సంపాదించితిమి. దానిని నిష్కంటకముగఁ జేసికొనవలదా?

ప్రతి—ఇంకను నేమిచేయవలయును?

మం—మనకు రాజ్యము లభించినది గాని రా జేమయ్యెనో తెలియలేదుగాదా?

ప్రతి—ఏమగుట కేమున్నది? గతిలేక యరణ్యములపాలై పోయినాఁడు.

మం—అందుచేతనే సంశయము. సేనాపతీ! ఆతఁడున్నంతవఱకు మనము నిశ్చింతగా నుండుట కవకాశము లేదు. సపుత్త్రముగ నాతనిపేరు లేకుండఁ జేయవలయును.

ప్రతి—ఛీ! ఛీ! మంత్రీ! ఇంకను నీకోరిక తీరలేదా? మహారాజు వనంబున నిస్సహాయుఁడై యున్నను నీకాతనిభయము వదలలేదా?

మంత్రి—శత్రుశేషమున్నంతవఱకు నిర్భయముగా నుండుటయెట్లు?

ప్రతి—మంత్రి! నీకట్టిపాపపుఁదలంపు దగదు. ఇంత



టిఘోరకృత్యము నెవ్వరు చేయఁగలరు?

మం—శత్రునిర్మథనవిషయంబున ధర్మాధర్మవిచారముతోఁ బ్రసక్తియేమున్నది? ప్రతివిందా! వట్టిసంశయములఁ బెట్టుకొనక యీచిన్నకార్యమునుగూడ సాధించియయోధ్యారాజ్యమును నిష్కంటకముగాఁ జేయుము.

ప్రతి—మంత్రీ ఇఁక నాకేమియును జెప్పకుము. నేను మహాపాపాత్ముఁడను. స్వార్థపరుఁడనై స్వామిద్రోహము చేసితిని. ఇంకను నన్ను ఘోరపాపకూపమునఁ బడఁద్రోయకుము. నేనెవ్వరియన్నముతో నింతకాలము జీవించితినో, పూజ్యభావముతో నెవ్వరిని భక్తికుసుమములతోఁ బూజించితినో, ఎవ్వరిప్రేమగౌరవమును గాంచినప్పుడు ధన్యుఁడనైతి నని యానందించితినో, యట్టిరాజకుటుంబమునకు ద్రోహినై మహాపచారము గావించితిని. ఇంకను నాచే నాతనిఁగూడఁ జంపింపఁదలఁచితివా? మానవజన్మమెత్తిన నే నిదివఱకే రాక్షసుఁడనై పోయితిని. ఇంతకంటెను నన్నేమి చేయఁదలంచితివి?

మంత్రి—సేనాపతీ! బుద్ధిమంతుఁ డగువాఁడు భవిష్యమును భావించుకొనుచుఁ గ్రియావంతుఁడు గావలయునుగాని మూఢునివలె గతమునుగూర్చి విచారింపఁబోఁడు. ఏయన్నము ప్రాణాధారకమో యదియే యొకప్పుడు ప్రాణనాశక మగుచున్నది. ఏయోషధి యమృతసమానమో యదియే యొకప్పుడు గరళతుల్యమగుచున్నది. అట్లే మనమహారాజు పూర్వ

మెట్టెవాఁడైనను మనకిప్పుడు మహానర్థదాయకుఁడు గాఁగలఁడు. కావున నామాట వినుము. నీవును నేనును గుటిలుఁడును బోయి రాజును జంపి వచ్చి నిశ్చింతగా రాజ్యపాలనము చేసికొనుచుందము.

ప్రతి—వలదు—వలదు. ఇంతటిఘోరకృత్యమునకు నేనోపఁజాలను. ఆతఁడు మనరక్షకుఁడు. ఆతనికి మన మెంతయో ఋణపడి యుండియు దురాశచే నాతనిరాజ్యము నపహరించితిమి. మంత్రీ! ఈవిషయమునఁ బ్రప్రథమమునందు నీదు స్తంత్రము నాకు బోధపడియే యున్నచో నేనింతటిపాపకర్ముఁడను గాకయే యుందును. పరిభవించినప్రసేనునిపైఁ బగఁదీర్చుకొనుటకై క్రోధావేశమున మూఢుఁడనై నీకపటతంత్రమునఁ గాలువెట్టితిని. ప్రసేనుఁడు నిశ్చలమగు రాజభక్తిగలవాఁడు గావుననే నన్నట్లు పరిభవించె నని యిప్పటికిఁ దెలిసికొంటిని. పరిభవక్షిన్నుఁడనైన నాకప్పు డింతటిదూరదృష్టిగలిగినది గాదు. నామానవత్వమంతయు నప్పుడే నశించిపోయినది. మంత్రీ! ఇప్పుడెవ్వరి నేమన్న నేమిలాభము?

అనుటయు మంత్రి కుటిలునిం గాంచి "కుటిలా! ప్రతివిందునిమాటలు వినుచుంటివా? రణరంగమున నడుగుద్రిప్పని మహావీరుఁడగుప్రతివిందుఁడు పసిబాలునివలెనైపోయినాఁడు" అని మఱేమియు మాటాడఁ జాలకపోయెను. అప్పుడు కుటిలుఁడు ప్రతివిందునిం గాంచి "సేనాపతీ! మనకిప్పు డీతఁడే



మహారాజుగదా! మునుపటిగొడవలన్నియు నెందులకు? ప్రస్తుతస్థితిగతులనుబట్టి యీతఁడు చెప్పినపనిని జేయుటయే మనకుఁ బరమధర్మము?" అనియెను.

ప్రతి—కుటిలా! ఎందుల కీమాటలు. నేను నీయంతటి బుద్ధిహీనుఁడను గాను.

కుటి—ఔ నామాట నిజమే! మనకంటెను బుద్ధిమంతుఁ డగుమంత్రి మనకిప్పుడు మహారాజయ్యెను. మనక్షేమముకొఱ కిప్పుడు మనమీతనిమాట వినవలయును. పడవను దీరమువఱకును దీసికొనివచ్చి యొడ్డున నేల ముంచివైచెదవు?

ప్రతి—ఈవృథావాక్యములతో నేమిలాభము. నేనిప్పుడెవ్వరిమాటను వినువాఁడను గాను. ప్రతివిందుఁ డింతటినుండి తన కుచితమనితోఁచిన కార్యమునే ప్రాణపదంబుగ నాచరించుచు జీవితశేషమును గడపఁగలఁడు.

అని దృఢముగాఁ బలుకుటయు మంత్రి యాతనింగాంచి "సేనాపతీ! నీవు మాకీకార్యమునందు సాయముచేయవా? అట్లయినచో మాభాగ్యభోగములయందు నీకు భాగ మెట్లు వచ్చును?" అనియెను.

ప్రతి—మంత్రీ! అప్పుడే యంతగర్వమా! నీకు లభించినయీతుచ్ఛభాగ్యమంతయు నావిక్రమలబ్ధమే గాదా?

మంత్రి—ఆలాగా! నీసిద్ధాంతమునకు నాకునవ్వువచ్చుచున్నది. నాఁడు ప్రసేనుబారినిఁ బడి ప్రాణములఁ బాయును

న్నప్పుడు నీరక్షణమునకై నేఁజేసినకార్య మప్పుడే మఱపునకు వచ్చినదా? సేనాపతీ! నేనొక్కటేమాట చెప్పుచున్నాను. నీవు గర్వముచే నన్నలక్ష్యము సేయుచున్నావు. నాయనుగ్రహము చేతనే నీకు సర్వసేనాధిపత్యము లభించినదనియు, నీకు నాయాజ్ఞను బాలింపవలసినబాధ్యత యున్నదనియు జ్ఞప్తియుందుంచుకొనుము.

ప్రతి—మంత్రీ! వీరధర్మావలంబి నగునాకు నీయాజ్ఞను బాలింపవలసినయావశ్యక మొంతమాత్రమును లేదు. బుద్ధిహీనుఁడనై యింతవఱకును నిన్ననుసరించివచ్చితిని. కుటిలమతివి, పాపకర్మరతుఁడవు నగునీతోడి సహవాస ముచితము గాదని నాకిప్పటికి బోధపడినది.

మంత్రి—ఏమనుచున్నావు! కన్నులింతగా నెత్తివిూఁదికి వచ్చినవా? సార్వభౌముఁడనైననన్ను నాయెట్టయెదుటనే తిరస్కరించుటయా? ఒక్కనిమిషములో నిన్నీరాజ్యమునుండి వెడలనడపింపఁగలననుసంగతి నీవూహించుకొనుట లేదు గాఁబోలును?

ప్రతివిందుఁడు క్రోధకంపితస్వరముతో "స్వామిద్రోహీ! దురాశాపరాయణా! పాపమతీ! మంత్రీ! నీరాజ్య మెవరికి గావలయును? నీవు పెద్దవాఁడవగుటచే నిన్ను గురువుగా భావించి యింతకాలమువఱకును నీచెప్పినట్లు మెలంగితి. ఇంతటి పాపబుద్ధి నీహృదయమునం దున్నదని నేనెఱుంగఁజాలకపోయి



తిని. నేను సంపూర్ణముగాఁ దలంచుకొన్నచో నిప్పుడే నిన్నీ కరవాలముతో ఖండఖండములుగాఁ జేసి కాకులకును, గ్రద్దలకు నాహారముగఁ జేయఁగలను. కాని నీవింకను నింతకంటెనునధికమగుపాపఫల మనుభవింపవలసియున్నది. కావున నే నిప్పుడు తొందరపడి భగవదుద్దేశమునకు వ్యతిరేకముగఁ జేయఁజాలకున్నాఁడను. నీయాజ్ఞతో నాకెంతమాత్రమును పని లేదు. నేనే మనఃపూర్వకముగా నరరూపరాక్షసుఁడవగునీతోడి సంబంధమును, నీపాపభాగ్యమునందలి యాశను వదలుకొనుచున్నాను. నీమూలమున నేనెన్నియో మహాపాపములను గావించితిని. పితృస్వరూపుఁడును, దైవసమానుఁడు నగు నాస్వామికిని, అతనికుటుంబమునకును మహాద్రోహము చేసితిని. అన్నదాతయగు నాప్రభువునకు నే నేకరవాలముతోఁ దీఱనియపకారము గావించితినో యాపాపకృపాణమిదిగో! పశ్చాత్తాపదుఃఖముతో దీనిని నీపాపపీఠసాన్నిధ్యమునఁ బరిత్యజించిపోవుచున్నాను. మహాపాపాచరణంబున కుపకరణంబులై దండనాయకాధికారసూచకంబులగు నీదుస్తులన్నియు నివిగో! జ్ఞానియగువాఁడు మాయావరణంబులంబోలె వీనినన్నిఁటిని ద్యజించిపోవుచున్నాను. పాపాత్మా! ఇఁక నేఁబోయెదను. పాపతాపపూర్ణంబగు నీయయోధ్యారాజ్యమును నీవెట్లు పాలించెదవో పరమేశ్వరుఁ డెఱుంగును. ఓపరమేశ్వరా! దీనబంధూ! పాపభంజనా! పరిభవక్లేశఖిన్నుఁడనై దూరదృష్టిలేక పాప

సహవాసినై మహాపాపము లాచరించితిని. ప్రభూ! నాపాపతాప హృదయాంతరాళమునఁ బరమశీతలశాంతామృతవర్షమునుగు రిపించి భక్తపాలనబిరుదమును సార్థకముగాఁ జేసికొనుము. అయోధ్యారాజధానీ! తల్లీ! జన్మభూమీ! నీయీకుపుత్రి నిచిరప్రవాసమున కనుజ్ఞ నొసంగుము. ఓసూర్యకులరాజ్య లక్ష్మీ! నిన్ను నాచేతులారఁ బిశాచములచేతి కొప్పగించితిని. ఈనిర్భాగ్యుని నీవు సంపూర్ణముగాఁ ద్యజించివేయుము. ఓ పట్టమహిషీ! నాపాపపరాక్రమశక్తిచే నీపాపభూజము ఫలించి యేపాపము నెఱుంగని నీతనయయగు సార్వభౌమకుమారికిఁ గూడ నిర్బంధము భోగ్యమైనది. అయ్యో! దైవమా! నేనీపశ్చాత్తాపదుఃఖమును భరింపఁజాలకున్నాను. అరణ్యవాసముచేయుచు ననశనవ్రతినై ప్రాణత్యాగము చేసికొందును.”

అని యీవిధముగా క్రోధదుఃఖావేగముతోఁ బలుకుచుఁ బ్రతివిందుఁ డధికారోపకరణములను అలంకారములను గూడఁ బరిత్యజించి యచటనుండి వెడలిపోయెను.

---

## పదునేడవ ప్రకరణము.

“హా! పరమేశ్వరా! మందభాగ్యురాల నగునాకుఁ దుదకిట్టికష్టమును గల్పించితివా? రాజపుత్రినై రాణి నగునాకిప్పు డేపాపముచే నిట్టివనవాసకష్టము గలిగినది? చతుస్సముద్రవేలావలయిత మగుభూమండలమునకు సార్వభౌముఁడగు నాస్వామి స్వయముగాఁ గందమూలఫలాహరణమునకై పోవలసివచ్చినది! చక్రవర్తితనూజుఁ డగుసగరకుమారునకు వన్యఫలాహారముకూడఁ గఱవైపోయినది! హా యీశ్వరా! నేనెన్నఁడు నెవ్వరికి నెట్టికష్టమును గల్పించినదానను గాను. మఱచియైనను బాపమాచరించినదానను గాను. ఏదోషముచే నాకిట్టికష్టము తటస్థించినది! దేవదేవా! ఈకష్టములకెన్నటికైన విడుగడ యున్నదా లేదా?”

అని యీవిధముగా మహారణ్యమధ్యమునఁ బర్ణకుటీరాంగణమునఁ గూర్చుండి సుమతి విచారించుచుండెను. అప్పుడు సగరకుమారుఁడు లోపలినుండి వచ్చి “అమ్మా! అదియేమి యేడ్చుచున్నావు?” అనియెను.

సుమ—ఏమున్నది నాయనా! మనదురదృష్టమంతయుఁ దలంచుకొని విచారించుచున్నాను. అంతయు నెంతలో మాఱిపోయినది!

సగ—అమ్మా! ఈవిచారమువలనఁ బ్రయోజనము మేము

న్నది? మనయదృష్ట మెట్లున్నదో యట్లయినది. దీనికొఱకు విచారించిన లాభమేమి?

సుమ—విచారింపక యెట్లుండునురా తండ్రీ! రాజపుత్రుఁడవగు నీవు మునుపు పాలుమీఁగడలను భక్షించుటచేఁ గూడఁదృప్తినందువాఁడవు గావు. అట్టి నీవు కందమూలములను, గటుఫలములను దిని జీవించుచుండఁగాఁ జూచి కన్నకడుపు తఱుగుకొనిపోదా నాయనా! ధర్మరాజ్యసింహాసనము నలంకరింపవలసిన నీతండ్రిగారు దర్భాసనమునఁ గూర్చుండి కాలక్షేపము చేయుచుండుటం గాంచి నాకన్నులు దించుకొనిపోవా? మహారాజభోగముల ననుభవింపవలసిననీవు నూతోఁ గూడ వనవాసకష్టములనుబడి వాఁడిపోవుచుండఁగా జూచుచు నేనెట్లు సహింపఁగలను తండ్రీ?

సగ—అమ్మా! నీవు నాకొఱకై విచారింపవలదు. చిరకాలము రాజభోగముల ననుభవించి పెద్దలగు తల్లిదండ్రులు మీరే యిట్లు కష్టపడుచుండఁగాఁ జిన్నవాఁడను నేనించుక కష్టపడఁజాలనా? శత్రుసంశ్రితమగు రాజధానియందుండుటకంటె నిర్జనంబగు నీవనంబున నివసించుటయే సుఖముగా నున్నది. ఇచ్చట నీ మన వనరాజ్యమునపహరించు శత్రువు లెవ్వరును లేరు. నాకారాజమందిరముకంటె నీపర్ణకుటీరమే బాగుగ నున్నది. జ్ఞానముగల యుత్తమజన్మమును గాంచినవారయ్యును మానవులు కృతఘ్నులై నిత్యమును



పరోపకారము చేయుచు హింసాపరు లగుచుందురు. కాని యజ్ఞానమయం బగునధమజన్మముం గాంచినను వనవిహంగములు నిత్యమును భగవన్నామకీర్తనము చేయుచుఁ గాలక్షేపము చేయుచుండును. వానికి నిజముగా మానవుల కున్నంతటి ద్వేషాసూయాదులుండవు. అమ్మా! సుఖమనునది శాశ్వతముగా నెవ్వరి కుండును? పున్నమ వెనుక నమవస వచ్చుచున్నట్లే జీవులకు సుఖానంతరమున దుఃఖము ప్రాప్తించుచుండును. మనమును మనసుఖదినములలో సుఖ మనుభవించితిమి. ఇప్పుడు కష్టదినములు వచ్చినవి. దుఃఖ మనుభవింపక తప్పునా? కాని సర్వదుఃఖహరుండును, భక్తపరాధీనుఁడును, దీనబాధుఁడు నగుపరమేశ్వరుని పరమానుగ్రహము మనకు లభించినదినమునుండి మనము మరల సుఖభోగులము గాఁగలము. అమ్మా! చేతనాచేతనంబు లగునీపదార్థము లన్నియును గాలాధీనములు—ఈజగమంతయు నీశ్వరుని నాట్యరంగము. సుఖదుఃఖము లవశ్యభోగ్యములు.

సుమ—కుమారా! నేనెంతయు నెఱుగుదును. కాని నీకష్టమును గాంచుటచే నాకు ధైర్యము నిలుచుటలేదు.

సగ—అమ్మా! ఎన్నఁడును దేలు గుట్టుట యెఱుఁగనివాఁడు వృశ్చికదష్టునిబాధను గాంచి పరిహసించుచుండును. అట్లే నేనిన్నాళ్లవఱకును సుఖభోగినై యుండి కష్టము నెఱుంగఁజాలకుంటిని. ఇప్పుడు నాకుఁ గష్టసుఖముల యును

భవము గలిగినది. ఇఁక నే నితరులకష్టసుఖములలో సహానుభవముం గాంచవచ్చును.

సుమ—నిజమే. కాని కుమారా! నే నీకన్నులతో నీకష్టమును గాంచఁజాలనురా!

సగ—తల్లీ! నీవు నాకష్టమునకై విచారించుచున్నావు. నేను తండ్రిగారికష్టమును జూడఁజాలకున్నాను. ఆహా! ఆతఁడు చక్రవర్తియయ్యును సంసారనిర్వాహణముకొఱకుఁ గందమూలఫలంబుల నన్వేషించుచు వనమంతటను బరిభ్రమించుచున్నాఁడే! అమ్మా! నేనుగూడఁ బోయి కొన్నిఫలంబులను దెచ్చి తండ్రిగారిశ్రమము నించుక తగ్గించెదను.

సుమ—నాయనా! నీవు పసిబాలుఁడవు. ఈమహావనమార్గము కంటకమయమైనది. అతికోమలంబులగు నీపాదములు కఱకురానేలలయందు నడచుటకు సమర్థములు గాఁజాలవు.

సగ—అమ్మా! ముండ్లు గ్రుచ్చుకొను ననుభయముచే నన్నుఁ బండ్లకుఁ బోవలదనుచున్నావా? కాలవైపరీత్యముచేఁ గలిగిన యీబాధకంటెఁ గంటకబాధ యధికమైనదా? ఇట్టి కష్టకాలమునందు నేను నొకటిరెండుఫలములను సంపాదించి తెచ్చి నాతల్లిదండ్రులను సేవింపఁగలిగినచోఁ బుత్త్రజన్మమైనను సార్థకము గాఁగలదు.



సుమ—వలదు బాబూ! ఈమహారణ్యమునఁ గ్రూరజంతువు లెల్లప్పుడును సంచరించుచుండును. నీవచ్చటికినిఁ బోవలదు.

సగ—ఆక్రూరజంతువులు మనయన్నము దిని పెరిఁగినమనయుద్యోగులకంటెను గ్రూరములైనవి గావు. అంతటి క్రూరుల వదనకుహరములనుండి తప్పించుకొని వచ్చిన నన్నీ వన్యజంతువు లేమిచేయఁగలవు? నేను చాలదూరము పోను లెమ్మా! ఈసమీపమునకే పోయివచ్చెదను.

సుమ—నాయనా! ఆలస్యము చేయకుము. త్రోవలో నేదేని సంశయము తోఁచినచో వెనుకకుఁ బరుగెత్తుకొనిరమ్మా.

అని వదలలేక వదలుటయు సగరుఁడు తల్లికడ సెలవుగైకొని ఫలాహారణమునకై వెడలిపోయెను. రాణి యగుసుమతి తనయునదృష్టమును గూర్చి పరిపరివిధముల భావించుకొనుచు, స్వామికుమారులరాక కెదురుచూచుచు నొంటిగాఁ గూర్చుండి యుండెను. ఇంతలో నాకస్మికముగా సమీపమునుండి మహారాజు కంఠస్వరముతో "సుమతీ! సుమతీ! హా! కుమారా! సగరా!" అనునార్తనాదము వినవచ్చెను. సుమతి యదరిపడిలేచి యున్మాదగ్రస్తురాలివలె నమ్మహారణ్యమునం బడి యార్తస్వరము వినవచ్చినదిక్కు ననుసరించి వెడలిపోయెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.



మహారాజగుబాహుని స్వయముగాఁ జంపి శత్రునిశ్శేషము గావించుకొనవలయునని నిశ్చయించి కుటిలసహితుఁడై మంత్రియే బయలుదేఱివచ్చి రాజున్న యరణ్యమునఁ బ్రవేశించి, మహారాజు ఫలమును గోసి యింటికిఁ దెచ్చుకొనుచుండఁగా మార్గమధ్యమున వెనుకపాటున వచ్చి యాతనిపైవాఁడి బాణమును బ్రయోగించి చరితార్థుఁడై యాక్షణమందే రెండవకంటివారికగపడకుండ వెనుదిరిగి పోయెను. ఇంతటి నీచకృత్యము తానాచరించినట్లు మునిజననివాసంబగు నవ్వనంబున నెవ్వరే నెఱింగినచో శపింపకమానరను భయంబున నాతఁడతినిగూఢంబుగ వచ్చి యతినిపుణముగఁ దనకార్యమునునిర్వహించుకొని పాఱిపోయెను.

అతితీవ్రమగునయ్యస్త్రఘాతముచే నామహారాజునిండు ప్రాణము లాక్షణమందే యంతరాళమున కెగసిపోయెను. ప్రాణోత్క్రమణసమయమునం దాతఁడు గావించినయార్తారవమునుబట్టి సుమతి యరణ్యమున వెదకికొనుచు వచ్చిమృతుఁడై పడిపోయిన నాథునిం గాంచి యనేకవిధముల విలపించివిలపించి దుఃఖావేశముచే మూర్ఛితురాలైపోయెను.

ఒకవంక నదృష్టమును, మఱియొకవంకదురదృష్టమును సంపూర్ణోచ్ఛస్థానమును గాంచినవి. ఇదియంతయును దేవర్షి



యగునారదుఁడు దివ్యదృష్టింగని మృతుఁ డగునాథునిపాదములచెంత మూర్ఛితయై పడియున్న సుమతింగాంచి యించుక విచారించి యుపచారంబులు గావించుటయు సుమతి మేల్కాంచి మరల దుఃఖభరంబున "హానాథా! నాకెంతగతి పట్టినది. అయ్యో! నాదుఃఖమందిరముపై నింకను శోకానలజ్వాలలను దరికొలిపినదురాత్ము లెవ్వరోగదా! హా! దైవమా! నాకీవైధవ్యదుఃఖమునుగూడఁ గల్పించువఱకును నీకన్నులు చల్లపడలేదా?" అని యేడువ నారంభించెను.

అప్పుడు నారదుం డామె కెన్నియోవిధములబోధించి దుఃఖోపశమనముఁ గావింపఁజూచుటయు సుమతి దుస్సహదుఃఖపీడితయైకంపితస్వరముతో "దేవర్షీ! నా కపాలముపగిలిపోయినది. దురదృష్టవంతురాల నగునాకుఁ జేయఁదగినపని యేమున్నది? నేనిఁక నేయాశపెట్టుకొని యూఱట నంది యుందును? ఇఁక నాకీలోకమునం దేమున్నది? దుఃఖజ్వాలలతోమండి భస్మమైపోవలసినదే. నే నీమొగము చూచుకొనియే సకలదుఃఖములను మఱచి యుంటిని. ఈసహాయము చూచుకొనియే సకలకష్టములను సహించి యుంటిని. అట్టి యీనాస్వామియే యిప్పుడు నన్ను దుఃఖసాగరమునం దొంటిగాఁ బడఁద్రోసిపోయినాఁడు. నేనిఁక నేయాశపెట్టుకొని జీవింపఁగలను? దేవర్షీ! నేనీమహారాజుతో నతిశీఘ్రముగఁ జేరుకొనునుపాయమునానతిచ్చినన్ననుగ్రహింపుము!" అని యేడువఁదొడఁగెను.

నార—సుమతీ! నీవిట్లేడ్చుటవలన నేమియును లాభము లేదు. ఎవ్వరితలవ్రాఁతయెట్లున్నదో యట్లుగాక మానదు. నీవు ధైర్యము వహింపవలయును.

సుమ—మహాత్మా! ఎన్నియో కష్టములను సహించితిని. ఇఁక సహింపఁజాలను. నానుదుట నిన్నికష్టములను, దుఃఖములను లిఖించినవిధాత మృత్యువు నేల లిఖింపలేదు. నా యీహృదయయాతన మరణమువలనఁగాని శాంతింపదు.

నార—అమ్మా! జీవుల జననమరణములు పరమేశ్వరాధీనములు. నీనాథుని యాయుస్సేనైనది. అతఁడు పోయినాఁడు. అట్టిసమయము వచ్చినప్పుడు నీవును బోఁగలవు. జీవించుటయు, మరణించుటయు మనయిష్టములోనివి గావు. ఏడ్చుటవలన నేమియు లాభము లేదు. మనము జీవించి యున్నంతకాలమును విధికల్పితంబులగు సుఖదుఃఖములను ధైర్యముతో సహించి యనుభవింపవలసినదే. అమ్మా! సగరకుమారుఁడేఁడీ?

సుమ—మహాత్మా! ఆతఁడు తండ్రికష్టమును జూడఁజాలక తానును ఫలాహారణంబునకై వనమునకుఁ బోయినాఁడు. వచ్చువేళ యైనది. అయ్యో! ఆకస్మికముగ నిదియంతయును జూచి ప్రాణములను భరింపఁగలఁడా?

అనునంతలో సగరుఁ డొక్కపరుగున నచ్చటికి వచ్చిపడియెను. ఆతనికొక్కనిమిషములోనే గురుసందర్శనమును, పితృమరణసందర్శనము నయ్యెను. కొంతసేపటివఱకు నాతఁడు నిశ్చేష్టుఁడైపోయెను. ఆతనిహృదయచలన మాకస్మికముగా స్తంభించిపోయెను. తుట్టతుదకాతఁడు కంపితస్వరముతో "హాతండ్రీ! తండ్రీ! ఎక్కడకుఁబోయితివి? నన్నుఁ గూడ నీవెంటఁ దీసికొనిపోవా? అరణ్యమంతయుఁ దిరిగి యాయాసపడి వత్తువని యెంచి నీకీఫలంబులను జలంబులను గొని తెచ్చితిని. తండ్రీ! మనసుదీర నీతనయుఁడు తెచ్చిన యీపదార్థముల నారగింపవా? తండ్రీ! ఇఁక నామాటలు వినవా? నన్నిఁక నాదరించువా రెవ్వరు?" అని దుఃఖించుచు నారదునిపాదములపైఁ బడి "దేవర్షీ! నన్నును, మా యమ్మను శోకసాగరమున ముంచి మాతండ్రి యీలోకమును విడిచి పోయెను. ఇఁక మాకు దిక్కేమున్నది?" అని విలపింపఁదొడంగెను.



నారదుఁడప్పుడు సగరుని లేవనెత్తి "వత్సా! మరణించినతండ్రికొఱకు విలపించిన నేమిలాభము? ఆతనికర్మఫల మెట్లున్నదో యట్లు జరిగినది. నీవెంతసేపేడ్చినను నీతండ్రి మరల రానేరఁడు. కుమారా! నీవు పరమభక్తుఁడవు. పరమేశ్వరుఁడు నిన్ననుగ్రహించుసమయము వచ్చినది. ఊరక దుఃఖింపకుము" అని బోధించెను.

అప్పుడు సుమతి శోకావేగముతో "దేవర్షితిలకా! దిక్కుమాలియున్న యీసగరకుమారునకు నీవు దిక్కైవచ్చితివి. మహాత్మా! ఈతనిభారమంతయు నిఁక నీయందే నిలిచి

యున్నది. నేను నాస్వామిచితానలంబున దేహపరిత్యాగంబు చేసి భర్తృసంయోగలాభముం గాంచెద నన్నుగ్రహింపుము!" అని వేఁడుకొనియెను.

నార—అమ్మా! సతీమణులకు సహగమనము పరమధర్మమే యగును. కాని నీవిప్పుడు చితారోహణముంగావించుట యొకవిధముగా నుచితమైనను, మఱియొకవిధముగా ననుచితమైయున్నది. స్వధర్మనిర్వహణముచే నీకిప్పుడు పుణ్యము లభించినను, దీనివలనఁ బసిపాపఁడగు సగరకుమారుని దిక్కులేనివానిగాఁ జేసిపోయినపాపము లభింపకమానదు. కావున నీవిప్పుడు నీయుద్దేశమును మార్చుకొనక తప్పదు.

సుమ—దేవమునీంద్రా! నేనింకను నేయాశపెట్టుకొని యెట్టిసుఖము నభిలషించి జీవించి యుందును? నాసర్వసుఖభోగములును నాస్వామితోనే పోయినవి గావా?

నార—అమ్మా! పతివ్రతలకుఁ బతియే పరమప్రియుఁడు. కాని రమణీమణులకుఁ గుమారోదయమైనంతనే వారిప్రేమ చాలవఱకుఁ బుత్త్రునియందే ప్రసరించుచుండును. అందుచేతనే పుత్త్రుఁడు తండ్రికి భార్యాసుఖాపహారి యగుచున్నాఁడు. కావున నోసుమతీ! నీవిప్పుడు నీదుఃఖమును సంపూర్ణముగా మఱచి యతిప్రయత్నముతో నీకుమారుని సంరక్షించుకొనుచుండుము. భవిష్యత్కాలమునందితఁడే నీకు సుఖదాయకుఁడు కాఁగలఁడు.



సుమ—మహాత్మా! సాగరమే శుష్కించిపోయినప్పుడిపల్వలమునుగూర్చి యాశపడు టెందులకు? సార్వభౌముఁడగునాస్వామినే వధించినశత్రువులు పసికూన యగునీసగరకుమారునిమాత్రము బ్రతుకనిత్తురా?

నార—నీవట్లెన్నఁటికి నధైర్యపడవలదు. శత్రువులచే సగరుని కపాయము సంఘటించుట తటస్థించునేని నాతపశ్శక్తిచే బ్రహ్మాండ మంతయు భస్మీభూతమైపోదా? చంద్రసూర్యులు గతులు తప్పిపోరా? నే నుపదేశించినమంత్రప్రభావముచే నీకుమారుఁడు నిర్భయుఁడు, నిశ్చలుఁడునై యుండు నని నమ్ముము. ఈతనిపై శత్రుత్వముం బూనువారికిఁక నెట్టిరక్షణోపాయమును లేదు. నీనాథుఁడు పాపమునకాశ్రయమిచ్చుటచే నిట్టిశోచనీయావస్థను వచ్చినాఁడు. సుమతీ! నీవు జరగినదానికై దుఃఖింపకుము. మీకిట్టి యాపదలంగూర్చిన శత్రుల నందఱను నీకుమారుఁడగుసగరుఁడు తనవిక్రమముచే జయించి మరలఁ బుణ్యరాజ్యస్థాపనము చేయఁగలఁడు.

సుమ—ఋషివరా! జాత్యంధునకు నక్షత్రసందర్శనాపేక్షవలె నావంటిదానికిట్టియాశ యసంగతముగదా! మాయదృష్టమంతయు నాఁడే తిరిగిపోయినది. ఇంకను మాకిట్టి యదృష్టము పట్టునా?

నార—అమ్మా! జీవులభాగ్యచక్రపరిభ్రమణముచే సుఖదుఃఖములు తిరిగిపోవుచుండును. మీకీదుఃఖానంతరమున

మహాసుఖము లభింపనై యున్న దని నమ్మకము. గుణవంతుఁ డగునీకుమారునిచే నసంభవము లన్నియును సంభవములు గాఁగలవు. మీ రిఁక నిచ్చట నుండవలదు. ఈసమీపమందే మహర్షి యగునౌర్వ్వనియాశ్రమ మున్నది. అది మీకు సురక్షితమగుస్థానము. మిమ్ముల నచ్చటికిఁ దీసికొనిపోయి యమ్మునీంద్రున కొప్పగింతును. అచ్చట మహారాజు నుత్తరక్రియలు ముగించినతరువాత నేనొకసారి దుష్టశిక్షకుండును, పాపహారియు, భక్తపాలకుండు నగుపరమేశ్వరుని కడకుఁ బోయి మీక్షేమముకొఱకుఁ బ్రార్థించి యనంతరకర్తవ్యములం గావింతును.

అని వారికి ధైర్యము చెప్పి యూఱడించి సుమతిని సహగమనప్రయత్నమునుండి మరల్చివైచెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము.

---

పాపాత్ముఁ డగుమంత్రిపాపకృత్యములన్నియును ఫలించుచునే యున్నను నాతని కాశమాత్రము తీఱుట లేదు. ఆతనికి రాజ్యలక్ష్మి యనాయాసముగాఁ గరగతమైనను రాజకుమారి యగుశోభన యర్ధాంగలక్ష్మి కాదయ్యె ననువిచారము బాధించుచుండెను. శత్రునిశ్శేష మగుటచే రాజ్యము



నిష్కంటకమే యయ్యెను గాని మంత్రిప్రభుత్వముమాత్రము సర్వజనకంటకముగా నుండెను. ఏమనిన — ప్రజారంజకమగు మహారాజకుటుంబము చీలిపోయి యొకభాగము వనవాసాయాసమును, మఱియొకభాగము ప్రజలకన్నులయెదుటనే కారాగృహనిర్బంధమును ననుభవించుచుండెను. ఇది యంతయుఁ దలఁచుకొని ప్రజలు పరిపరివిధముల లోలోపలనే దుఃఖించుచుండిరి. మంత్రి యిప్పుడు మహారాజైనను నాతఁడు చేసిన దుష్కృత్యములనుబట్టి ప్రజ లాతనిఁ గ్రూరరాక్షసునిగా భావించి నిత్యభయకంపితు లగుచుండియు గత్యంతరములేక సేవించుచుండిరి.

అసాధారణమగు స్వామిభక్తి గలిగి సైనికులను దనబిడ్డలవలెఁ జూచుకొనుచు స్వధర్మనిర్వహణవిషయంబున నతిజాగరూకుఁడై ప్రవర్తించుచుండిన ప్రసేనుని వెడలనడచుటకై మంత్రిచేసినదారుణకృత్యమును ప్రత్యక్షముగఁ గాంచి నప్పటినుండియు సైనికులలో నసంతుష్టి గలిగి క్రమముగా వర్ధిల్లిపోవుచుండెను. అటుపైని పశ్చాత్తప్తహృదయుఁడై సహాయదండనాథుఁ డగుప్రతివిందుఁడు తనసర్వసేనానాయకాధికారమునుగూడఁ దృణప్రాయముగఁ బరిత్యజించిపోయిననాఁడు మొదలుగా సకలసైనికహృదయములందును సంక్షోభమారంభమయ్యెను. అందువలనఁ గొందఱు వీరయోధులు కొలఁది సైనికులతోఁ దమయుద్యోగములను వదలుకొని తమనాయ

కుఁడగు ప్రసేనుఁ డేయరణ్యమునందైన జీవించి యున్నచో నాతని సేవించి జీవింపవలయు ననునాశతో నడవులను బట్టిపోవ నారంభించిరి. క్రమముగా రాజ్యమునందు సేనాబలము క్షీణింపఁదొడంగెను. ఇన్నికారణములచే మంత్రికి సార్వభౌమత్వము లభించినను పార్థివముమ్మాత్రము దుర్బలమై పోవుచుండెను.

ఇఁకఁ బట్టమహిషి యగువిమతికిఁ బాపము పండినది గాని విచ్చిపోయినది. అందుచే నామెయాశతోఁగూడ నదృష్టమును దిరిగిపోయినది. ఆశాపరుఁడగుమంత్రి యామెను బుత్త్రికాసహితముగఁ గారాగారమున బంధించివైచెను. స్వార్థపరత్వముచే దూరదృష్టిలేక చేతులార నాత్మద్రోహముచేసికొంటి నని విమతి యప్పుడు స్పష్టముగా గ్రహింపఁగలిగెను. అప్పుడామెకుఁ దనపాపముచేఁ దనతనయకుఁగూడఁ దీరని దుఃఖము సంభవించె నను నంతస్తాపమును, దనయపరాధమునకుఁ దగినశాస్తియయ్యెనను పశ్చాత్తాపమును, దనరాజ్ఞీచరిత్ర మీవిధముగాఁ గళంకితమైపోయె ననుపరితాపమును గలిగి క్రమక్రమముగా నీముచ్చిచ్చును గలసి జ్వాలారూపమున విజృంభించి సర్వాంతఃకరణములను దహించివైచుచుండుటచే హతాశయు, నసహాయయు నగునామె యొక్కసారిగా నున్మాదినియైపోయెను. అందుచే మంత్రి యామెను వెలివిడిపించి యయోధ్యానగరమునుండి వెడలనడిపించెను.



ఇఁక దురదృష్టవతి యగుశోభన యొక్కతెమాత్రమే కారావాసదుఃఖము ననుభవించుచుండెను. మంత్రి ప్రతిదినమును వచ్చి, తన్నుఁ బెండ్లియాడి సుఖింపవలయు నని నయమునను భయమునను బోధించుచు నామె ననేకవిధముల బాధించుచుండెను. కాని శోభన యెట్టికష్టములైన సహించుచునే యుండెనుగాని యాదురాత్ముని ప్రార్థనము నంగీకరింపకుండెను. జగత్పవిత్రమగుసవితృవంశమున జన్మించిన సార్వభౌమపుత్త్రిక యగుసకుమారీమణి పాపకరస్పర్శనమున కంగీకరింపఁగలదా?

రాత్రి రెండుజాములు దాఁటిపోయెను. గాఢాంధకారము దశదిశలఁ గ్రమ్ముకొని యుండెను. కారాగృహపాలకులు గుఱ్ఱుపెట్టి నిద్రించుచుండిరి. పాపము రాజకుమారి యగుశోభనకు రేయుంబవలు నిద్రయనుమాటయే లేదు. ఆమె కేయుపాయమును దోఁచుటలేదు. ఏసహాయము నగపడుట లేదు. అప్పుడామె తనలో "యిట్టియంధకారసమయమునందుఁ బుణ్యాత్ము లెవ్వరైన నన్నీచెఱనుండి విడిపింపఁగలిగినచో నేవనంబుననైనను బోయి నిశ్శంకముగా నాజీవితమును గడపుకొందును. కాని నాకట్టి యుపకారము చేయువా రెవ్వరున్నారు? మాసొమ్ము దిని జీవించు పరిచారకులందఱును మారాజ్యముతోఁగూడ నిప్పుడు మంత్రి కధీనులైపోయినారు. అయ్యో! నాగోపాలమూర్తిపూజ చేసికొ

చాలదినములైనది. దినమున కొకసారియైనను గోపాలపూజ చేసికొనుటకనుజ్ఞ నిమ్మని మంత్రి నెన్నియోవిధములఁ బ్రార్థించితిని. కాని, పాపాత్ముఁ డగునాతఁడు కఠినహృదయుఁడై నావిన్నపమును ద్రోసివైచినాఁడు. హా! గోపాలా! గోపాలా! నిన్నుఁ బూజించుట లేదని నీకు నాపైఁ గోపము గలుగుచున్నదా? కాలుసేతులు బంధింపఁబడి కారాగారమునందున్న నేను నిన్నేవిధముగా నర్చింపఁగలుగుదును? గోపాలా! నిన్నే ప్రేమించియున్న నాపై నిష్కారణముగా నీవేల కోపించెదవు? నీయనుగ్రహముచే నెప్పటికైన నాకీచెఱవదలిపోయినచో నరణ్యములపాలై పోయి యందెచ్చటనైన నివసించి యడవిపూవులతో నహోరాత్రములు నిన్నుఁ బూజించుకొనుచు సంతతినుండి నాజీవితమంతయును సార్థకముగాఁ జేసికొందును. ప్రభూ! చక్రవర్తి యగుజనకుఁడును, తల్లికంటె నధికురాలగుపినతల్లియు, ప్రాణమునకుఁ బ్రాణమగుసోదరుఁడును దురదృష్టవశమున నను ను రాజ్యమునుగూడఁ ద్యజించి యెటుపోయిరో, యేమైపోయిరో నాకేమియు నిప్పటికిని దెలియనే లేదు. ఈనిర్భాగ్యురాలికి మందభాగ్య యగుతల్లి యుండెను గాని యామెయు శత్రువంచితయై, పాపతాపముచే నున్నాదినియై బలవంతముగ నగరమునుండి వెడలఁగొట్టఁబడి పోయెను. స్వామీ! ఇఁక నాకు దిక్కేమున్నది? నీ మొగముఁజూచుకొనుచు నీ దుస్సహకష్టము ననుభవించుచుండియుఁ బ్రాణములను నిలుపుకొని యున్నాను. ఇప్పుడు నాజన్మస్థానమంతయు శత్రుగ్రహమధ్యగతమై పోయినది. నాబంధుక్షేత్రమునకుఁ బాపార్గళి పట్టినది. ఈశుభదశయం దిచ్చట నాకు నీకంటె నావారని చెప్పఁదగినవారింకెవ్వరున్నారు? నిన్నెల్లప్పుడును నావక్షమునందుంచుకొని నీకొఱకే ప్రాణములను నిలుపుకొని యున్నాను. ఆమంత్రిదురాత్ముని యపచారము కారణముగా నాజీవనలీల యంతరింపవలసినయవసరము తటస్థించినప్పుడు— గోపాలా! అశుభాశుభమిశ్రమసమయమునందు నీదివ్యసుందరవదనారవిందము నొక్కసారి కన్నులారఁజూచి నీమనోమోహనమూర్తిని భావించుకొనుచు నయనయుగళమును ముద్రితముగఁ జేసి పరమానందముతోఁ జిరనిద్రాముద్రితనై పోయెదను. ప్రభూ! నీకంటె నాకష్టము నిఁక నెవ్వరితోఁ జెప్పుకొందును? ఈయాఁడుమొఱ నాలకించువారింకెవరున్నారు? నన్ను రక్షింపఁగలసమర్థు లెవ్వరున్నారు? రేయుంబవలు నాప్రాణసంకటమును, నాహృదయవేదనను బరమేశ్వరునకు విన్నవించుకొనుచునే యున్నాను. కాని యావిధాత యంతర్యామియయ్యును నాదీనాలాపముల నాలకించుట లేదు. ఇఁక నాకీశత్రుహస్తములందు మరణమే శరణము గాఁబోలును. దురాత్ముఁ డగుమంత్రి నీచమోహావేశముచే నపచారమునకుఁ గడంగినప్పు డాత్మహత్యకంటె నాకుపాయాంతర మేమున్నది? ఈశ్వరుఁడు నాకిట్టివ్రాఁతయే లిఖించెను గాఁబో

లును. దేవా! నేను మహాదుఃఖముతో నిరంతరమును నిన్నుఁ బ్రార్థించుచుంటినే! ఇంకను నీకఠినహృదయమునందు జాలి పుట్టుటలేదా? హా! ఈదిక్కుమాలిన యభాగ్యబాలికకన్నీటి ధారలు నీపాషాణహృదయమునకుఁ బన్నీటియూటలయ్యెనా? హా! యీశ్వరా! నన్నింతగా నేడ్పించుట నీ కేమిసంతోషము!" అని యనేకవిధములఁ దనలోఁ దానే విచారించుకొనుచు దుస్సహాదుఃఖావేశముచే నొడలెఱుంగక పడియుండెను.

దురంతకష్టానుభవంబునఁ బ్రాణవాయువులు చలించి తుదముట్టిపోవుచుండ దుస్సహదుఃఖసంతాపముచే గాఢద్యముంగాంచిన పరమభక్తుల ప్రార్థనాలాపములుగాని నిత్యానందతన్మయుఁ డగు నిఖిలేశ్వరుని మేల్కొలుపఁజాలవు. ఇంతకాలమునకు శోభనదీనాలాపములు శ్రీమన్నారాయణుని చెవులకు సోఁకినవి. భక్తచింతామణి యగుపరమేశ్వరుఁ డాక్షణమునందే కారాగారద్వారముచెంత కేతెంచి యమృతమధురస్వరముతో "శోభనా! శోభనా!" అని పిలిచెను.

శోభన యులికిపడి లేచి మహాశ్చర్యభయభక్తిసంభ్రమంబులతో నాదివ్యమూర్తిం గాంచి విలక్షణభావకంపితస్వరముతో "గాఢాంధకారబంధురమగు కారాగారమునంతను దేహకాంతిచేఁ దేజరిల్లఁ జేయుచుండు దివ్యమూర్తులగు మీ రెవ్వరు?" అని ప్రశ్నించెను. ప్రత్యుత్తరము లేదు. పరమేశ్వరునిభక్తావనతత్పరత్వ మొకనిమిషములోఁ బరిపూర్తి యయ్యెను. కారా



గృహద్వారములు తెఱవఁబడియెను. శోభనకరపాదశృంఖలములు విడిపోయెను.

దీనదయాళుఁ డగు నారాయణుఁ డాక్షణమునందే శోభనను లేవనెత్తి వెలుపలికిఁ గొనితెచ్చి "కుమారీ! నే నెవ్వఁడనైన నీ కేమి? నీకీసంగతి తరువాతఁ దెలియఁగలదు. నీవిప్పుడిటనుండి బయలుదేఱి యతిశీఘ్రముగ నెటకైనను బాఱిపొమ్ము! లెమ్ము! ఒక్కనిమిషమైన నాలస్యము చేయవలదు" అనియెను. అనిర్వాచ్యమగు భావోదయ మగుటచే శోభన పరవశ యైపోయెను. నారాయణుఁ డామెచేయిపట్టుకొని "నడువుము! త్వరగా నిటనుండి పాఱిపొమ్ము!" అని తొందరపెట్టెను. అప్పుడు శోభన గంభీరమధురస్వరముతో "ఇంతటి ప్రభావసంపన్నులగు మీరుగూడ పాపాత్ముఁడగు మంత్రిం గూర్చి భయపడుచున్నారా?" అనియెను.

నారా—అమ్మా! నే నీజగంబునం దెవ్వరికినిగూడ భయపడువాఁడను గాను. నే నిప్పుడు చెప్పినమాట వినుము. ఇంకను గొంతరాత్రియున్నది. కారాగృహపాలకులు నిదురించుచున్నారు. ఈయంధకారమునందే యీనగరమును విడిచి నీ వెటకైనను బాఱిపొమ్ము.

శోభ—మహాత్మా! మీయనుగ్రహముచే నాకు బంధవిమోచన మైనది. ఇఁక నాకెట్టిభయమును గలుగదని ధైర్యము గలిగినది. కాని, నాకిట్టిమహోపకారముఁ

గావించినమహానుభావులు మీరెవ్వరో.

అని యడుగుచుండఁగనే నారాయణమూర్తి తత్తరముతో "ఈప్రశ్నలకిప్పు డవకాశములేదు. వేగముగఁ పాఱిపొమ్ము. పాఱిపొమ్ము." అనిచెప్పుచు శోభనచూపులలోనే యదృశ్యుఁడైపోయెను. శోభన పరమాశ్చర్యముతో నిటునటుఁ గొంతసేపు చూచి యేమియుం గానక యాపురాణపురుషుని దివ్యోపదేశము నూతగాఁ జేసికొని యటనుండి బాలకురంగినివలెఁ బరుగెత్తుకొనిపోయెను. రాజకుమారిక—చిన్నబాలిక—గమనాయాసము నెన్నఁడు ననుభవించినది గాదు—అట్టిశోభన కాలినడకతోఁ గఠినశత్రువులను దప్పించుకొని యెట్లు పాఱిపోఁగలదు? కాని యొకవంక భయమును, మఱియొకవంక ధైర్యమును నామెను బురికొల్పుచుండుటచే నదేపనిగఁ బ్రయాణము చేసి యతికష్టముతో సరయూనదీతీరమును జేరుకొనియెను.

ఆమహానదిం గాంచినంతనె యామెకు భయముచే గుండె చెదరిపోయెను. ఇఁక ముందుగతి యేమియుం దోఁచక యామె యధైర్యముతో "అక్కటా! నేనెంతయో కష్టపడి యింతవఱకు శత్రువులచేతుల్లలోఁ బడకుండ నింతదూరము పరుగెత్తుకొని వచ్చితిని. కాని యిఁక నుపాయాంతర మేమున్నది? అబలనగునాకులాయనమున కపారమగు నీమహానది ప్రన్నము వచ్చినది. ఈపాటికప్పుడే శత్రువులు నన్నన్వేషిం



చుటకై బయలుదేఱియే యుందురు. ఇఁక మరల వారిచేతులలోఁ బడుటయే తటస్థించినయెడల మరణముకంటె నాకు మఱియొకయుపాయము లేదు. ఎటులైన నీలోపుగనే యీనదిని దాఁటి యవ్వలికిఁ బాఱిపోవలయును. ఈనదిని దాఁటించువా రెవ్వరున్నారు? నేనిప్పుడు వచ్చినదూర మెంతయో లేదు. ఒకటిరెండు గడియలలో శత్రువులు నన్నుఁ గలిసికొనఁగలరు. ఇఁక నాకేదిదిక్కు. గోపాలా! ఎట్లో బయటఁబడి సుఖముగా నిన్నుఁ బూజించుకొనుచుఁ గాలక్షేపము చేయఁ దలఁచితిని. కాని నాకాయదృష్టము పట్టియు నిరుపయోగమై పోయినది. కారాగారమునుండి నన్నుద్ధరించిన దయామయుఁడవగుపరమపురుషా! మహాప్రభావసంపన్నుఁడవగునీవు నన్ను నిరపాయస్థలంబునఁ జేర్పఁజాలవా? "పాఱిపొమ్ము! పాఱిపొమ్ము!" అని నన్ను నాయదృష్టము చేతులలోనే విడిచిపెట్టిపోయితివేల? మహాత్మా! ఈయేఱుగూడ దాటించి కష్టములనుండి నన్నుఁ గట్టెక్కింపుము!'' అని ప్రార్థింప నారంభించెను.

అంతలో నారాయణమూర్తి మరల నామెకట్టెదుట సాక్షాత్కరించి ప్రేమమయకంఠస్వరముతో "కుమారీ! ఇంకను నీవిచ్చటనే యుంటివా? అతిశీఘ్రముగ నీమహానదిని దాఁటి యటనుండి యార్యాశ్రమమునకుఁబోయి సుఖముగ జీవింపుము. అటుమున్ముందు నిఁక నీకెట్టివిపత్తును గలుగఁబోదు"

అని యానతిచ్చుటయు శోభన కృతాంజలియై భక్తిగద్గదస్వరమున "ప్రభూ! చిన్నిబాలికనగు నే నీవిశాలతరంగిణి నెట్లుత్తరింపఁగలను?" అనియెను. నారాయణుఁడు మందహాసము చేయుచు నామెచేయిపట్టుకొని "అమ్మా! భయపడవలదు. నేనే నిన్నీనదిని దాఁటించెదను" అనియెను.

ఆనిమిషమునందే సంకల్పమాత్రముచే నొకపుష్పనౌక నదీతీరమునకు వచ్చెను. ఆనౌకకు నారదుఁడే కర్ణధారుఁడై యుండెను. నారాయణమూర్తి యప్పుడు శోభన నానౌక యొడ్డుఁ జేర్చి నారదునిం గాంచి "వత్సా! నీవీమె నాశ్రమమునకుఁ గొనిపోయి యచ్చట సుమతి కొప్పగింపుము." అని యానతిచ్చి మరల నంతర్హితుఁడై పోయెను.

శోభన కిదియంతయును సుఖస్వప్నమువలె నుండెను. అప్పుడామె పరమభక్తిపూర్వకముగా దేవర్షియగునారదునకు నమస్కరించి "గురుదేవా! కారాగారవిముక్తి కాపరమపురుషుఁడును, మహానదీతరణమునకు మీరును సాయపడు భాగ్యము తటస్థించుటచే నేను ధన్యురాలనైతిని. ఈమహాభాగ్యముచే మాసూర్యవంశము నిష్కలంకమైనది. మహాత్మా! ఆనిమిషమునుండియు మనస్సంశయము నన్నుఁ బీడించుచునే యున్నది. ఆదివ్యమూర్తి యెవ్వరు? నే నెన్నిసారులు ప్రశ్నించినను దెలుపలేదు. ఆతనినామమైనను దెలిసికొనుట కవకాశము లభించినదిగాదు. గురుదేవా! నాయం దనుగ్రహించి



యాతనినామమును దెలుపుఁడు!" అని ప్రార్థించెను.

నార—కుమారీ! ఆతనినామమున కేమిగాని యాతనిపవిత్రకార్యములనుగూర్చి ముఖ్యముగా గ్రహింపవలసియున్నది. భక్తుల కష్టముం గాంచినంతనే యాతనిమృదుల హృదయము కరఁగి నీరైపోవును. ఆదివ్యమూర్తి యంతటి దయాళుఁడు. శోభనా! నీ వాపరమేశ్వరునిఁ గన్నులఁ గాంచితివిగదా! నీయొద్దనున్న గోపాలమూర్తితో నాదివ్యమూర్తినిఁ బోల్చి చూచుకొంటివా?

శోభ—చూచుకొంటిని మునీంద్రా! ఆదివ్యమూర్తి మూఁడుమూర్తులను నాగోపాలమూర్తివలెనే యున్నాఁడు!

నార—అమ్మా! నీజ్ఞాననేత్ర మున్మీలితమైనది. కావుననే నీ వాతని నట్లు చూడఁగలిగితివి. శోభనా! నేను సగరునకేదివ్యనామమంత్రము నుపదేశించితినో ఆదివ్యమూర్తి మధుసూదనుఁ డతఁడే. ఆవిశ్వమోహనమూర్తినే దృశ్యరూపముగా బొమ్మను జేసి నీకిచ్చితిని. అకృత్రిమభక్తిపూర్ణంబగు నీపూజచేతనే యానందించి నీగోపాలుఁడు నిన్నీకష్టములనుండి యుద్ధరించినాఁడనుసంగతి యించుక నీకుఁ దెలియనేలేదా తల్లీ! ఇంతకాలమునకు నీపూజ ఫలించినది. నీవంటి బాలికను శిష్యురాలిగాఁ బడసిన నేనుగూడ ధన్యుఁడనైతిని.

అనియిట్లు నారదుఁడు పరమానందమునొందుచు శోభనకింకను ననేకవిషయములను బోధించుచు నదీతరణముం గా

వించి యటనుండి శోభనను వెంటఁబెట్టుకొని యార్యాశ్రమమునకుం బోయి పర్ణకుటీరమున భర్తృమరణదుఃఖముచేతనే గాక పుత్రవియోగదుఃఖముచేఁ గూడఁ బొగులుచున్న సుమతికామె నొప్పగించి యచిరకాలమున మీకు శుభంబు కాఁగలదని వారికి బోధించి యనేకవిధముల వారి నూరడించి వెడలిపోయెను.

---

## ఇరువదియవ ప్రకరణము.

---

ప్రతివిందుఁ డట్లు తనకన్యాయముగా లభించిన దండనాయకాధికారమునకు జలాంజలి యిచ్చి పశ్చాత్తాపదుఃఖముతో మహారణ్యమధ్యంబున మహాప్రస్థానముఁ గావింపఁదొడంగెను. ఎన్నఁడైన మహారాజు దర్శనము దొరకినచోఁ దనయపరాధము నాతని కెఱింగించి క్షమాప్రార్థనముఁ గావించి యించుక మనశ్శాంతిని గల్పించుకొనవలయునని యాతఁ డెంతయో యాశపడుచుండెను. అతఁ డట్లు శ్రమపడి మహారాజు నివాసస్థానమును దెలిసికొని యచ్చటికిఁ బోవునప్పటికే దురాత్ముఁడగు మంత్రిచే మహారాజు హతుఁడయ్యెనను వార్త దెలియవచ్చెను.

ఇఁక నాతనిదుఃఖమున కవధి లేకుండఁ బోయెను. అతనిపరితప్తహృదయమున నెన్నఁటికైన నించుకశాంతి లభించు



నను నాశ కూడ లేకుండఁ బోయెను. తలఁచుకొన్నకొలఁది నాతనిహృదయాంతరాళమునఁ బశ్చాత్తాపానలజ్వాలలు ప్రజ్వరిల్లిపోవుచుండెను. ఎంత మఱచిపోవుద మన్నను నాతనికిఁ దనపాపకృత్యము తలంపునకువచ్చి హృదయతాపము వర్ధిల్లఁ జేయుచుండెను. తననిర్మలజీవితమున కింతటికళంకమును, తన శాంతహృదయమున కింతటిపరితాపమును గల్పించుటకుఁ గారకులైన దుష్టబుద్ధియగు మంత్రింగూర్చియు, దురాత్ముఁడగు కుటిలునింగూర్చియుఁ దలంచుకొని యాతఁడు క్షణక్షణమును క్రోధావేశముచే మండిపోవుచుండెను.

ఇంతటికోపదుఃఖపరితాపములను భరించి ప్రాణములతో నిలిచియుండుట యాతని కతిదుస్సహముగా నుండెను. తుదకాతఁ డాత్మహత్య చేసికొని యతిదారుణంబు లగుదుఃఖయాతనలనుండి తప్పించుకొనవలయు నని నిశ్చయించుకొని సరయూనదీతీరమునం దొకపర్వతసమీపమున నిలువఁబడి "హా! పరమేశ్వరా! లోకనింద్యచరిత్రుఁడనగు నే నింకను సిగ్గులేక ప్రజలయెదుట నా మొగము నెట్లు చూపఁగలుగుదును? నేను నా ప్రతిపాలకునిపైఁ బ్రతిఘటించి పాపాచరణముం గావించితిని. నాస్వామిహత్యకు నేను సహాయపడితిని. ఔరా! ఇట్టినాదుష్కృతి కెంతైనను నిష్కృతి యున్నదా? ఓ భూదేవీ! ఈపాపాత్ముని పాపదేహమును నీ వెట్లు భరింపఁగలుగుచున్నావు! నీ వొక్కసారిగా నన్ను నీగర్భమునం జేర్చుకొని యాలో

కమున కిఁక నగపడకుండఁ జేయఁగూడదా? ఓయాకాశమా! నీవాక్రోశముగా నాతలపై నతిఘోరం బగునశనివర్షమును గురియింపఁగూడదా? ఓపుణ్యతరంగిణీ! సరయూ! నేనీపాపతాపము ననుభవించుచుఁ బ్రాణముల భరింపఁజాలకున్నాఁడను. ఓయమృతవాహినీ! అమృతశీతలం బగునీసలిలగర్భంబున నన్నుఁ జేర్చుకొని జీవనలీలతోఁగూడ నాహృదయపరితాపము నపనయింపఁజేయుము. ఓపరమకారణా! పాతకజనతారణా! జగత్ప్రభూ! నిర్భాగ్యుఁడ నగునాకు—పశ్చాత్తాపదుఃఖముచే మరణించుచున్ననాకు—భక్తచింతామణి వగునీవించుక హృదయశాంతిప్రదానముం గావించి యనుగ్రహింపుము. ఓవిశ్వమూర్తీ! సర్వపాపహరంబగు నీదివ్యనామమును స్మరించుకొనుచు నీసరయూజలంబులఁ బడి పోవుచున్నాను. సర్వేశ్వరా! నాకు నీశాంతిధామమును బ్రసాదింపుము!” అని ప్రార్థించుచుఁ బ్రీతివిందుఁడు సరయూనదీమధ్యమునఁ బడఁబోవుచుండెను.

అంతలో నాకస్మికముగా నారదుఁ డచ్చటికి వచ్చి ప్రీతివిందుని చేయి పట్టుకొని “వత్సా! ఆత్మహత్య మహాపాపము గదా! వలదు! వలదు!” అని వారించెను. అప్పుడు ప్రీతివిందుఁడు నిట్టూర్పులు విడుచుచు “మహాత్మా! మరణముచే మనశ్శాంతి నభిలషించుచున్న నన్ను మీ రేల వారించెదరు? అనఘచరిత్రులగు మీ రీయధమాధము నంటవలదు.



నే నీజన్మమం దెంతయో మహాపాపముఁ గావించితిని. ఆపాపప్రాయశ్చిత్తమునకై సరయూజలంబులఁ బడి ప్రాణత్యాగము చేసికొనఁదలంచితిని. మహాత్మా! నన్ను విడిచిపెట్టుఁడు” అని ప్రార్థించెను.

నార—వత్సా! ఎంత వెఱ్ఱివాఁడవు? పాపమునకు భయపడునీవు మరల మహాపాపమగు నాత్మహత్య కేల ప్రయత్నించెదవు? మనసు కుదుటపఱచుకొని నామాట వినుము. నీ వీయుద్దేశమును మార్చుకొనుము!

ప్రీతి—దేవర్షీ! బ్రదికియుండుటచే నాకిఁక గౌరవమే మున్నది? ఎవ్వనినామము కళంకితమైపోయినదో, ఎవ్వరిజీవితము లోకమున కసహ్యమైపోయినదో యట్టివాఁడు బ్రదికియుండుటకంటెఁ జచ్చుటయే మంచిదిగాదా?

నార—నీ వితరులదుస్తంత్రములలోఁబడి నీజీవితమున కశాంతిని గల్పించుకొంటివని నే నెఱుంగుదును. కాని యిప్పుడు నీతప్పు నీవు తెలిసికొని పాపసంగమును బరిత్యజించియుంటివి. మఱియును స్వాపరాధమునకై సంతాపానలజ్వాలలచే దగ్ధుఁడ వగుచుంటివి. కావున నీపాపమునకుఁ బ్రాయశ్చిత్తమైపోయినది. అనలసంతప్తమై దుష్టకాంచనము విమలమైనట్లుగాఁ బశ్చాత్తాపముచే నీజీవితము పాపముక్తమైపోయినది. ప్రీతివిందా! నీవిఁకఁ బ్రాణత్యాగబుద్ధి విడువుము. ఆత్మహత్యాపాపమునుండి నిన్నుద్ధరించుటకే వచ్చితిని.

ప్రతి—మహాత్మా! అధమాధముఁడనగు నాకనుకూల సమయమున దర్శనమొసంగిన మీ కనేక వందనములు. కాని దేవర్షితిలకా! నాయంతరంగము నిరంతరము ననుతాపానలముచే దహించుకొని పోవుచున్నది. ఈబాధ నపనయించుట కాత్మహత్యకంటె నన్యోపాయ మగపడుట లేదు. తండ్రీ! నా కీహృదయతాప మెట్లు శాంతించునో బోధించి నన్నుద్ధరింపుము.

నార—వత్సా! నీవూరక పరితపింపకుము. నీ వేయుపకారుల కపకారము చేసితినని సంతపించుచుంటివో వారికే మరల నుపకారము చేసి శాంతినందుము.

ప్రతి—ఇఁక నే నెవ్వరికుపకారము చేయుదును? మా మహారాజు మరణించినాఁడు. ఇఁక రాజకుమారుఁడును రాణియు మాత్రమే నిలిచి యున్నారు. వారెందున్నారో నే నెఱుంగను. అయినను నొకసారి నావలన నపకారము నందినవారు నన్ను విశ్వసించి మరలఁ బరిగ్రహింతురా?

నార—ప్రతివిందా! మీ రాజకుమారుఁ డగుసగరుఁడు తల్లిదుఃఖమును జూడఁజాలక రహస్యముగా నెచ్చటికో వెడలిపోయినాఁడు. పుత్త్రవియోగదుఃఖముచే సుమతి యిప్పుడు రేయుంబవలు పరితపించిపోవుచున్నది. ఈసమయమునందు నీవుపోయి యామెను దర్శించి యొకసారి "అమ్మా!" అని పిలిచినచో నామెదుఃఖ మించుక శాంతింపఁగలదు. మీ రాజ



కుమారి యగుశోభన యీశ్వరానుగ్రహముచేఁ గారాబంధవిముక్తయై పోయి యిప్పు డామె చెంతనే యున్నది. అయిరువురునుగూడ నౌర్వాశ్రమమునం దొకపర్ణకుటీరమునందున్నారు. నీవు శీఘ్రముగఁ బోయి వారికి ధైర్యము చెప్పుము. మఱియు నీసరయూతీరవనంబున మీసర్వసేనానాయకుఁడగు ప్రసేనుఁ డొకశైలదుర్గమును నిర్మించుకొని సేనలం జేర్చుకొనుచు నయోధ్యారాజ్యపునరుద్ధరణమునకై యనుకూలసమయమును నిరీక్షించుచున్నాఁడు. నీవాతనికిఁ దోడై పనిచేయుము. సగరకుమారుఁ డచిరకాలముననే సార్వభౌముఁడు గాఁగలఁడు. మరల నయోధ్యారాజ్యసింహాసన మర్కవంశమునందు మీయిరువురిచేతనే ప్రతిష్ఠింపఁబడుగాక! పొమ్ము! ప్రతివిందా! ఆలస్యము చేయక యతివేగముగఁబోయి కార్యదీక్షితుఁడ వగుము.

అని బోధించుటయు స్వామిభక్తుఁడగు ప్రతివిందుఁ డాత్మహత్యాప్రయత్నమును బరిత్యజించి యౌర్వాశ్రమాభిముఖుఁడై వెడలిపోయెను.

---

## ఇరువదియొకటవ ప్రకరణము.

---

"శ్రీమన్నారాయణా! ఈదాసునియెడల ననుగ్రహించి దర్శన మొసంగుము. నే నతిదుఃఖముతో మాతల్లిని విడిచి నిన్ను వెదకికొనుచు నీయడవుల వెంటఁ దిరిగితిరిగి యిడుమలఁబడుచున్నాఁడను. మందభాగ్యురాలగునాతల్లి నావియోగదుఃఖమును భరింపఁజాలక రేయుంబవ లెంత పరితపించుచున్నదోగదా! తండ్రీ! ఈప్రపంచమునం దామెకు నాకంటె "అమ్మా" యని పిలుచువా రింక నెవ్వరును లేరు. ఇంతటి మహావిపద్దశయందుఁగూడ నామె నామొగము చూచియే ప్రాణములను నిలుపుకొని యున్నది. నేనే లేకయున్నచో నాతల్లి యిదివఱకే ప్రాణత్యాగము చేసికొని యుండును. శ్రీహరీ! నేను నాదుఃఖముకొఱకు నిన్నుఁ బ్రార్థించుట లేదు. దయాళుఁడ వగునీవు నావిన్నపము నాదరించి మాతల్లిదుఃఖమును దూరము చేయుము! ఆతల్లికష్టమును నే నెంతమాత్రమును జూడఁజాలకున్నాను. స్వామీ! ఏకాగ్రచిత్తముతో నేడ్చుచు దుఃఖగద్గదస్వరముతో నిన్నెవ్వరు పిలిచినను "ఓ" యని నీవు వారినిఁ బలుకరింపకుండ నుండఁజాలవని వింటిని. ప్రభూ! నేను వెక్కివెక్కి యేడ్చుచు నిన్నెన్నియోసారులు పిలుచుచునే యున్నాను. నాయీదుఃఖాహ్వానము నీచెవుల సోఁకుటయే లేదేమి? పాపాత్ములగుమాయుద్యోగులువిశ్వాస



ఘాతుకులై మారాజ్యమంతయుఁ గపటతంత్రమున నపహరించుటయేగాక సార్వభౌముఁడగు మాజనకుని సంహరించి జననిని విధవగాఁ జేసివైచినారు. ఇదియంతయు గాంచి రాజపుత్రుఁడనగునాహృదయము దగ్ధమైపోవుచున్నది. ఓశాంతమూర్తీ! నిరంతరసంతప్తం బగుచున్న నాహృదయాంతరాళమున శాంతరసమును వర్షింపుము. సుఖమయా! ఎల్లరపన్నపములను మన్నించువాడవగు నీవే లోకనాయకుఁడ వగుదువని యంటివి. జగన్నాయకా! దీనుఁడగు నీబాలకుని దుఃఖాలాపములనాలకింపకున్నచో నాథనాథుఁడవగునీకపకీర్తిగాదా? అట్లయినచో నింక నీలోకమునందు విపన్నులగువారు "దుఃఖభంజనా! మధుసూదనా!" యని నిన్నెన్నఁడైనఁ బిలిచి ప్రార్థింతురా? ఇంత యుదాసీనుఁడవై యున్నచో నీభక్తవత్సలనామమునకుఁ గళంకము గలుగదా?"

అని యిట్లనేకవిధముల నాదినారాయణుఁగూర్చి ప్రార్థించుచు సగరకుమారుఁడుమహారణ్యపథంబున నుత్తరాభిముఖుఁడై పోవుచుండెను. మహారణరంగమున మడమద్రిప్పని మహావీరునివలె నక్కుమారుఁడు పరమేశ్వరసందర్శనమగునంతకును వెనుకకుమరలనని నిశ్చయించుకొనియేబయలుదేఱెను. కాని యప్పుడాచిన్నబాలకునియమాయికహృదయాంతరాళమునం దుఃఖప్రేరితమగు మోహము, పుణ్యబోధక మగుజ్ఞానమును బరస్పరవిజిగీషతో నిలిచి యాతని కీక్రిందివిధముగా బోధింపఁదొడంగెను.

మోహ—కుమారా! సుఖమయమగుతల్లియొడిని విడిచి దుర్గమారణ్యమధ్యమున కేల వచ్చితివి? వెఱ్ఱివాఁడా! వెనుకకు మరలిపొమ్ము!

జ్ఞాన—వత్సా! వలదువలదు. పోవలదు. వచ్చినవాఁడవు రానేవచ్చితివి. విచారము విడిచి హృదయమును బదిలపఱుచుకొని నిర్భయముగా వచ్చినకార్యమును సాధించుకొని మఱిపొమ్ము!

మోహ—కుమారా! ఈవనము క్రూరజంతుసమాశ్రితమైనది. నీవు పసిబాలుఁడవు. మఱియు నసహాయుఁడ వగు నీకిం దాత్మరక్షణమున కుపాయము లేదు. శీఘ్రముగా నిట నుండి వెడలిపొమ్ము.

జ్ఞాన—రాకుమారా! భక్తశిరోమణివగు నీ కెందును భయము లేదు. సంపద్విపత్తులయందు సమభావముంచి సంయతచిత్తముతో సర్వేశ్వరు నన్వేషింపుము.

మోహ—నీవు చెంతలేక నిర్భాగ్యురాలగు నీతల్లి నిత్యము దుఃఖించుచున్నది. నీముద్దుపలుకుల వినుకలి లేక యామె ప్రాణము లెగసిపోఁగలవు. పొమ్ము త్వరగా నింటికిఁ బోయి తల్లిప్రాణములను కాపాడుము.

జ్ఞాన—నాయనా! మాయామోహితులగువారు మంత్రసాధనమున కర్హులు గానేరరు. అనుకూలప్రయత్నముల కంతరాయములు మెండుగా నుండును. తండ్రీ! జాగరూకుఁ



డవై కార్యసాధనమును గావింపుము.

మోహ—పసిపాప వగు నీ కాఁకలియైనచో నొకపండైనను గోసి యిచ్చువారు నీకిం దెవ్వరున్నారు?

జ్ఞాన—హరినామామృతరసపానమువలన నజస్రమును బ్రాణము పులకించుచుండఁగా నాఁకలియు, దప్పియు నింకెక్కడ?

మోహ—అబ్బాయీ! ఈమెట్టవేదాంతముల కేమి? ఈమహారణ్యమున మహాభయముచే నీయొడలు వడఁకిపోవుచున్నప్పుడు నీకభయదానము చేసి నిన్నాదరించువారిం దెవ్వరైన నున్నారా? బాగుగ నాలోచించుకొము!

జ్ఞాన—సర్వజీవభయాపహారియగు శౌరిదివ్యనామము నుచ్చైస్స్వరమున జపించుచుండువానికి భక్తపరాధీనుఁ డగు పరమేశ్వరుఁడే సర్వాంగరక్షకుఁడై యుండఁగలఁడు. ఇఁక నీకు భయమనుమాట యేమున్నది?

అని యీవిధముగా బాలకుఁడగు నాతని కోమలహృదయకుహరమున సంకల్పవికల్పములకు సంకులసమరము జరగుచున్నను సగరకుమారుఁడు ధైర్యము నించుకంతయు వదలక "ఈరీతిగా నీశ్వరనామము నుచ్చరించుకొనుచు నాప్రాణము లుపోయినఁ బోవుఁగాక! నేనుమాత్రము నాకార్యమును సాధింపకుండఁ గుటీరమునకు మరలువాఁడను గాను. దుఃఖమయం బగు నాజీవితమున కిఁక సుఖ మేమున్నది? నాప్రాణ

ముల నర్పించియైనను నాతల్లికష్టమును దీర్పఁగలిగినచో నాపుత్రజన్మము సార్థకము గాఁగలదు. ఎట్లయినను నారాయణమూర్తిని దర్శింపవలయును? నాతల్లిదుఃఖమును దీర్పఁ బ్రార్థించి దీనదయాళుఁడగు నాస్వామియనుగ్రహముచేఁ గృతార్థుఁడను గావలయును. అంతవఱకు నేనింటికిఁ బోఁజాలను?" అని నిశ్చయించుకొనియెను.

తనయుఁడు పోరువెట్టి యేడ్చుచున్నను దల్లితనపనితొందరచే నుపేక్షవహించి యుండఁగలదు గాని, భక్తునిప్రాణపణంబగు ప్రతిజ్ఞను దీర్పకుండఁ బరమేశ్వరుఁ డొకనిముషమైనను నిలువఁజాలఁడు. ఇది మూఢవిశ్వాస మని పామరులు పరిహసింతురుగాక! మేమట్టివారినిఁ బరిహసించుటకై కాని, ప్రబోధించుటకైగాని యీచరిత్రమును వ్రాయుట లేదు. జరిగిన విషయమును సత్యముగాఁ బ్రదర్శించుచున్నాము. విశ్వమయుండగు జగన్నాథుఁ డక్కుమారుని పావనదీక్షను బరీక్షించెను. ఆతనియంతరంగమును గ్రహించెను. ప్రహ్లాదప్రతిపాలకుఁ డగు పరమేశ్వరుఁ డాబాలకుననుగ్రహింప నిశ్చయించెను. తోడనే దీనబంధుఁ డగు నారాయణమూర్తి లక్ష్మీసహితుఁడై కిరాతదంపతీరూపమును దాల్చి యారాజకుమారుని యెదుట నాకస్మికముగ సాక్షాత్కరించెను. నిరంతర నారాయణనామోచ్చారణముచేఁ దదేకధ్యాననిమగ్నుఁడై పోవుచున్నసగరకుమారుఁ డాపురాణదంపతులవంకఁ జూడకయే తనదారిని



బోవుచుండెను. అప్పుడు నారాయణుఁడు మందహాసవదనముతో నాబాలుని సమీపించి "కుమారా! నీ వీయడవిలో నొంటిగాఁ దిరుగుచు నెవ్వరికొఱకు వెదకుకొనుచున్నావు?" అని ప్రశ్నించెను.

సగరకుమారుఁడు నిర్లక్ష్యభావముతో "నా నారాయణమూర్తికొఱకు వెదకుకొనుచున్నాను!" అని చెప్పి వెడలిపోవుచుండెను. అప్పుడు జగన్మాత యగులక్ష్మీదేవి యాతని చేయి పట్టుకొని "నాయనా! నారాయణుఁ డెవ్వరు? ఆతఁ డెందుండును?" అని ప్రశ్నించెను.

సగ—ఆతఁడు సర్వమయుఁ డనియు, నంతర్యామి యనియు గురుఁడగు నారదమహర్షి నాకుపదేశించియున్నాఁడు. కాని యింతవఱకు నాతఁడు పట్టుదలతో నాకదృశ్యుఁడై యున్నాఁడు. ఆతని నెట్లయిన దర్శింపవలయుననుకోరిక చేతనే నే నీయడవుల వెంటఁబడి తిరుగుచున్నాను.

లక్ష్మి—బిడ్డా! నీ కాతనితోఁ బనియేమున్నది? ఒకవేళ నిందెందైన నాతఁడు నీకగపడినచో నేమి చేయుదువు?

సగ—ఆతనిపని లేనివా రీజగంబుల నెవ్వరును లేరు. ఆదయామయుఁడు నాకంటి కగపడినచో నామనఃకష్టముం గూర్చియు, నాప్రాణయాతనం గూర్చియు నాతనికి నివేదింతును.

లక్ష్మి—తండ్రీ! అది చాలనసాధ్యకార్యము. ఆతని దర్శనము దుర్లభమైనది. ఊరక యేల శ్రమపడియెదవు? చల్లఁ

గా నింటికి మరలిపోయి తల్లికడ సుఖముగా నుండుము !

సగ—పోను. ఆ భక్తవత్సలుని దర్శించువఱకును నే నింటికిఁ బోను. నిద్రాహారములను బరిత్యజించి రేయింబవ లాతనినే ప్రార్థించుచుఁ దిరుగుచున్నాను. ఎప్పటికినిగూడ నా తనిదయ రాకయే యున్నచో నమృతమయంబగునాతనిదివ్య నామమును గీర్తించుకొనుచు నీదారుణారణ్యమధ్యమునందు నాప్రాణములను గూడఁ ద్యజించివైచెదను.

ఆరాకుమారుని ముద్దుపలుకులు లోకమాతయగునిందిరాదేవిహృదయమును నీరుగాఁ జేసివైచెను. ఆమె సకరుణంబగు కంపితస్వరముతో నేమియో చెప్పఁబోవుచుండఁగా నారాయణమూర్తి యడ్డమువచ్చి "వత్సా! దుస్సహదుఃఖావేశముచే నీకు మతి చెదరిపోయినది. కాకున్నచో నితరుల దర్శనమాత్రమునకై నీప్రాణములను ద్యజింపనిశ్చయింతువా? అందువలన నీ కేమిలాభము?" అనియెను.

సగ—లాభనష్టములకర్తృత్వము నాకేమున్నది? అన్నియు నీశ్వరాధీనములే కావా? ఈనాప్రాణముల నాతఁడే యనుగ్రహించినాఁడు. అతనిసొమ్ము మరల నాతనికే సమర్పించివైచెదను.

నారా—బాలకా! ఇది కేవలమును జిన్నతనపుమాటయే కాని యిందువలన నెట్టిప్రయోజనమును లేదు. భరింపరానికష్టముచే నీకుఁ బరమేశ్వరోన్మాదమెత్తినది. కేవలము



నాతనిమీఁదనే యాధారపడి యతికష్టముల ననుభవించుటకంటె నీవు తల్లియొద్దకుఁ బోయి పరస్పరప్రేమతన్మయత్వము నందు మీయిరువురును గష్టముల నేమఱచియుండుట మంచిది గాదా?

సగ—కాదు—నీవు నాకట్లధర్మమును బోధింపవలదు. తల్లికష్టమును దరలింపఁగలుగునంతవఱకును నాపాపపుమొగము నే నామెకుఁ జూపింపఁదలఁచుకొనలేను. అయ్యో! మా జనని యిదివఱకు మహారాజ్ఞీమణియై మహాభోగభాగ్యముల ననుభవించినది. అట్టితల్లికిప్పు డరణ్యమునం దొకటిరెండుకందమూలములు లభించుటకూడఁ గఱవైపోయెను. అర్కవంశమున జనించుటచే నాభిజాత్యగౌరవము గలరాజకుమారుఁడనగు నేను అంతటిదుఃఖము ననుభవించుచున్నతల్లిమొగము చూచుచు నెట్లు సహించి యుండఁగలను?

లక్ష్మి—కుమారా! ఆహారముఁ ద్యజించుటవలన నాఁకలిచే నీముద్దుమొగమంతయును వాఁడిపోయినది. అరణ్యగమనాయాసముచే నీకోమలాంగకము లన్నియును గసుగందిపోయినవి. తండ్రీ! నాయొద్దఁ గొన్నిపండ్లున్నవి. తినియెదవా?

సగ—నాకక్కఱలేదు. శ్రీమన్నారాయణునిసందర్శించువఱకును నేనెట్టియాహారమును గైకొనఁదలఁచుకొనలేదు. అనాహారినై యిన్నాళ్లుగడపితినిగదా! ఇంకనుగొన్నాళ్లుండఁజాలనా?

లక్ష్మి—తినుమునాయనా! తినుము! ఇంతటిమధురఫలము లెవ్వరికిని లభించునవి కావు. తండ్రీ! నీయందలిప్రేమచే నేను వీనిని నీకొఱకే తెచ్చియున్నాను. కుమారా! తినుము. తినుము.

సగ—వలదు. నాకిప్పుఁ డాహారముపై వాంఛ లేదు.

నారా—కుమారా! వలదని త్రోసివైవకుము. నీవాఫలములను గైకొని దాఁచి యుంచుకొనుము. మీతల్లికి రెండుపండ్లిచ్చి నీవు రెండుతినవచ్చును. తీసికొనుము.

సగ—ఇప్పుడు వానినిఁ గైకొని నే నేమి చేసికొందును ఈశ్వరదర్శనము నాకెన్నాళ్ళకు లభించునో యెవ్వరు చెప్పఁగలరు? అంతవఱకు నీఫలములు భోగ్యానుకూలములై యెట్లుండఁగలవు?

లక్ష్మి—బిడ్డా! నీకాసంశయమువలదు. ఆపరమేశ్వరుఁడు నీకిప్పుడే దర్శన మీయఁగలఁడు. అభీష్టఫలదాయకు నాతని దర్శించి యీఫలంబుల నారగింపుము. కుమారా! ఆఁకలిచే నిట్లు కృశించిపోకుము.

అనుటయు సగరుఁడు వినయవినమితుఁడై యంజలిపట్టి "అమ్మా! అట్లయినచో నిమ్ము" అనియెను. జగన్మాతయగులక్ష్మిదేవి ప్రసన్నవదనముతో నాతనికి ఫలములను ప్రసాదించి "కుమారా! నీవు మాయింటికి వచ్చెదవా?" అనియెను.

సగ—అమ్మా! మీయింటికి వచ్చినచో నేమిలాభము?



అచ్చట శ్రీమన్నారాయణునిదర్శనము లభించునా?

లక్ష్మిదేవి మందహాసము చేయుచు "కుమారా! ఆకఠినహృదయుఁడు నీవంకఁజూడనైనఁ దలఁపనప్పుడు నీ వాతనిదర్శనమునకై యింతపరితాపపడు టెందులకు? తండ్రీ! ఆతనిదర్శనము పరమదుర్లభమైనది!" అనియెను.

సగ—అమ్మా! అట్లయినచో నిజముగా నేనాతనిఁజూడఁజాలనా? నే నింతకష్టపడుచుండఁగాఁజూచుచుండియు నాతఁడు నన్ననుగ్రహింపఁడా? ఆతనివిశాలహృదయమునందు జాలియనుమాటయే లేదా? అట్లయినచో నాతఁడు దయామయుఁడని లోకులందఱు నేల కీర్తించుచుందురు? తల్లీ! నేను రేయింబవలాతనిపవిత్రనామమును స్మరించుకొనుచుఁ గన్నీరుమున్నీరుగా నేడ్చుచున్నాను. ఇట్లే నాపాపపుదేహమునుండి ప్రాణవాయువు లెగసిపోవునంతవఱకు నేడ్చుచునే యుండెదను. ఈవిధముగా నేడ్చుచునే ప్రాణములను త్యజించివైచెదను. ఆదీనదయాళుఁడింకను నన్నెంతకాల మిట్లేడ్పించునో చూతము! అయ్యో! ఆతనిదర్శన మెన్నఁటికిని లభింపనే లభింపదా? నాజీవితమంతయు నీరీతిగా—

అనుచుండఁగనే "కుమారా! కుమారా! భయము లేదు. భయము లేదు! నీసకలదుఃఖములును సడలిపోయినవి!" అని పలుకుచు శబరదంపతులు లక్ష్మీనారాయణులై సాక్షాత్కరించుటయు సగరకుమారుఁ డద్భుతానందపరవశుఁడై పరమా

చ్ఛస్వరంబున నామకీర్తనము చేయుచు భక్త్యావేశముచే నృత్యము చేయుచు "స్వామీ! దీనదయాపరా! నీకింతకాలమున కనుగ్రహము గలిగినదా? ఈదాసునిమాట యిన్నాళ్ళవఱకును నీతలఁపునకు రానేలేదా?" అనిపలుకుచు లక్ష్మీనారాయణులపాదధూళి శిరంబునఁ దాల్చికొని "పురాణదంపతులారా! మీదివ్యమోహనమూర్తులం దర్శించి నాకన్నులు సార్థకములైనవి. నేను ధన్యుఁడనైతిని. నాజీవితము చరితార్థమైనది!" అని పలుకుచు నానందోన్మాదముచే గంతులు వైవఁదొడంగెను.

అప్పుడు నారాయణమూర్తి జగత్పరిపాలనాక్షమంబగు తనదక్షిణహస్తముతో నాతని నెమ్మోము నిమురుచుఁ గౌఁగిలించుకొని యమృతమధురస్వరముతో "కుమారా! నీకేమికావలయును?" అని యడిగెను. సగరుఁడు పరమానందముతో "మహాత్మా! నాకితరవాంఛ లేవియును లేవు. మాతల్లిదుఃఖమును దొలఁగింపుము!" అని ప్రార్థించెను.

నారా—వత్సా! ఇఁకఁ గొలఁదిదినములలోనే మీ సకలదుఃఖములును వదలిపోఁగలవు. ఏశత్రువులమూలమున మీకిట్టికష్టములు గలిగెనో యట్టిశత్రువులను ముందుగా జయించుట నీకవశ్యకర్తవ్యమైయున్నది. నీవు శివారాధనముఁ గావించి యమ్మహాదేవునను గ్రహమున నస్త్రలాభముంబడయుము. మీసర్వసేనానాయకుఁడగు ప్రసేనుఁడు నిన్ను రాజగాఁ జేయ



గోరి సరయూతీరవనంబున సేనాసంపాదనముఁ గావించుచున్నాఁడు. మీసహాయదండనాథుఁడగు ప్రతివిందుఁడు పశ్చాత్తపుఁడై యిప్పుడు మీతల్లి నాశ్రయించియున్నాఁడు. మీసోదరి శోభనయు భయవిముక్తయై యిప్పుడు మీకుటీరమునే చేరియున్నది. నీవు వేగమ పోయి నీదండనాయకులం గలసి మహావీరుఁడవై దండెత్తిపోయి శత్రువినాశముం గావించి యయోధ్యారాజ్యమును బునరుద్ధరింపుము. నీకు శుభమగుఁగాక!

అనుచుండఁగనే సగరుఁడు భక్తిగద్గదస్వరముతో "మహాత్ములారా! దయామయులారా! మాతల్లికిఁగూడ మీదివ్యదర్శన మొసంగి యనుగ్రహింపుఁడు" అని ప్రార్థించెను.

నారాయణుఁడు మందహాసముచేయుచు "కుమారా! ఇది సమయము గాదు. నీపట్టాభిషేకసమయమున మాదర్శనము మరల మీయిరువురకును లభింపఁగలదు" అని యనుగ్రహించెను.

చూచుచుండఁగనే యంతలో లక్ష్మీనారాయణు లంతర్హితులైపోయిరి.

—

## ఇరువది రెండవప్రకరణము.

సౌభాగ్యదశ సమీపించినప్పుడు, సర్వేశ్వరానుగ్రహము సంపూర్ణముగ లభించినప్పుడు, జీవుల యెంతటిమహాకష్టములైననుదమయంతఁదామే మబ్బువిడిపోయినట్లువిడిపోవును. ప్రతివింధుఁడు సుమతిశోభనల నూఱడించి, ధైర్యము చెప్పి, విశ్వాసము గలిగించుకొని వారిసార్వాశ్రమమునుండిసురక్షితముగాఁ దీసికొనిపోయి ప్రసేనునిచేఁ గల్పింపఁబడిన శైలదుర్గమును జేర్చెను. ప్రసేనుఁడును, ప్రతివింధునిక్షమాప్రార్థనమును మన్నించి యాతని కెప్పటివలె సహాయదండనాయకాధికారము నొసంగెను. ఒక్కరాజకుమారుఁడే రావలసియుండెను గాని ప్రసేనునిచే నాగిరిదుర్గమునం దప్పుడే యయోధ్యారాజ్యము పునరుద్ధారితమయ్యెను. చాలమంది సైనికులు మంత్రిదుష్టపరిపాలనము నంగీకరింపక యుద్యోగములను ద్యజించి వచ్చియిదివఱకే ప్రసేను నాశ్రయించి యుండిరి. రాజకుమారు నన్వేషించి తీసికొనివచ్చుటకై స్వయముగాఁ బ్రసేనుఁడే పోయియుండెను.

ఆగిరిదుర్గమధ్యమునం దొకయంతఃపురమునఁ గూర్చుండి శోభన తదేకధ్యానముతో గోపాలమూర్తినిఁ బూజించుచుండెను. సుమతి మూర్తీభవించినశోకదేవతవలె నామెచెంతఁగూర్చుండి యీశ్వరప్రార్థనమును గావించుచుండెను. అట్లి



రువురును మౌనభావముతో నుండిరి. ఇరువురును ధ్యాననిమగ్నులై యుండిరి. కొంతసేపటికి శోభన తనపూజను ముగించి యాగోపాలమూర్తిని బుష్పాంజలియందుఁ జేర్చి కన్నులకద్దుకొనియెను. అప్పు డామె కాకస్మికముగా నెట్టిభావోదయమయ్యెనోగాని యానందముచే నున్మత్తురాలై కెవ్వనఁ గేకవైచి సుమతిచెంత కొక్కయుదుటున వచ్చి "పిన్నీ! చూడుము! చూడుము! మనగోపాలమూర్తి మందహాసము చేయుచున్నాఁడు. చూడుము. నేఁడు తమ్ముఁడు తప్పకుండ నింటికి వచ్చుచుసుమా!" అనియెను.

సుమతి యొక్క దీర్ఘనిశ్వాసమును విడిచి "అమ్మా! ఈనిర్భాగ్యురాలికి మరల నంతటియదృష్టమా?" అనియెను.

శోభ—పిన్నీ! నీవు నిశ్చయముగా నమ్ముము. మన దురదృష్టదినములు వదలిపోయినవి. గోపాలమూర్తి నవ్వుచున్నాఁడు చూచితివా! ఇఁకఁ దమ్ముఁడు తప్పక రాఁగలఁడు.

సుమ—తల్లీ! నీనిశ్చలభక్తికి మెచ్చి నీయారాధ్యదైవము సుప్రసన్నుఁడయ్యెను. భక్తితన్మయత్వముచే నీకాతని సుప్రసన్నవదనమును, మందహాసచంద్రికలును విస్పష్టములగుచున్నవి. భావనాలోకమునందు నీవీయనంతమూర్తితో నానందించుచున్నావు. అందుచేతనే యీయర్చామూర్తి నీతో నవ్వుచు నాడుచున్నాఁడు. అమ్మా! ఈచిఱునవ్వునకును, చిన్నితమ్ముని రాకకును సంబంధ మేమున్నది?

శోభ—పిన్నీ! అట్లుకాదు. ఈగోపాలమూర్తి లీలలు శుభాశుభములను సూచించు నని నే నెఱుంగుదును. నీవునక్కాదవో లేదో గాని యానాఁడు—మనయదృష్టమంతయు నొక్కసారిగా మరలిపోయిననాఁడు—మనకుటుంబమునకంతకు నమంగళము ప్రాపించిననాఁడు—ఈగోపాలమూర్తి సుందరవదన మెంతవికృతముగా నున్నదనుకొన్నావు!

సుమ—కుమారీ! ఆసంగతి నిజమే కావచ్చును. కాని మహాపత్సముద్రమునం బడి కొట్టుకొనుచున్న నాయశాంతహృదయమున కిట్టిశకునాదులయం దెంతమాత్రమును విశ్వాసము గలుగుట లేదు. మహారణ్యములపాలైపోయిన చిన్నికుమారుఁడు మరల లభించుట కలలోనివార్తగాదా! ఆపసిపాపని నేక్రూరజంతువులు తమపొట్టను బెట్టుకొనియెనో? అతఁడింకను జీవించియుండుననునాశ కవకాశ మేమున్నది? అమ్మా! ఈదురదృష్టవంతురాలు దుస్సహదుఃఖానుభవముకొఱకే జన్మించినది. ఆత్మేశ్వరునితోడనే యర్ధశరీరముపోయినదిగదా! ఇఁక నేకపుత్రునితో సర్వనాశనమైపోయినది. తల్లీ! తనయయైనను,దనయుఁడైనను, యీశేషదుఃఖజీవితమునందు నిన్నే సుఖలేశముగఁ జేసికొని సర్వమును మఱచి సర్వేశ్వరధ్యాననిమగ్ననైయున్న నాకు మరలఁ బూర్వస్మృతి గల్పించి యీ విధముగా నేలయాశపెట్టెదవు?

శోభ—తల్లిప్రాణముగావున నిట్లు తల్లడిల్లుచున్నది



గాని తమ్ముఁడు నేఁటిదినమునఁ దప్పకవచ్చితీరునమ్మా! ఈగోపాలమూర్తి యెవ్వనిమూర్తియో, యాపరమేశ్వరుని దివ్యసుందరమూర్తిని నేను సందర్శించియున్నాను. ఆతనియలౌకికప్రభావమును గ్రహించియున్నాను. ఆదయామయునిమూర్తిని బూజించుచున్న నన్నాతఁ డాపత్సముద్రమునుండి యుద్ధరించియున్నాఁడు. ఆతనిపవిత్రనామమును నిరంతరమును గీర్తించుచు నారాధించుచున్న తమ్మునిమాత్ర మనుగ్రహింపక విడుచునా? అట్లయినచో దేవర్షియగునారదమునీంద్రుని దివ్యప్రబోధము మిథ్యోపదేశముగాదా? పాపమేజయించి పుణ్యమునకు సంపూర్ణముగఁ బరాజయమే తటస్థించినచో శ్రుతిస్మృతిపురాణాదులును, ధర్మశాస్త్రములును గేవల మసత్యకల్పనములైపోవా?

సుమ—అమ్మా! హతాశురాల నగునాకంతవఱకు నాలోచన పోవుట లేదు. ఆపన్నిమగ్న నగునాకంతటిధైర్యము నిలుచుట లేదు. సగరకుమారునిమూలమున నపితృవంశము శాఖోపశాఖలై జగద్రంగమున శాశ్వతత్వమును గాంచుననియు, నీవంశము వారిచే నభూతపూర్వంబును, శాశ్వతంబును, బ్రశంసనీయము నగునొకఘనకార్యము నిర్వహింపఁబడుననియుఁ బొరపాటున దేవర్షియగునారదుఁడు చెప్పియున్నాఁడు. ఎంతటిధీమంతులకైన నొక్కొక్కప్పుడు ప్రమాదములు తటస్థించుచుండునుగదా? కాకున్నచో మహావీరుఁడును, రాజ

కార్యనిపుణుఁడునగు మీతండ్రి తనరాజ్యమంతయు మంత్రి చేతి కొప్పగించుట యేమి ?

శోభ—ఇందుఁ దండ్రిగారితప్పేమియును లేదు. అంతగా మంత్రిదోషమును లేదు. మాతల్లిమహాపాపబుద్ధిచే నింతటియాత్మద్రోహమును గావించుకొన్నది. ఆపాపాత్మురాలి గర్భమునందు నేను జన్మించుటయే యింతకును గారణమైనది.

సుమ—అమ్మా! అట్లనుకొనకుము. నీవు జనించుటచేతనే సవితృవంశమునకుఁ బుత్త్రసంతతి నశించిపోయినను దుహితృవంశమైనను వర్ధిల్లుట కాధార మేర్పడినది. తల్లీ! నీవైన నయోధ్యారాజ్యేశ్వరివై యుభయవంశముల నుద్ధరింపఁగలవనునాశ యొక్కటియే నాదుఃఖజీవితమునం దానంద లేశమై మిగిలియున్నది. ఈయాశ ఫలించుటం గాంచి యానందముతో నే నప్పుడు చితానలమునఁ బ్రవేశించి సతీధర్మమును నిర్వహింప నిశ్చయించుకొనియున్నాను.

శోభ—పిన్నీ ! అట్లెన్నఁటికిని గాఁజాలదు. నేను సవిమర్శముగను సప్రమాణముగను జెప్పుచున్నాను వినుము. పాపసంకల్పము లెన్నఁటికిని ఫలసిద్ధి నందఁజాలవు. మాతల్లి యెట్లయిన నాకు రాజ్యమును జెందింపవలయునని మహాపాపకృత్యముం గావించినది. దానికి బ్రతికూలముగా మంత్రి యీరాజ్యమును కరగతముఁగావించుకొనియెను. అన్యాయముగ నాక్రమించుకొనిన యీరాజ్యముమూలమున నిప్పుడా



మంత్రికిఁగూడ నాత్మవినాశ మగుటకు సిద్ధముగా నున్నది. పాపము ఫలోన్ముఖ మైనను పరిపాకమున వైరస్యము నందక మానదు. అమ్మా! ఇప్పుడు నీవు నన్ను రాజ్యేశ్వరిగాఁ జూడఁగోరుట పాపపక్షమునకు బలము గల్పింపఁజూచుట యగుచున్నది. నీకుఁ దీరని మహోపకారముం గావించిన నీసవతి బిడ్డనైనను నీవు న న్నాత్మజగానే భావించి యతిప్రేమతో నా శ్రేయము నభిలషించుచున్నావు. కాని యిదియు నొకవిధముగాఁ బాపమే యగునేమో యని భయపడుచున్నాను. సహజనిర్మలచరిత్రవగునీ మెడల నిట్టికళంకశంకగూడ నాహృదయమును గలఁచివైచుచున్నది. ఏమనిన—నాయందలిప్రేమచేతనే పాపాత్మురాలగు నాతల్లి నన్ను రాజ్యేశ్వరిగాఁ జేయఁ జూచినది. నీవుగూడ నట్టిప్రేమచేతనే రాజ్యేశ్వరినగు నన్నుఁ గాంచి యానందింపఁదలంచితివి. ఇందు భావభేదమున్నను పర్యవసాన మొక్కటియే,గావున నీవంటియుత్తమచరిత్రయట్లు తలంచుట పాపమేమోయని తోఁచుచున్నది. తల్లీ! ఎల్లవిధముల ననుభవమునకు వచ్చుటచేఁ బాపకళంకసంశయము నన్ను బాధించుచున్నది. నేను పాపాత్మురాలిబిడ్డనైనను భాగ్యవశమున నీయాశ్రయముం గాంచితిని. నేను నీసవతిబిడ్డ ననుమాట మఱచిపొమ్ము. నీప్రేమార్ద్రహృదయమునందు నాకించుక తావొసంగుము. స్వీయరాజ్యమునందు యథేచ్ఛాప్రచారముఁ గావింపనిమ్ము! "అమ్మా!" యనునాహ్వాన మింకొక

ష్పుఖును నీహృదయమునే యాకర్షించుఁగాక! జగత్పవిత్రమగు నీనూత్నమూర్తినే యనుసరించుఁగాక! నీపవిత్రప్రేమనే యధిగమించుఁగాక—

అని యీవిధముగా శోభన ప్రేమోన్మాదముచేఁ బలుకుచుండఁగా దూరమునుండి నలుదెసలును ప్రతిధ్వనితము లగునట్లు విజయభేరీధ్వనులు వినవచ్చెను. అప్పు డయ్యిరువురు నాశ్చర్యముతో నాలకించుచుండఁగా నంతలో "సగరకుమారసార్వభౌమునకు జయ్! సవిత్రువంశోద్ధారకునకుజయ్! సత్యధర్మసంస్థాపకునకు జయ్" అను జయజయధ్వానములు మిన్నుముట్టి చెలరేఁగిపోవుచుండెను. ఆకస్మికముగ నదియంతయు నాలకించి శోభన యానందతాండవము చేయుచు—

"జయజయ బృందావనగోపాలా!
జయ గోపవధూలోలా
నయగుణజాలా, నవనవఖేలా
నరనారాయణలీలా"

అని సంకీర్తనము చేయఁదొడంగెను. ఆనందపారవశ్యముచే సుమతి కాత్మస్మృతియే లేకుండఁబోయెను.

---

## ఉపసంహారము.

పుణ్యవిజయ మైనది. పాపము పరాజితమైపోయినది. సగరకుమారసార్వభౌముఁడు ప్రసేనసేనాసహితుఁడై వచ్చి దుర్గమును ముట్టడించె నని తెలియుటతోడనే కోటలో మిగిలియున్న సేనలన్నియుఁ బోయి కుమారచక్రవర్తిశరణముం గాంచి యెప్పటివలెఁ బ్రసేనునియధికారమునకు లోఁబడిపోయెను. ఆకారణముచే మహారణము గాకుండఁగనే—మహీతలమంతయును రక్తప్లావితముగాకుండఁగనే—సగరచక్రవర్తికి పితృపైతామహంబగు సామ్రాజ్యమంతయును స్వాధీనమైపోయెను.

సగరకుమారుఁడు సార్వభౌమవైభవముతోఁ గోటలోఁ బ్రవేశించుచుఁ దనపితృసఖుఁడగుకుటిలుని, పూర్వాశ్రితుఁడగు మంత్రినిగూడఁ జంపవలదనియు, వారినిఁ బట్టి తీసికొనిరావలయుననియుఁ బ్రసేనున కుత్తరువు చేసెను. ఆయాజ్ఞవిన్నంతనే మంత్రికుటిలులు కుమారసార్వభౌమునియసాధారణక్షమాగుణంబునకు మహాశ్చర్యమునంది ధనలోభముచేఁ దాముగావించిన స్వామిద్రోహకృత్యమునకుఁ బశ్చాత్తప్తులై తమపాపపు మొగములను బ్రభుకుమారునకిఁకఁ జూపింపఁజాలక పాపభయహారి యగుపరమేశ్వరునిఁగూర్చి పలవించుచు మరణానంతరమునఁ జటప్పింపనున్న దారుణనరకయాతనలకై రత్వముతలం

పునకువచ్చుచున్నను, ప్రభుసన్నిధిని, ప్రజాసమక్షమున నిలువఁబడి యనుభవింపవలసియున్న పరాభవదుఃఖ మంతకంటెను దుస్సహాముగాఁ దోఁచుటచే నాకస్మికముగ నాత్మహత్యఁ గావించుకొనిరి. స్వయముగఁ బాపాచరణముఁ గావింపకున్నను బాపసంగిని యగుమల్లిక తనభవిష్యముం దలఁచుకొని భయభ్రాంతయై పద్మదావనమందిరమును విడిచి పాఱిపోయెను.

కులగురుండగు వసిష్ఠునిచే నుపదిష్టంబగు శుభముహూర్తమునందు సగరకుమారసార్వభౌముని పట్టాభిషేకము మహావైభవముతో జరిగిపోయెను. ఆమహోత్సవమునకు భూమండలమునంగల సకలమహీపతులును, సర్వదేవతాసహితంబుగ దేవేంద్రుఁడునుగూడ విచ్చేసి సకలశుభకార్యంబులును సంపన్నంబులుగాఁ జేయించిరి. లోకకల్యాణార్థమై తానొనరించిన మహాత్కార్య మీనాఁటికి నిరంతరాయముగా సఫలంబయ్యెనను నానందముతో దేవర్షి యగునారదుఁడు తనవీణాస్వరముతోఁ గంఠస్వరమును లీనముజేసి పరమేశ్వరునిఁ గీర్తింప నారంభించెను.

ఆసమయంబున భక్తబాంధవులగు లక్ష్మీనారాయణులు సాక్షాత్కరించి పట్టాభిషిక్తుఁడగు సగరకుమారునిఁ జక్రవర్తివై శాశ్వతకీర్తినంది సవితృవంశము నుద్ధరింపుమని సర్వదేవతాసమక్షంబున నాశీర్వదించి శోభనకుఁ బునర్దర్శనంబును, సుమతికిఁ బ్రథమసందర్శనంబును గటాక్షించి యయ్యిరువురినిం



గూర్చియు ధన్యవాదములం గావించి యంతర్హితులైరి. అప్పుడు సుమతి యానిండుసభలో వసిష్ఠసన్నిధానంబున సార్వభౌముండగు సగరకుమారు నుద్దేశించి ప్రేమశోకగద్గదస్వరముతో "కుమారా! నీపట్టాభిషేకమును గన్నులారఁ గాంచుటచే నాజీవితము ధన్యమైనది. ఈభాగ్యము నాస్వామియగు నీజనకునకు లభించినదిగాదు. నాయనా! ఇదియే నాకుచితసమయము. ఇఁక విలంబము సేయవలదు. చితానలమునఁ బ్రవేశించి యతిత్వరితముగ నాయాత్మేశ్వరునిం గలిసికొనుట కానతియొసంగుము. ఓ దేవతలారా! మీరందఱును స్వధర్మనిర్వహణమునకై నాకాజ్ఞ నొసంగుఁడు!" అని ప్రార్థించి ధర్మతత్పరులగువారి యనుమతిని సుమతి తనసతీధర్మమును నిర్వహించుకొని ధన్యురాలయ్యెను.

అప్పు డాకస్మికముగా నున్మాదిని యగువిమతి యచ్చటికి వచ్చి "సుమతీ! పోకుము. పోకుము. సుఖదుఃఖమయంబగు నీపాపప్రపంచమును విడిచి పరమశాంతినిలయంబగు ననంతధామమునందలి యానందము నీవొక్కతెవే యనుభవింపఁ దలఁచితివా? సుమతీ! నేను నీకంటెఁ బెద్దదానను గానా? నీతోడిదాననుగానా? పతిసేవాభాగ్యము నన్ను వంచించి నీవొక్కతెవే యనుభవింతువా? నీభాగ్యమునందు నాకుఁ భాగమున్నదిగాదా? ఓ సర్వదేవతానరులారా! పాపాత్ములగు నీవిమతి పాపకృత్యములకుఁ దగినప్రాయశ్చిత్తమైనది.

త్యకాలమునం దీయనాథకు శాంతిలాభము చేకూరున ట్లాశీర్వదింపుఁడు—ఏకపుత్రీ! శోభనా! నిర్భాగ్యురాలగునీతల్లి పాపఫలము ననుభవించి తుదకు నిన్ను శాశ్వతముగా విడిచిపోవుచున్నది. అమ్మా! ఇఁక సార్వభౌముఁడగు నీసోదరుఁడే సర్వస్వమునై యున్నాఁడు. ఇఁక నా మొగము నెవ్వరికిని జూపఁజాలను." అని కేకలు వైచుచు శ్రీహరినామస్మరణము చేయుచు జ్వాలామయంబగుచితానలమధ్యమునం దుఱికి పాపపంకముతోఁ గూడ నిమిషములో భస్మమైపోయెను.

తరువాత శోభనచరిత్ర మేమయ్యెనో పురాణములను పరిశోధించి యెంతైనఁ గానవచ్చినచో ముందొకప్పుడు విపులముగా వ్రాసి ప్రదర్శింతుము. కష్టసుఖమయం బగునీప్రపంచమునందలిజీవచరిత్రములనే యాధారముగఁ జేసికొని కవులు కావ్యములను రచించుచుందురు. అందుచేతనే యట్టి కావ్యములు కష్టాంతరములో, సుఖాంతరములో యగుచుండును. కాని యీపుణ్యవిజయమునుమాత్రము కష్టసుఖాంతమైనది. ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు మొదలగుపరమభక్తులవలెనే సగరకుమారుఁడును బాల్యదశయందు మహాకష్టములపాలైనను తుదకు షట్చక్రవర్తులలో నొకఁడై ప్రసిద్ధిం గాంచి వంశకర్త యయ్యెను. ఆసగరసార్వభౌమునిపుణ్యచరిత్రముం గూర్చి దేవర్షియగు నారదమునీంద్రునిదివ్యవల్లకీతంత్రులనుండి నాఁడు వలు నేఁటి వఱకును—



"సా ప ప రి మ ధ నీ స ధ నీ
సా గ రీ గా ధా
స గ రి మా ని గ మ స మ ధా మా
స మ గ మా సా మ ప ధ సా ధ ని"

అనుపమమృతోపమానంబులగు మధురస్వరములు వెలువడి సర్వజీవహృదయాంతరాళములను ప్రతిధ్వనించుచు సాగరతరంగఘోషములలోఁ గలసి విలీనములైపోవుచుండెను. ఆరత్నాకరశీకరంబుల శీతలత్వముం గాంచి యటనుండి ప్రదక్షిణంబుగా మలయాచలంబులను జుట్టివచ్చు మధురసౌరభమందమలయానిలతరంగములలో నిప్పటికిని గూడ—

"జయజయ సగరకుమారా !
జయ జయ జయ కోసలేశ శత్రువినాశా
జయ సార్వభౌమచంద్రా
జయ జయ భక్తిమయ విజయజయ పుణ్యమయా!"

అను జయధ్వానము లస్పష్టముగా వినవచ్చుచునే యుండును.

---

# అనుమతి.

(Approved for School use.)

అనంతామాత్యుని భోజరాజీయమునుండి కూర్పఁబడిన పద్యకావ్యము. మూఁడు, నాలుగు, అయిదు, ఫారముల విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగ ననుకూలపడుటకు సరియగురీతిని బండితులచేఁ బరిశోధింపఁబడి ప్రచురింపఁబడిన పుస్తకము. మేలగు గ్లేజుకాగితముపై నచ్చువేయఁబడినది.

వెల రు. 0—8—0 మాత్రమే.

*For Copies apply to —*

**Messrs. SRISITARAM & Co.,**
**Publishers,**
**Jagannaikpur, COCANADA.**

# స్త్రీలవ్రతకథలు.

(నోముల కథలు.)

ఈపుస్తకములు మూఁడుభాగములుగా ప్రకటింపఁబడినవి. వీనియందు 97కథలుగలవు. ప్రతిహిందూస్త్రీయును నిత్యమును పట్టువ్రతములు, వాని ఉద్యాపనములు, కథలు మొదలగునవి యిందుగలవు. ఈపుస్తకములు హిందూస్త్రీలకత్యంతావశ్యకములు.

ఒక్కొక్కభాగము వెల రు0-6-0. మూఁడుభాగములు కలిపి రు 1-0-0 మాత్రమే. పోస్టేజిఖర్చులు కొనువారేభరింపవలెను. ఈమూఁడుభాగములపుస్తకములును అమ్మకమునకు నాయొద్ద సిద్ధముగా నున్నవి. మొత్తముగాతీయు వర్తకులకు మంచికమీషను యియ్యఁబడును.

ఈపుస్తకములు కొందఱు నాయనుమతిలేనిదే అక్రమలాభాపేక్షతో నాకాపీరైటుహక్కును భంగపరిచి ముద్రించి ప్రకటించి విక్రయించుచున్నారు. అట్టివారిపై నేను సివిలు క్రిమినలుచర్యలు జరిగించినాను. నేను రాజమండ్రి జిల్లాకోర్టులో O. S. No. 2 of 1927 నెంబరున దావాచేసి నాకాపీరైటుహక్కును స్థిరపర్చుకొన్నాను. ఇఁకముందెవ్వరైనను నాకాపీరైటుహక్కును భంగపర్చి యీపుస్తకములను ప్రకటించినయెడల నేనుజరిగించు సివిలుక్రిమినలుచర్యలకు వారు బాధ్యులగుచున్నారు. కాబట్టి నాయనుమతిలేనిదే యెవ్వరును యిపుస్తకములను ఏవిధముగను ముద్రించి విక్రయింపఁగూడదు.

ది 1-4-1930. బాలాంత్రపు వెంకట్రావు
గ్రంథకర్త & ప్రకాశకుఁడు.
ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, పిఠాపు

## శ్రీ పులుగుర్త లక్ష్మీనరసమాంబగారి

## గ్రంథములు

| | |
|---|---|
| సుభద్ర | 0-14-0 |
| చైతన్యస్వామి | 0-12-0 |
| జడభరతుఁడు | 0-12-0 |
| అష్టదిగ్గజములు | 0-10-0 |
| సత్కథావల్లరి | 1- 0-0 |
| నీతిపద్యములు | 0- 4-0 |
| మంగళహారతులశతకము | 0- 8-0 |

For copies apply to :—

**P. Brundavana Sarma, B. A.**

***Sree Savitri Office,***

**COCANADA.**

